

శ్రీమతే రామానుజాయనమః

# తిరువాయ్ మొழி ప్రబంధ సారం

పండితరత్న, శ్రీమాన్ డా|| ఈ.ఏ. శింగరాచార్యస్వామి



'పద్మవిభూషణ', 'మహామహోపాధ్యాయ' ఉ.వే.శ్రీమాన్
కాఞ్చీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామివారు



న్యాయవేదాన్త విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారు,

శ్రీమతి సీతమ్మగారు

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీమాన్ కాఞ్చీ ప్రతివాదిభయంకరం

అణ్ణంగరాచార్య స్వామివారు అనుగ్రహించిన

# తిరువాయ్ మొழி ప్రబంధ సారం



అనువాదం

'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

*సంపాదకుడు: ఈయుణ్ణి అనంత రంగ రామన్*

# విజ్ఞప్తి

కాంచి మహావిద్వాన్ ప్రతివాదిభయంకరమ్
అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన తిరువాయ్ మొழி ప్రబంధసార గ్రంథాన్ని ఇంతకుముందే కుమారుడు శ్రీమాన్ అంతరంగ రామన్ సహకారంతో సిద్ధం చేసి, పిడిఎఫ్ రూపంలో భాగవతలోకానికి సమర్పించడం జరిగింది. ఆ గ్రంథం ఇప్పుడు పుస్తకంగా రూపాన్ని దిద్దుకొని, ఆస్తికుల కరకమలాలను అలంకరిస్తున్నది. ఇందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది.

అంతేకాక, ఈ గ్రంథం, దాసుని పితృపాదులు, కీర్తిమూర్తులు, న్యాయ వేదాంతవిద్వాన్, ఉభయవేదాంత భాస్కర, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అనంత వేంకటరంగ రామానుజాచార్య స్వామివారి ప్రథమాబ్దిక సందర్భంగా ప్రచురింపబడడం కూడా ఒక విశేషం. ఈ గ్రంథ ప్రకాశనంలో ఆర్థిక భారాన్ని వహించడానికి సిద్ధపడి, ఆ కైంకర్యాన్ని చేస్తున్న సహృదయులు శ్రీమాన్ కె. టి.జి రామానుజాచార్య స్వామివారి, వంగల వేంకట కృష్ణమాచార్యస్వామి వారి సన్నిధిలో అనేక కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను. ఆ విధంగానే, ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి సహకరించిన కర్షక్ ప్రింటర్స్ అధినేత రెడ్డిగారిని కూడా అభినందిస్తున్నాను. స్వస్తి.

# అవతారిక

శ్రీవైష్ణవ సంప్రదాయంలో నమ్మాళ్వారులు అనుగ్రహించిన 'తిరువాయ్ మొళ్లి' ప్రబంధానికి సాటిలేని గౌరవం ఉన్నది అనే విషయం లోకప్రసిద్ధం. అది పది దశకాలు కలిగినది. ప్రతి దశకంలోను నమ్మాళ్వార్ల అనుభవం ఎటువంటిది అనే విషయాన్ని తెలిసికోవడం కోసం శ్రీ వరవరమునుల 'తిరువాయ్ మొళ్లి నూఱ్ఱన్దాది' అనే ప్రబంధం అవతరించింది. కానీ ఆ గ్రంథం చాలా సంగ్రహంగా ఉన్నందున, ప్రతి



**నమ్మాళ్వార్ - ఆళ్వార్ తిరునగరి**

దశకంలోని తాత్పర్యాన్ని వివరంగా తెలుసుకోవడానికి కాంచీ నగర వాస్తవ్యులు, **మహామహిమోపాధ్యాయ, శ్రీమాన్ ప్రతివాది భయంకరం**

**అణ్ణంగరాచార్యస్వామివారు** 'తిరువాయ్ మొళ్లి' ప్రబంధానికి రచించిన దివ్యార్థ దీపిక వ్యాఖ్యానంలోని అవతారికలను అన్నిటినీ చేర్చి ఒక గ్రంథంగా రూపొందించడం జరిగింది. దీనివల్ల 'తిరువాయ్ మొళ్లి' ప్రబంధంలోని పది శతకాల సారాన్ని తెలుసుకునే అవకాశం ఉంటుంది కదా. ఈ గ్రంథం "**అణ్ణాస్వామి అముదమొళ్లి ఆయిరమ్**" అనే తమిళ గ్రంథంలోని ఒక భాగం. దీనిని అనువదించడానికి అనుమతించి సహకరించిన శ్రీస్వామివారి మనుమలు **ఉ.వే. శ్రీమాన్ రాజహంసమ్ స్వామివారికి**, **వారి సహోదరులకు** అనేక కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని సంపాదించడంలో తన వంతు సహకారాన్ని అందించిన చిరంజీవి, కుమారుడు అనంతరంగరామన్ కు అనేక మంగళా శాసనాలు. స్వస్తి.

1)భక్తిజ్ఞానవిరాగతాకరవరః శ్రీమాన్ శఠారిర్మునిః
చక్రే గీతసహస్రభాస్వరమహాకావ్యం రసైః బంధురమ్ |
నానాభావసమంచితం శ్రుతిసుఖైః శబ్దైశ్చ సందర్భితం
దివ్యానందద మాస్తికామలహృదాం సర్వార్థదం సుందరమ్ ||

2)పూర్వాచార్యకృతైశ్చ పంచభిరిదం రత్నాయమానాద్భుతైః
వ్యాఖ్యానైః పరికర్మితం విలసతి ప్రాజ్ఞాశయానందదమ్ |
కాచి త్తేషు విరాజతే హ్యనుపమా నంబిళ్ళై నామ్నా నుతై
రాచార్యప్రముఖైః కృతా జగతి చ ఖ్యాతేడునామాంకితా ||

3)తద్వ్యాఖ్యా మనుసృత్య విశ్వవిదితైః విద్వద్వ్రతంసాయితైః
హస్త్యద్రీశగురుత్తమైః విరచితః కశ్చిత్ ప్రబంధో వరః |
యస్మిన్ శ్రీశఠకోపసూరిసుకృతేః భాతి ప్రమేయోఽఖిలః
వాణ్యాంఽఢ్ర్యా క్రియతే వివర్తనమిహాస్య ప్రీతిసిద్ధ్యై సతామ్ ||

4)యది కించిత్ సౌగుణ్యం విభాతి తత్సర్వ మిహ గురోః కృపయా |
దోషా స్సర్వేఽజ్ఞానాత్ మమేతి విబుధాః విజానీయుః ||

భాగవతదాసుడు
ఈ.ఏ.శింగరాచార్యులు



# విషయ సూచిక

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# తిరువాయ్ మొళ్ళి ప్రబంధ సారం

## 1)ప్రథమ శతకం-ప్రథమ దశకం
## # ఉయర్వఱ




"ఉయర్వఱ" అని ప్రారంభం అవుతున్న మొదటి దశకంలో - తమకు మహోపకారం చేసిన భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించి తరించమని తన మనసుకు నమ్మాళ్వార్లు ఉపదేశిస్తున్నారు. మన సంప్రదాయంలో ఇతర మతాలవారి అభిప్రాయంలోవలె భగవంతుడు గుణాలు లేని వాడు కాడు. అన్ని మంచి గుణాలను సహజంగా కలిగినవాడు–అనే వేదాంత సిద్ధాంతాన్ని ఆళ్వార్లు మొదటి పాశురం మొదటి పాదంలో తెలియజేస్తున్నారు. దీనివల్ల భగవంతుడు తన కళ్యాణ గుణాలను ఈ ఆళ్వార్లకు చూపి, వారిని వశం చేసుకున్నాడని తెలుస్తున్నది.

'గుణాలకు జితులై సేవ చేయడం' అని, 'సహజంగానే సేవ చేయడం' అని కైంకర్యం రెండు విధాలుగా ఉంటుంది. వీటిలో, గుణాలకు ఆకర్షింపబడి సేవ చేయడం కంటే సహజంగానే సేవ చేయడం గొప్పది–అనేది సంప్రదాయ సారార్థం అయినా, శఠకోపులు తమను భగవంతుడు తన కళ్యాణ గుణాలను చూపించే వశం చేసుకున్నాడు కనుక, తాము ఆకర్షింపబడిన విషయాన్ని గూర్చి ముందుగా ఇందులో తెలుపుతున్నారు – అని తెలియాలి. సహజ సిద్ధమైన కైంకర్యం ఆళ్వార్లకు ఏలోటు లేకుండా ఉన్నది–అనే విషయం **"ఆకిలుమ్ కొడియ ఎన్నెంజమ్ అవనేన్ఱే కిడక్కుమ్"** (అయినప్పటికీ, కఠినమైన నా మనస్సు ఆ స్వామి విషయంలోనే ఆసక్తి కలిగి ఉన్నది )అనే పాశురంలో వ్యక్తం చేయబడడం గమనించవచ్చు. అంతేకాక, ఈ దశకంలో శఠకోపులు భగవానుని పరత్వాన్ని తెలియజేసే పలు స్వభావాలను, చరిత్రలను ప్రస్తావించి, దశకాన్ని పూర్తి చేశారు. అందువల్ల ఈ దశకం భగవంతుని పరత్వాన్ని తెలుపుతున్నది.



**శ్రీ వరదరాజపెరుమాళ్ - కంచి**

# 2)ప్రథమ శతకం-ద్వితీయ దశకం
# # వీడుమిన్ ముఱ్ఱవుమ్

ఆళ్వార్లు తాము అనుభవించే అనుభవం ఏకాంతంగా, ఒంటరిగా అనుభవించదగినది కానందువల్ల, **"మచ్చిత్తాః మద్గత ప్రాణాః బోధయంతః పరస్పరం"** (నాలోనే మనస్సు నిలిపిన వారై, నాపై ప్రణాలను నిలిపిన వారై, పరస్పరం నా గుణలీలాదులను తెలుపుకుంటూ ఉందే వారు) అని గీతాచార్యుడు పలికినట్లుగా, ఇతరులతో కలసి కాలక్షేపం చేసి, ప్రాణాలను నిలుపుకోవాలని కోరుకున్నవారు కనుక, వారు తమవంటి అధికారుల కోసం నాలుగు వైపులా దృష్టి పెట్టి చూశారు. అందరూ సంసారంలోని మునిగి ఉండడాన్ని గమనించారు. తాము భగవానుడనే విషయంలో ఆసక్తిని కలిగి ఉన్నట్లుగా, వారు కూడా లౌకిక విషయాలలో ఆసక్తులై ఉండడం ఆళ్వార్లు గమనించారు. ఆ విధంగా వారు పొందే అనర్థాన్ని చూచి సహించలేనివారు కనుక, వారిని ఏ విధంగా అయినా సరి అయిన దారిలోకి తీసుకురావాలని భావించారు. "వీరిని చూస్తే సంసారులై ఉన్నారు. లౌకిక విషయాలలోని తక్కువదనాన్ని తెలుసుకొని, చెడ్డ విషయాలను వదలి పెట్టి, మంచి విషయాలను పరిగ్రహించగలిగితే బాగుపడతారు. వీరు తగిన పరిశీలన చేయకుండా ఉన్నారు. భగవద్విషయంలోని గొప్పదనాన్ని, లౌకిక విషయాలలోని నైచ్యాన్ని వీరికి తెలియజేస్తే, వాస్తవాన్ని తెలుసుకొని, తగని విషయాలను వదిలిపెట్టి, భగవానుడనే మంచి విషయాన్ని వీరు గ్రహించే అవకాశం ఉంటుంది కదా! అందువల్ల మంచిని ఉపదేశించి చూస్తాను" – అని భావించి ఆళ్వార్లు భగవంతుని గొప్పతనాన్ని, సంసారులు ఇంత కాలంగా ఆశ్రయించిన విషయాలలోని అల్పత్వాన్ని, అవి అనిత్యాలు అనే విషయం

మొదలైనవానిని తెలియజేస్తూ, "విషయంతరాలను విడచిపెట్టి భగవద్భక్తి పొందండి" – అని ఈ దశకంలో ఉపదేశిస్తున్నారు.

## 3)ప్రథమ శతకం-తృతీయ దశకం
## # పత్తుడై

మొదటి శతకంలోని మొదటి దశకంలో భగవానుని పరత్వగుణాన్ని గూర్చి ఆళ్వార్లు పలికారు. రెండవ దశకంలో పరోపదేశ రూపంగా దానిని తెలియజేశారు. ఆ విధంగా పరోపదేశం చేసిన ఆళ్వార్లను చూసి సంసారులు "స్వామీ! భగవంతుని భజన చేయండి–అని మీరు పలుమార్లు అంటున్నారు. కుంటివాడిని ఎత్తుగా ఉండే ఏనుగును ఎక్కమంటే ఎక్కగలడా! ఆ విధంగానే, సర్వేశ్వరుడు **"నాకణైమిశై నమ్పరర్ శెల్వర్ పెరియర్"** (ఆదిశేషునిపై శయనించిన మన స్వామి చాలా ఉన్నతుడు) అనే విధంగా చాలా ఉన్నతుడు. అతనిని నీచులం, సంసారులమైన మేము ఆశ్రయించగలమా?" అని ప్రశ్నించారు. అప్పుడు ఆళ్వార్లు వారిని చూసి "ఉన్నతమైన ఏనుగు కుంటివాడు కూడా తనపై ఎక్కగలిగేటట్లు కూర్చుని సహాయంగా తన తొండాన్ని ఇచ్చినప్పుడు, ఆ ఏనుగును ఎక్కడంలో ఏ కష్టం ఉండదు కదా! ఆ విధంగానే సంసారులకు కూడా ఆశ్రయించడానికి వీలుగా తనను సులభంగా చేసికొని, అందరికీ ఆశ్రయించడానికి వీలుగా ఉన్నాడు అందువల్ల అతనిని ఆశ్రయించి భజించడంలో ఏమి కష్టం ఉన్నది? అడ్డు ఉన్నది? అని ఈ దశకంలో పలుకుతున్నారు.

భగవంతుని పరత్వాన్ని వర్ణించ గలిగితే వర్ణించవచ్చు. కానీ, సౌలభ్యం అనే గుణాన్ని స్తుతించడం మాత్రం చాలా అసాధ్యం. అటువంటి గొప్పవాడు ఈ విధంగా అందరికీ సుభుడై ఉన్నాడు కదా! అని మనసులో ద్రవించి, గొంతు గద్గదంకాగా,

ఆనంద బాష్పాలు కారగా పలుకవలసిన విషయంకదా, భగవంతుడనే విషయం. ఆళ్వార్లను ఆరు నెలల కాలం మోహాన్ని పొందేటట్లు చేసిన విషయం కదా భగవద్విషయం.

## 4)ప్రథమ శతకం-చతుర్థ దశకం

## # అంజిరైయ మడనారాయ్

భగవానుని భక్తులు అనుభవించే రీతులు విధాలుగా ఉంటాయి. ఆ స్వామి తిరునామాలను పలికి అనుభవించడం, అతని కళ్యాణ గుణాలను వర్ణించి ఆనందించడం, దివ్య సౌందర్యాన్ని వర్ణించి ఆనందించడం, అతడు అభిమానించి వేంచేసి ఉండే దివ్యదేశాలలోని వైభవాన్ని వర్ణించి ఆనందించడం, అక్కడ ప్రీతిని కలిగి, ఆక్కడ ఉండే మూర్తులను ఆరాధించే భగవద్భక్తుల గొప్పతనాన్ని వర్ణించి ఆనందించడం – ఈ విధంగా చాలా విధాలుగా భగవదనుభవం ఉంటుంది. ఈ రీతులలో చాలా విలక్షణమైన వేరొకవిధమైన అనుభవం కూడా ఉన్నది. అది ఏమంటే – ఆళ్వారులు తాము పురుషులమనే భావాన్ని వదిలిపెట్టి, నాయకీ భావాన్ని తమపై ఆరోపించుకొని, వేరొక గొంతుకతో, అంటే, నాయకి పలికినట్లుగా భగవద్వైభవాన్ని వర్ణించి ఆనందించడం అనేది ఈ విలక్షణమైన రీతి. ఈ విధంగా అనుభవించే ఈ క్రమంలో తల్లిగా పలకడం, సఖిగా పలుకడం, నాయికగా పలుకడం – అని మూడు విధాలైన ప్రకారాలు ఉన్నాయి, అప్పుడు ఆళ్వార్లకు **'పరాంకుశులు'** అనే పురుష నామం పోయి, **'పరాంకుశ నాయకి'** అనే నామం వ్యవహరింప- బడుతుంది. తల్లి పలికినట్లు, నాయకి పలికినట్లు, సఖి పలికినట్లు ఈ పాశురాలున్నా, ఈ పాశురాలను అన్నిటినీ పలికేవారు ఆళ్వార్లు ఒక్కరే. ఒక పెద్ద

ప్రవాహం పలు కాలువల ద్వారా ప్రవహించినా, ఆ కాలువలకు ప్రధానమైన పేరు ఒకటే ఉంటుంది కదా! ఈరీతిగా, ఈ మూడు విధాలైన దశలలో పాశురాలు వ్యక్తమైనా, అవి అన్నీ ఆళ్వార్లు



**నమ్మాళ్వార్ - పరాంకుశనాయకి తిరుక్కోలం**

పలికినవే అని గ్రహించాలి.

అళ్వార్లు తాము పురుషులమనే భావాన్ని వదిలిపెట్టి, స్త్రీ భావనను తమపై ఆరోపణ చేసుకోవడం ఎందుకోసం? అంటే, ఆళ్వార్లు ఈ భావాన్ని తాము స్వయంగా కావాలని తమపై ఆరోపించుకోవడం లేదు. ఆ దశ వారికి భక్తి పారవశ్యంవల్ల కలుగుతున్నది. పురుషోత్తముడైన భగవానుని పురుషత్వం ముందు

ఈ లోకంలోని జీవులందరూ స్త్రీలవంటి వారే కనుక, ఆత్మకు స్వాతంత్ర్యం అనేది దోషమే కనుక, పారతంత్ర్యమే సహజ-స్వరూపం అయినందున, ఈ విధంగా పలికే ఈ రీతులు సహజమైనవే తప్ప, సోపాధికాలు కావని అని తెలియాలి.

నాయకి పాశురాలుగా పలికే ఈ దశకంలో కొన్ని పక్షులను ఆళ్వార్లు భగవంతుని దగ్గరకు తమ దూతగా పంపుతున్నారు. ఆ పక్షులు తత్వార్థంలో జ్ఞానం, అనుష్టానం అనేవి పూర్ణంగా కలిగిన సదాచార్యులను తెలుపుతాయి– అని వ్యాఖ్యానాలలో తెలుపబడడం గమనించదగిన అంశం.

## 5)ప్రథమ శతకం-పంచమ దశకం

## # వళవేழులకు

ఆళ్వార్లు ఒక్కొక్కదశకంలోను భగవానుని ఒక్కొక్క కళ్యాణ గుణాన్ని వర్ణిస్తున్నారు. మొదటి దశకంలో పరత్వమనే గుణాన్ని వర్ణించారు. రెండవ దశకంలో భజనీయత అనే గుణాన్ని వర్ణించారు. మూడవ దశకంలో సౌలభ్యగుణాన్ని వర్ణించారు. గడచిన నాలుగవ దశకంలో అపరాధ సహత్వం అనే గుణాన్ని ఆవిష్కరించారు. ఇక, ఈ దశకంలో శీలగుణాన్ని వివరిస్తున్నారు.

భగవానుని కళ్యాణగుణాలన్నిటిలో 'శీలం' అనే గుణం చాలా గొప్పది. పరాత్పరుడైన తాను తన గొప్పతనాన్ని, మనకుండే చాలా తక్కువదనాన్ని ఏమాత్రం లెక్కించకుండా, తనను తక్కువ చేసుకొని, మనతో ఏ విధమైన సంకోచం మనసులో లేకుండా కలసి వర్తించడం శీల గుణం అనబడుతుంది. దీనికి సౌశీల్యం అని కూడా పేరు. "**మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్**" అని సంస్కృతంలో ఈ గుణానికి లక్షణం చెప్పబడింది. చాలా గొప్పవాడు అతి తక్కువవారితోకూడా చాలా సన్నిహితంగా

మెలగడమే శీలగుణం అని తాత్పర్యం. ఈ కళ్యాణాన్ని ఆళ్వార్లు తమ అనుభవాన్ని ఆవిష్కరించడంద్వారా ఇందులో వివరిస్తున్నారు.

## 6)ప్రథమ శతకం-షష్ఠ దశకం

## # పరివదిల్ ఈశనై

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో ఒక్కొక్క దశకంలోను భగవంతుని ఒక్కొక్క కళ్యాణ గుణాన్ని వర్ణిస్తూ వచ్చే క్రమంలో, ఈ దశకంలో "భగవంతుడు ఆరాధించడానికి సులభుడు" అనే కల్యాణగుణాన్ని వర్ణిస్తున్నారు. సంస్కృతంలో దీనికి 'స్వారాధ్యత్వం' అని పేరు. ఏ శ్రమ లేకుండా సులభంగా ఆరాధించడానికి వీలుగా ఉండే స్వభావం అని దీని అర్థం. ఇతర దేవతల కంటే భగవంతుడు ఎన్నో విధాలుగా వైలక్షణ్యాన్ని కలిగినవాడు. ఈ విధంగా ఉండే భగవంతుడు "నాకు మేకను చంపి పెట్టు, కోడిని బలిగా పెట్టు" అని చాలా దుర్లభమైన కోరికలను, ఎంతో శ్రమ పడితే గాని సాధ్యం కాని ఆరాధనలను అపేక్షించే ఇతర దేవతల వలె కాకుండా, మనం సమర్పించిన దానితోనే తృప్తిపడతాడు. **"పత్రం పుష్పం ఫలం"** అని భగవంతుడు గీతలో అన్నాడు కదా. భగవంతునకు కల ఈ మహా గుణం శాస్త్రాలలో సుప్రసిద్ధం. ఇదే ఈ దశకంలో వర్ణింపబడిన విషయం.

## 7)ప్రథమ శతకం-సప్తమ దశకం

## # పిఱవి త్తుయరఱ

గడచిన దశకంలో ఆళ్వారులు భగవానుడు ఆరాధనకు చాలా సులభుడు, దుర్లభుడు కాడు అని తెలిపారు. ఆరాధనం

సులభంగా ఉన్నా, ఆశ్రయణం భోగ్యంగా ఉంటే కదా మనసు నిలకడగా నిలుస్తుంది. లోకంలో చాలామంది మనం సమర్పించినవాటితో తృప్తిపడేవారై ఉన్నందున వారి ఆరాధనకు మనకు సులువుగా ఉండవచ్చు. అయినా, వారిని ఆశ్రయించడం మన మనసుకు భోగ్యంగా ఉంటే తప్ప ఆ ఆశ్రయణం ప్రయోజనం లేదు కదా. ఆ విధంగానే భగవంతుడు కూడా ఆరాధించటానికి సులభుడైనా, ఆశ్రయించేటప్పుడు సరసుడైతేతప్ప ఆ ఆశయణం ఆనందాన్ని కలిగించదు. అటువంటి సారస్యాన్ని అతను కలిగినవాడు – అనే విషయం ఈ దశకంలో తెలుపబడుతున్నది. **"భగవత్ సమాశ్రయణమాకిఅదుదాన్ ఇదుక్కు ఇట్టుప్పిఅ-వాద సర్వేశ్వరనుమ్ ఆశైప్పడుమ్పడి భోగ్యమాయిరుప్ప-దొన్డితే"** (భగవంతునిని ఆశ్రయించడం అనేది, దీని కోసం పెట్టి పుట్టని భగవంతుడు కూడా ఆశపడేటట్లుగా ఉంటుందికదా) అనే నంబిళ్ళై సూక్తి ఇక్కడ స్మరణీయం. తన గొప్పతనాన్ని భగవంతుడు తానే స్వయంగా చూసుకున్నప్పుడు తనకు తాను కైంకర్యం చేసుకోవాలని ఆశ పడేటట్టుగా అది ఉంటుంది – అని అతిశయోక్తి ప్రక్రియలో ఈ సూక్తిని నంబిళ్ళై అనుగ్రహించారు. ఆ విధంగా కూడా భగవద్వైభవం ఉంటుందా? భగవంతుడు అంతటి ఉన్మత్తుడా? అని కొందరు భావించవచ్చు. భగవంతుని వైభవం సాటి మేటి లేనిది"– అని తెలుపడంలో మాత్రమే ఈ సూక్తిలోని తాత్పర్యం–అని గ్రహించాలి.

## 8)ప్రథమ శతకం-అష్టమ దశకం

## # ఓడుమ్ పుళ్ళేఱి

తిరువాయ్ మొళ్లిలో ఒక్కొక్క దశకంలో భగవానుని ఒక్కొక్క కళ్యాణ గుణాన్నిఆళ్వార్లు అనుభవిస్తున్నారు. ఈ క్రమంలో

వారు గడిచిన దశకంలో భగవంతుని మాధుర్యం అనే చాలా గొప్ప గుణాన్ని తాము అనుభవించి పలికారు. ఇపుడు ఈ దశకంలో అతని ఆర్జవం అనే గుణాన్ని స్తుతిస్తున్నారు. ఆర్జవం అంటే–ఋజువుగా ఉండే స్వభావం. మనసులో ఉన్నది ఒకటి, మాటలతో చెప్పేది ఇంకోటి, కార్యంలో చేసేది మరొకటిగా ఉండడం కాకుండా,మనసులో, వాక్కులో, పనిలో ఏక రూపంగా ఉండడం ఆర్జవం అనబడుతుంది. దీనికి ద్రావిడంలో **"శెమ్మై"** అని పేరు. ఈ గుణం ఈ దశకంలో స్తుతింపడుతున్నది. సంసారుల మాట, మనసు, కార్యం ఏకరూపంగా ఉండవు, వేరు వేరుగా ఉంటాయి. అటువంటి సంసారులతో కలసి వర్తించేటప్పుడు, వారి దారిలోనే తాను కూడా వెళ్లి, వారిపట్ల ఋజుస్వభావంతో భగవానుడు ప్రవర్తించడం ఇక్కడ శెమ్మై (లేక అర్జవం) అనే గుణంగా చెప్పబడుతున్నది.

## 9)ప్రథమ శతకం-నవమ దశకం

## # ఇవైయుమ్ మవైయుమ్

భగవానునకు స్వాత్మ్యభోగప్రదత్వమనే ఒక గుణం ఉన్నది. అది ఏమంటే–భక్తులకు తనను అనుభవింపజేసే-టప్పుడు ఒకే కాలంలోనే తన అనుభవాన్ని పూర్తిగా అనుగ్రహించ-కుండా, కొంచెం కొంచెంగా పరిమితంగా తన అనుభవాన్ని అందించి, ఆ అనుభవం వారికి ఒంటబట్టేటట్లు చేయడమే ఈ గుణం. ఆ విధంగా కాకుండా, ఒకేసారి పరిపూర్ణమైన అనుభవాన్ని భక్తులకు కలిగిస్తే, ఆ అనుభవాన్ని వారు పూర్ణంగా అనుభవించే శక్తిని కలవారు కాలేరు. చిన్న బిడ్డకు మొదటిలోనే అన్నం, చారు, కూర, పాయసం అన్నీ కలిపి పెట్టే వారు ఉండరు కదా. మొదట పాలు, తరువాత గంజి, ఆ తరువత అన్నం–అని వరుసగా,

కొంచెంకొంచెంగా కదా బిడ్డకు ఆహారాన్ని అందిస్తారు. ఆ విధంగానే విద్యార్థులకు కూడా ఆచార్యుడు నేర్పవలసిన విద్యను కొంచెం కొంచెంగా నేర్పించి,తరువాత కఠినమైన పాఠాన్ని నేర్పించే విధానాన్ని లోకంలో కూడా చూస్తున్నాము. ఆ విధంగానే భగవానుడు కూడా ముందు భక్తుడు అనుభవించడానికి సాధ్యమయ్యే రీతిలో వారికి తన అనుభవాన్ని పరిమితంగా కలిగించే రీతి ఒకటి ఉన్నది. ఆ గుణమే ఈ దశకంలో ప్రకాశిస్తున్నది. ఆళ్వార్ల శిరస్సు పైకి వచ్చి వేంచేసి ఉండాలని భావించిన భగవానుడు, మొదటిలోనే ఆ పని చేయలేదు. గొప్ప నిధిని చూచిన జన్మదరిద్రుడు, ఆ నిధిని చూచినప్పుడు కలిగిన అంతు లేని సంతోషంవల్ల అతని ప్రాణం ఒక్కొక్క సమయంలో పోవచ్చు కదా! అవిధంగానే, పూర్ణమైన భగవానుని అనుభవం భక్తునకు ఒక్కసారిగా కలిగితే అతడు దానిని తనలో ఇముడ్చుకో లేకపోవచ్చు. అందుచేత ముందుగా భగవంతుడు ఆళ్వార్ల పరిసరాలలోకి వచ్చి, హృదయ ప్రదేశంలోకి వచ్చి, కన్నులలోకి వచ్చి, నుదుటిలోకి వచ్చి, వేంచేసి ఉండి ,చివరిగా శిరస్సుపై నిలిచాడు. ఈ విధంగా కొంచెం కొంచెగా ఆళ్వార్లు తన అనుభవాన్ని పరిపూర్ణంగా అనుభవించి ఆనందించేటట్లుగా చేసిన భగవంతుని అనుగ్రహాన్నిగూర్చి ఆళ్వార్లు ఈ దశకంలో అభినివేశాన్ని పొందుతున్నారు.

## 10)ప్రథమ శతకం-దశమ దశకం

## # పొరుమానీళ్ పడై

భగవానుని అనుగ్రహం నిర్హేతుకం–అనే విషయాన్ని ఈ దశకంలో ఆళ్వార్లు అనుభవిస్తున్నారు. గడచిన దశకంలో ఆళ్వార్లు భగవంతుడు క్రమంగా తమ వద్దకు వచ్చి తమ అన్ని

అవయవాలలో కలసి అనుగ్రహించిన రీతిని పలికారు. ఆ కలయిక వల్ల తమకు కలిగిన అంతులేని ఆనందాన్ని ఈ దశకంలో వ్యక్తం చేస్తున్నారు–అని ఈ విధంగా కొందరు పూర్వాచార్యులు ఈ దశకంలోనే అర్థాన్ని వివరించారు.

ఇక్కడ భట్టర్ విశేషించి అర్థాన్ని నిర్వహించే క్రమం ఏమంటే–గడచిన దశకంలో ఆళ్వార్లు "**వందు ఎనదుచ్చియు-ళానే**" (వచ్చి నా తలపై ఉన్నాడు) అని, "**ఉచ్చియుళ్ళే నిఱ్కుమ్ దేవదేవఱ్కు**" (తలపై నిలచి ఉండే దేవదేవునకు) అని పూర్తి చేసిన అనుభవం తమకు పూర్ణంగా కలిగినట్లుగా ఇందులో



**శ్రీ వైష్ణవనంబి - తిరుక్కుఱుఙ్గుడి**

పలుకుతున్నారు. ఆ అనుభవం కంటే గొప్పగా అనుగ్రహించ

గలిగినది ఇంకొకటి ఏమి ఉన్నది? ఏమీ లేదు కదా. ఆ అనుభవం నిరంతరంగా కొనసాగాలి. అంతే. అది భగవంతుని సంకల్పా-ధీనం అయినది. అది ఉండనివ్వండి. గడచిన దశకంలో తమకు కలిగిన అనుభవాన్ని ఆళ్వార్లు గమనించి చూచినప్పుడు, తమకు కలిగిన ఆ అనుభవం చూస్తే, చాలా ఘనంగా ఉన్నది. ఇంతకంటే గొప్పదైన ఉత్తమమైన ప్రయోజనం అనేది ఇంకొకటి ఏమీ లేదు. ఇటువంటి గొప్ప ప్రయోజనం మనకు కలిగిన కారణం ఏమి? అని వారు విమర్శించడం ఆరంభించారు. ఆ ప్రయోజనానికి తగిన సాధనానుష్ఠానం అనేది ఏదీ తమలో లేదు– అనే విషయాన్ని వారు తెలిసికొన్నారు. తమ వద్ద ఏదైనా ఉంటే, అది భగవంతుని విషయంలో అద్వేషమో, లేక, ఆభిముఖ్యమో తప్ప వేరేమి ఉన్నట్లు వారికి కనిపించలేదు. వాటిని ఈ గొప్పదైన ప్రయోజనానికి తగిన కారణాలుగా భావించదగినవి కావు కదా. తమకు పరమ భక్తి పర్యంతం కలిగినా,అది మన ప్రాప్తికి సాధనంగా భావించడానికి వీలు లేదు కదా. అందువల్ల ఈ అనుగ్రహం, అంటే, భగవానుని అనుగ్రహం నిర్హేతుకం–అని ఆళ్వార్లు నిర్ణయిస్తున్నారు, ఈ దశకంలో.



**నమ్మాళ్వార్**

# 11)ద్వితీయ శతకం-ప్రథమ దశకం

# # వాయుమ్ తిరైయుకళుమ్

సంసారులు లోకంలో ఉండేవారిని అందరిని తమవలె లౌకికవిషయాలలో ఆసక్తిని కలవారై ఉన్నారని భావించినట్లుగా, ఆళ్వార్లు కూడా లోకంలోని సకల పదార్థాలు తమవలె భగవానునకు దూరమై బాధతో క్లేశ పడుతున్నారని భావించారు. నీటి కొంగ, క్రౌంచపక్షి, సముద్రం, గాలి, చంద్రుడు మొదలైన పదార్థాలను చూచి, వాటికి సహజంగా ఉండే కొన్ని ధర్మాలను చూచి, అవి భగవానుని విరహంవల్ల వాటికి కలిగాయని తలచి, వాటి కోసం తాము బాధపడుతున్నారు. నారపక్షి మొదలైనవి తమ సహజస్వభావంవల్లనే తెల్లగా ఉండడం మొదలైన స్వభావాలను కలిగి ఉన్నాయని భావించకుండా, తమ వలె భగవంతుని విరహాన్ని పొందినందున ఆ విధంగా ఉన్నాయని భావించి, ఒక్కొక్క పదార్థాన్ని చూచి, "నీవు కూడా నావలె స్వామికి దూరమై ఆ స్వామి విషయంలో ఆశను పెట్టుకొని ఆ కోరికవల్ల ఈ విధంగా బాధపడుతున్నావా? అని పలికే విధంగా ఈ దశకంలోని పాశురాలు కనిపిస్తున్నాయి. భక్తులను ఈ విధంగా వ్యామోహపరచగవాడు, భగవానుడు–అని అన్నందున భగవానుని 'ఉన్మాదావహత్వం' అనే గొప్ప గుణం చెప్పబడినది.

# 12)ద్వితీయ శతకం-ద్వితీయ దశకం

# # తిణ్ణన్ వీడు

గడచిన దశకంలో ఆళ్వార్లకు కలిగిన దశ లోకవిలక్షణ-మైనది. మాటకు అందని ఆర్తిని వారు పొందారు. ఆ ఆర్తి ఎక్కువగా కలిగిన ఆ సమయంలో భగవంతుడు వారికి సాక్షాత్కరించి,

మానసికమైన అనుభవాన్ని కలుగజేసి ఓదార్పును పొందించాడు. వెంటనే ఆళ్వార్లకు కలిగిన ఆర్తి అంతా తీరింది. అది ఎక్కడి నుంచి వచ్చిందో తెలియని రీతిలో అదృశ్యమైనది. వెంటనే ఓదార్పును పొందిన ఆళ్వార్లు భగవానుని పరత్వం అనే గుణాన్ని ఇందులో అనుభవిస్తున్నారు. "భగవానునకు పరత్వం, సౌలభ్యం అనే ఈ రెండు గుణాలు ఉన్నాయి. వీటిలో సౌలభ్యగుణాన్ని వర్ణించే కొద్దీ మనసు ద్రవీకరిస్తుంది. అందువల్ల ఇప్పుడు కొంచెం ఓదార్పును పొందిన నేను మళ్లీ దానిని వర్ణించి మనసులో వైకల్యాన్ని పొందకూడదు. **"నెంజాల్ నినైప్పు అరిదాల్ వెణ్ణెయ్ ఊణెన్నుమీనచ్చొల్లే"** (భగవంతుని గొప్పదనాన్ని మనస్సులో భావించడం చాల దుర్లభం, ఆహా! భగవంతుడు వెన్నను ఆరగిస్తాడు అనే స్తుతి చాలా తక్కువైన స్తుతి కదా!) అని రీతిలో కాకుండా ప్రాణాన్ని ధరించి నిలచి పలుకడానికి వీలైన పరత్వాన్ని స్తుతిస్తాను" అని తలచి ఆ గుణాన్ని ఈ దశకంలో స్తుతిస్తున్నారు.

**"ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్"** (చాలా గొప్పదైన ఆనంద గుణాన్ని కలిగినవాడు) అని మొదటి దశకంలో కూడా పరత్వం చెప్పబడినా, ఇక్కడ అ గుణాన్ని పలికే రీతిలో తేడా ఉన్నది. అక్కడ తమ అనుభవరూపంగా ఆ గుణం వ్యక్తం చేయబడింది. ఇక్కడ పరోపదేశరూపంగా ఉన్నది. అక్కడ అన్వయముఖంగా చెప్పబడింది.ఇక్కడ అన్వయవ్యతిరేక క్రమాలు రెండిటిలో చెప్పబడుతున్నది (భగవంతుడు పరత్వాన్ని కలిగినవాడు– అని అనడం అన్వయక్రమంలో పలకడం. భగవంతునకు తప్ప ఎవరికీ పరత్వం ఉండడం అసంభావితం– అని నిరూపించడం వ్యతిరేకముఖంగా పలకడం). అక్కడ ఇంచుమించుగా ఉపనిషత్తులను ఆధారంగా చేసుకుని నిరూపించారు. ఇక్కడ ఇతిహాస పురాణ ప్రక్రియలో అనుగ్రహించారు. అక్కడ పరరూపంలో(వైకుంఠంలో) పరత్వాన్ని

పలికారు. ఇక్కడ అవతారంలో పరత్వాన్ని పలుకుతున్నారు–అనే ఈ తేడాలను తెలియాలి.

## 13)ద్వితీయ శతకం-తృతీయ దశకం

## # ఊనిల్ వాళ్ ఉయిరే

ఈ మూడవ దశకం రెండవ దశకంగా ఉండి ఉండాలి. మొదటి దశకంలో ఆళ్వార్లు పడిన ఆర్తి భగవంతుడు వచ్చి సాక్షాత్కారాన్ని అనుగ్రహించి తన మానసికమైన సంశ్లేషాన్ని కలిగించడంద్వారా వారికి ఆనందాన్ని కలిగించాడు. ఆ ఆనందాన్ని ఈ దశకం తెలియజేస్తున్నది . అందువల్ల ఇది మొదటి దశకం తరువాత ఉండి ఉండాలి. అయినా భగవానుని పరత్వానుభవం మధ్యలో ప్రాసంగికంగా వచ్చింది. "ఇటువంటి నీచుడనైన నన్ను ఇంతటి పరత్వాన్ని కల స్వామి ఈ విధంగా కలసి అనుగ్రహించాడు" అని ముందుగా అళ్వార్లు భగవంతుని పరత్వాన్ని అనుసంధానం చేసినందున ఆ గుణం ముందు దశకంలో తెలుపబడింది. దానిని అనుభవించిన తరువాత ఇప్పుడు **"వాయుమ్ తిరైయుకళుమ్"** అనే మదటి దశకంలో తమకు కలిగిన క్లేశం అంతా తిరేటట్లు స్వామి వచ్చి సాక్షాత్కరించినందున కలిగిన ఆనందాన్ని ఈ దశకంలో ఆళ్వార్లు తెలుపుతున్నారు. ఈ మహానందాన్ని అనుభవించడానికి సహాయంగా ఎవరు ఈ లోకంలో ఉన్నారు?-అని ఆళ్వారులు పరిశీలించి చూడగా ఈ లోకంలో ఉండే వారంతా **"ఉండియే ఉడైయే ఉకన్దు"** (భోగ్య పదార్థాలను భుజించి, మంచి బట్టలను కట్టుకుని ఆనందించి) అని కులశేఖరులు పలికిన విధంగా లౌకిక పురుషార్థాలలోనే ఆసక్తులై ఉన్నవారై, తమతో భగవదనుభవాన్ని పొందడానికి ఆసక్తిని లేనివారై ఉన్నందున, భగవానుని

అనుభవాన్ని నిత్యం పొందే నిత్యసూరులసమూహంలో చేరి, వారితో ఒక వరుసగా నిలచి అనుభవించే సమయం ఎప్పుడో కదా!-అనే కోరికను ఈ దశకంలో ఆళ్వారులు వ్యక్తం చేస్తున్నారు.

.

## 14)ద్వితీయ శతకం-చతుర్థ దశకం

## # ఆడి యాడి

గడచిన దశకంలో **"పరమన్ పవిత్తిరన్ శీర్ అడియేన్ వాయ్ మడుత్తు పరుకి కళిత్తేనే"** (చాలా గొప్పవాడు, పవిత్రుడు అయిన భగవంతుని కళ్యాణ గుణాలను దాసుడనైన నేను నా నోటితో కీర్తించి ఆనందించాను) అని అంటూ ఆళ్వారులు తాము పరమానందాన్ని పొందిన విషయాన్ని తెలియజేసి, ఆ అనుభవాన్ని భాగవతగోష్ఠితో కలసి పొందాలని ఆశపడినవారు కనుక, అటువంటి అధికారులు ఈ లోకంలో విశేషంగా లభించినందున పరమపదంలో నిత్యసూరుల సమూహంలో చేరి ఆ అనుభవాన్ని పొందాలని ఆశపడి, ఆ ఆశను గడచిన దశకం చివరలో **"కళిప్పుమ్ కవర్వుమట్రు"** ఇత్యాది పాశురంలో వ్యక్తం చేశారు. ఆ విధంగా ఆశపడిన వెంటనే ఆ నిత్యసూరుల సమూహంలోకి చేరి, వారితో భగవదనుభవాన్ని పొందలేనందున ఆళ్వార్లు మనసులో చాలా ఆర్తిని పొందారు. ఆ ఆర్తిని తమకు ఆత్మీయులైన శ్రీవైష్ణవులు భగవానునకు నివేదించే రీతిలో ఈ దశకంలోని పాశురాలు ఉన్నాయి. ఆళ్వార్లు అప్పుడు తాము పురుషులమనే భావనను వారికి కలిగిన ఆర్తి కారణంగా కోల్పోయి నాయకీ దశను పొందారు. పరాంకుశనాయకి రూపంలోని ఆళ్వారుల దశను నాయకి తల్లి మొదలైన ఆత్మీయులు పలికే వచనాలుగా ఈ దశకంలోని పాశురాలున్నాయి.

నాయకీ సమాధితో ఇంతకుముందు ఆళ్వార్లు **"అంజిఱైయ"** ,**"వాయుమ్ తరైయుకళుమ్"**, అనే రెండు దశకాలలో పాశురాలను పాడారు. ఆ రెండు నాయకి స్వయంగా పలికే రీతిలో ఉన్నాయి. **"అంజిఱైయ"** అనే దశకంలో నాయకి స్వయంగా దూతలను పంపింది. **"వాయుమ్ తిరైయుకళుమ్"** అనే దశకంలో నాయకి తాను కంటితో చూసిన వస్తువులన్నీ భగవానుని పొందలేక ఆర్తిని అనుభవిస్తున్నట్లు తలచి వాటికోసం తాము బాధపడ్డారు.

ఈ దశకంలో అయితే, ఆ విధంగా నాయకి తన మాటలలో లేని రీతిలో అభినివేశాన్ని పొంది, ఇతరులవచనాల రూపంగా పలుకుతున్నట్లు కనిపిస్తుంది. అందువల్ల ఈ దశకంలో ఉండే నాయకికి ఉండే ఆర్తి మిక్కిలి ఎక్కువగా ఉన్నదని తెలుస్తుంది.

"శ్రీ రామకృష్ణాది అవతారాలను ఎత్తి, అందరి ఆర్తి పోగొట్టడమే స్వభావంగా కలిగిఉండే నీవు ఈ నాయకి విషయంలో ఏమి చేయాలని అనుకుంటున్నావు? నీపట్ల మిక్కిలి వ్యామోహాన్ని కలిగిన ఈ నాయకిని ఈ విధంగా బాధించడం నీకు తగినదేనా? ఈమె విషయంలో నీవు ఏమి చేయాలని అనుకుంటున్నావు?" -అని భగవానుని చూచి నాయకి తల్లి అడిగే వచనాల రూపంగా ఈ దశకం ఉన్నది, ఈ దశకం తల్లి వచనాలుగా కనిపిస్తున్నా, నిజానికి పలికేవారు ఆళ్వార్లే కదా. వారు ఈ విధంగా ఎందుకు పలకాలి? అని అడగరాదు. ఈ విధంగా పలకాలి–అని తలచి వారు పలకడం లేదు. వారి ఆర్తి అంతులేనిది అయినందున, అది వారి మనస్సు లోపల ఇముడలేదు. వారు దానిని బయటకు వ్యక్తం చేసేటప్పుడు ఈ విధంగా వివిధంగా పాశురాలను పాడారు. తమ అంతులేని ఆర్తిని ఈ క్రమంలో వ్యక్తం చేశారు. అంతే. కావేరినది మహాప్రవాహంగా ప్రవహిస్తూ వచ్చినప్పుడు, ఆ ప్రవాహం అంతులేనిది అయినందున, మధ్యలో చీలి వేరే కొన్ని ఉపనదులుగా మారి ప్రవహిస్తుంది. అయితే, ఆ ఉపనదులు కూడా

కావేరీ నదీజలాలే. అయినా అవి వేర్వేరు పేర్లతో వ్యవహరింప-బడడం గమనిస్తున్నాము. ఆ విధంగానే అన్నీ ఆళ్వార్ల వచనాలే అయినప్పటికీ, కొన్ని తల్లి వచనాలుగా, మరికొన్ని సఖీవచనా-లుగా వ్యక్తమవుతున్నాయి–అని తెలియాలి.

## 15)ద్వితీయ శతకం-పంచమ దశకం

## # అందామత్తన్బు

గడచిన దశకంలో ఆళ్వార్లకు కలిగిన ఆర్తి మొసలి నోటిలో చిక్కుకుని క్లేశపడిన గజేంద్రుని బాధతో సమానమైనది. ఆ గజేంద్రుడు **"ఆదిమూలమా!"** అని భగవంతుని గొంతెత్తి పిలచినపుడు అతని ఆ ఆర్తనాదాన్ని విన్న వెంటనే స్వామి **"అతంత్రితచమూపతిప్రహితహస్త మస్వీకృతప్రణీత-మణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్, అవాహన-పరిష్క్రియం పతగరాజ మారోహతః కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః"** (గజేంద్రుని రక్షించడం కోసం భగవంతుడు వేగంగా వెళ్ళే ప్రయత్నంలో విష్వక్సేనుడు ఇచ్చిన చేతి సహాయాన్ని అందుకోలేదు. సేవకులు తెచ్చిన మణిపాదుకలను ధరించలేదు. భగవంతుని వేగాన్ని చూచిన అంతఃపుర జనులు, ఇది ఏమి? అని వ్యాకులపడ్డారు. ఏ అలంకరణా లేని గరుడుని స్వామి అధిరోహించాడు. అటువంటి, భగవంతుడు భక్తరక్షణ కోసం పడే తొందరకు నమస్కారం) అనే విధంగా చాలా వేగంగా మడుగు తీరానికి గొప్ప సంభ్రమంతో నడుము బట్ట జారిపోగా, శిఖాబంధం వీడిపోగా పరిగెత్తుకొని వచ్చి ఆ గజేంద్రునకు తన దర్శనాన్ని అనుగ్రహించాడు. తానుకూడా ఆనందించి,గజేంద్రుని ఆనందింపచేశాడు. ఆ విధంగానే ఆళ్వార్లు పలికిన **"వలమ్ కొళ్ పుళ్ళుయర్ త్తాయ్"** అనే అర్తనాదాన్ని

వినగానే భగవానుడు చాలా నొచ్చుకొని, "నేను జగత్తును రక్షించే రీతి చాలా బాగుంది! ఎంత బాగా పాలిస్తున్నాను. ఏం చేశాను? అని తమ మనసులో చాలా నొచ్చుకున్నారు. స్వరూపరూప గుణాలు, అలంకారాలు, దివ్యాయుధాలు–అనే వీనిని అన్నిటిని ధరించినవాడై, ఆ విధమైన సన్నివేశంతో ఆళ్వార్ల దగ్గరకు వచ్చి, వారితో కలిశాడు. ఆ విధంగా అతడు ఆళ్వారుల ఆర్తిని తీర్చి, తానుకూడా సంతోషించాడు. కృతకృత్యుడయ్యాడు. ఈ విషయాన్ని ఆళ్వారులు తాము మానసికంగా అనుభవించి, ఆ అనుభవం వల్ల కలిగిన ఆనంద పారవశ్యంతో ఈ దశకంలో తాము పొందిన గొప్ప ప్రాప్యాన్నిగూర్చి పలికి ఆనందిస్తున్నారు.

## 16)ద్వితీయ శతకం-షష్ఠ దశకం

## # వైకుందా మణివణ్ణనే

ఆళ్వార్లకు "**ఆడి ఆడి**" అనే దశకంలో అనుభవించిన ఆర్తి అంతా తీరేటట్లు భగవంతుడు వచ్చి వారిని కలసిన వృత్తాంతం తెలుపబడింది. ఆ కలయిక వల్ల భగవంతుడు అంతులేని ఆనందాన్ని పొందినవాడై, "ఈ ఆళ్వార్లకు ఏమి చేయగలన.. ఏమి ఇవ్వగలను?" అని తడబడ్డాడు. "ఈ ఆళ్వారులు 'నైచ్యానుసంధానం చేసి, ఈ పరమాత్మ దగ్గరకు నేను పోకూడదు. నేను చేరితే ఆ స్వామికి దోషం కలుగుతుంది. ఆ విధంగా దోషం కలుగకూడదు. అందువల్ల దూరంగా ఉండడమే మంచిది'–అని భావించి వీరు దూరంగా వెళ్లి పోతే నేను ఏమి చేయాలి? అలభ్యలాభం అయిన దీనిని అప్పుడు పోగొట్టుకుంటాను కదా. ఈ ఆళ్వారులకు నాకు మధ్య ఉండే ఈ కలయిక నిత్యంగా ఉండాలికదా!"-అనే సందేహం కలిగినవాడు కాగా, దానిని గ్రహించిన ఆళ్వార్లు "స్వామీ! నీవు ఈ విధంగా సందేహించవలదు.

నేను నిన్ను పట్టుకున్న పట్టు సామాన్యమైనది కాదు. ఏ నాడు నిన్ను విడిచి నేను వెళ్ళని రీతిలో దృఢంగా నిన్ను ఆశ్రయించానుసుమా!" అని పలికి భగవానునకు ఆళ్వార్లు ఈ దశకంలో ఊరటను కలిగిస్తున్నారు.

# 17)ద్వితీయ శతకం-సప్తమ దశకం

# # కేశవన్ తమర్

గడచిన దశకంలో "**ఎమర్ కీళ్ల మేల్ ఎళ్ళపిఱప్పుమ్ విడియా వెన్నరకత్తు ఎన్దుమ్ శేర్ దల్ మాఱినరే**" (ముందు ఏడు తరాల వారు, తర్వాత ఏడు తరాల వారు అనే నా బంధువులు అందరూ కేశవునకు దాసులయ్యారు. చాతుర్యంతో ఆ భగవానుని దయకు పాత్రం అయ్యారు. తెల్లవారని కాళరాత్రి వంటి సంసారం నుండి విముక్తులు అయ్యారు) అని భగవంతునకు తమ విషయం లో కలిగిన ప్రేమను ముందు తరంలోను, తరువాతి తరంలోను ప్రవహించిన విషయాన్ని కొంచెంగా ప్రస్తావించారు. ఆ మహోపకారాన్ని గొప్పగా అభివర్ణించాలి అని ఆళ్వార్లకు చాలా అభినివేశం కలిగింది. అదే ఈ దశకంలో ప్రధానమైన విషయం. భగవంతుని కళ్యాణ గుణాలలో ఇది ఒక చాలా గొప్ప గుణం. అది ఏమంటే–ఒకనిని అనుగ్రహించాలని భగవంతుడు అనుకుంటే ఆ అనుగ్రహం ఆ వ్యక్తి ఒక్క విషయంలో మాత్రం కాకుండా అతనికి సంబంధించిన ముందు తరాలలో తరువాతి తరాలలో ప్రవహిస్తుంది. ఈ విషయానికి ఉదాహరణంగా నంబిళ్ళై "**మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్, క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ**" (విరోధకార్యాలు అనేవి మరణం వరకే. నా ప్రయోజనం సిద్ధించింది. ఇతనికి నీవు చరమ క్రియలను చేయాలి. నీకు ఏ విధంగా ఇతడు బంధువో, ఆ

విధంగానే నాకు కూడా బంధువు) అనే శ్రీ రామాయణ శ్లోకాన్ని ఉదాహరించి, చాలా రసవంతంగా వ్యాఖ్యానించారు. దాని సారాంశం ఏమంటే – శ్రీ రామునకు విభీషణుని విషయంలో కలిగిన ప్రేమ రావణుని వరకు ప్రవహించి, "ఇతనికి నీవు చరమసంస్కారాన్ని చేసి తీరాలి" అని నిర్బంధించేటట్లు చేసింది. ఈ దశకంలో ఈ విషయమే ముఖ్యంగా చెప్పబడుతున్నది.

అంతే కాక, ఈ దశకంలో ఇంకొక విశేషం కూడా ఉన్నది.అది ఏమంటే–కేశవశబ్దం నుండి దామోదర శబ్దం వరకు ఉండే పన్నెండు నామాలు ఒక్కొక్క నామం ఒక్కొక్క పాశురంలో కూర్చబడింది. అందువల్లనే తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలోని ఈ ఒక్క దశకంలో మాత్రమే 13 పాశురాలు ఉన్నవి. మిగిలిన వాటిలో పదకొండు పాశురాలే ఉన్నాయి. తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలో 1102 పాశురాలు ఉండడానికి కూడా ఇదే కారణం.

## 18)ద్వితీయ శతకం-అష్టమ దశకం

## # అణైవదు అరవణైమేల్

భగవంతునకు తమ విషయంలో ఉండే వ్యామోహం తమతో సంబంధాన్ని కలవారివరకు, వారి సంబంధుల వరకు ప్రవహించి అందరిని అనుగ్రహించిన రీతిని ఈ దశకంలో ఆళ్వారులు తెలియజేశారు. అంతటితో భగవంతుడు ఆగకుండా, నిత్యుల, ముక్తుల ఐశ్వర్యాన్ని తమకు చెందినవారికి ఇవ్వాలని అతడు భావించడం, ప్రయత్నించడం ఆళ్వారులు చూచి చాలా సంతోషించారు. తనతో లోకులకు ఉండే సంబంధమే కారణంగా భగవంతుడు ఈ విధంగా ఇంతమందిని అనుగ్రహించేటప్పుడు సంసారులు దీనిని పోగొట్టుకోకూడదు, వారికి కూడా నాతో పాటు సంబంధాన్ని కలిగించి వారిని కూడా భగవంతుడు పరిపూర్ణంగా

అనుగ్రహించేటట్టు చేస్తాను–అని భావించి, ఆ సంసారులకు ఈ దశకంలో ఉపదేశం చేస్తున్నారు ఆళ్వారులు. భగవంతుని సర్వేశ్వరత్వాన్ని ఉపదేశిస్తున్నారని కొందరు ఆచార్యులు ఈ దశకాన్ని వివరించారు. భగవంతుని మోక్షప్రదత్వాన్ని ఉపదేశిస్తూ ఉన్నారని పరాశర భట్టర్ భావించారు. ఈ విధంగా ఉండే పలు విధాలైన నిర్వాహాలలో విశేషమైన తేడా ఏమీ లేదు. సర్వేశ్వరుడు అయినందువల్లనే భగవంతుడు మోక్ష ప్రదుడు కాగలడు. మోక్షప్రదునకే సర్వేశ్వరత్వం ఉంటుంది. ఈ రెండు ఒకదాన్ని విడచి ఒకటి ఉండవు. అందువల్ల ఏ విధంగా నిర్వహించినా లోటు లేదు. అయినా "**తిణ్ణన్ వీడు**" అనే దశకంలో సర్వేశ్వరత్వం తెలుపబడినందున ఈ దశకంలో తెలుపబడేది మోక్ష ప్రదత్వం కావచ్చు అని భట్టర్ భావించి ఉండవచ్చు. "**పుణైవన్ పిఆవిక్కడల్ నీందువార్ క్కే**" (సంసార జలధిని దాటేవారికి వారధి అవుతాడు)అని, "**వీడు ముదలామ్**" (మోక్షం మొదలైన) అని , "**నలమందమిల్లైదోర్ నాడు పుకువీర్**" (అంతులేని ఆనందాన్ని కల పరమపదాన్ని పొందండి) అని ఉండే సూక్తులలో విశేషమైన దృష్టితో భట్టర్ ఈ విధంగా వివరించారని భావించాలి.

## 19)ద్వితీయ శతకం-నవమ దశకం
## # ఎమ్మావీట్టు

ఇది పురుషార్థాన్ని నిర్ణయించే దశకం. అంటే –గడచిన దశకంలో "**నలమంద మిల్లైదోర్ నాడు పుకువీర్**" (అంతులేని ఆనందాన్ని కల అద్వితీయమైన పరమపదంలో ప్రవేశించండి) అనే సూక్తులలో శఠకోపులు పరమపదాన్ని గూర్చి ప్రస్తావన చేయడం గమనించిన భగవంతుడు, "వీరికి మోక్షంలో రుచి ఉంటే దానిని ఇస్తాను" అని భావించి, "ఆళ్వార్లూ! మీరు కోరే మోక్షాన్ని

ఇస్తాను తీసుకోండి" అని అన్నాడు దీనిని విన్న ఆళ్వార్లు, "భగవంతుడు ఈ విధంగా ఇచ్చే మోక్షం మనకు ఎందుకు? మన అపేక్షితాన్ని నెరవేర్చాలనే అభిప్రాయంతో అతడు ఇచ్చే మోక్షం మనకి పురుషార్థం అవుతుందా? అతడు తన అభిరుచికి తగినట్లుగా ఇస్తేనే అది తగినది తప్ప, మన అభిరుచికి తగినట్లు ఇవ్వడం మనకు నరకంతో సమానం, అంతే" అని భావించి, "భగవన్! నేను ముక్తుడనై అంతులేని ఆనందాన్ని అనుభవించనీ. లేక, కైవల్య సుఖాన్ని పొందనీ. ఆత్మనాశమే పొందనీ. నరకానుభవం పొందనీ. వీటిలో నాకు ఇదే కావాలనే నిర్బంధం ఏమీ లేదు. నీ రుచికి తగినట్లు ఇచ్చేటట్లు అయితే అది ఏదైనా నాకు మంచిదే. వీటిలో ఏదైనా సరే నాకోసంగా ఇచ్చేది ఏదైనా నాకు వద్దు.అందువల్ల నీ రుచికి తగినట్లుగా ఏది ఉన్నదో అదే నాకు ప్రాప్యంగా అనుగ్రహించు" అని అంటున్నారు. "ఎంబార్ ఈ దశకం గూర్చి పలికేటప్పుడు లోపల ఉండే వారు ఎవరు? అని అడిగి, యోగ్యులను మాత్రమే లోపల ఉండనిచ్చి తలుపులు మూసి వేసి రహస్యంగా ఉపదేశించేవారట" అనే ఈడు శ్రీసూక్తి ధ్యేయం. ఈ దశకంలోని విషయాన్ని తెలియడానికి తగిన యోగ్యత కలవారు చాలా తక్కువ అని దీని తాత్పర్యం.

## 20)ద్వితీయ శతకం-దశమ దశకం

## # కిళరొళి ఇళమై

గడచిన దశకంలో నిష్కర్షింపబడిన ప్రాప్యాన్ని పొందడానికి ళ్వారులు వనగిరి అనబడే 'తిరుమాలిరుంశోలై'ను ఆశ్రస్తున్నారు అని భగవద్రామానుజులకు ముందు ఉన్న ఆచార్యులు వివరించారు. అయితే, రామానుజులు దానిని ఇంకా మధురంగా అనుగ్రహించారు. ఈ విధంగా, అంటే, గడచిన



**శ్రీ కళ్ళழగర్ - తిరుమాలిరుఞ్జోలై**

దశకంలో "ఇది వద్దు అది వద్దు" అని , "ఆలస్యం చేయవద్దు" అని భగవంతుని కైంకర్యంవిషయంలో తమకు ఉండే త్వరను ఆళ్వారులు వ్యక్తం చేయగా, దానిని గమనించిన భగవంతుడు "ఆళ్వారులు ఈ విధంగా త్వరపడడం ఈ శరీరంతో ఉన్నప్పుడే పరమపదంలోని కైంకర్యాన్ని చేసుకోవాలి అనే ఆశతో ఉన్నారు కాబోలు" అని భావించాడు. "వీరు భావించినట్లు నన్ను

సేవించడానికి వీరికి తగిన ఏకాంతమైన స్థలం ఏది?" అని ఈ లోకంలో భగవంతుడు గమనించి చూచినప్పుడు చక్కగా పెరిగిన ఉద్యానవనాలను చుట్టూ కల భవనగిరి చూచాడు. ఇది చాలా తగిన చోటు–అని అతడు భావించి అక్కడ తన సాన్నిధ్యాన్ని అనుగ్రహించాడు. ఆళ్వారులతో "ఆళ్వార్! నేను మీకోసం దర్శనాన్ని ఇవ్వడానికి ఇక్కడకు వచ్చాను. మీరు ఇక్కడకు వచ్చి మీరు తలచినట్లు అన్ని విధాలైన సేవలను చేసికొని ఆనందించండి" అని అంటూ దక్షిణ దిశలో ఉండే వనగిరిలో తన సన్నిధిని వారికి దర్శింపజేశాడు. ఆళ్వార్లు కూడా దానిని అనుసంధించి భగవంతుడు నాకు ప్రాప్యుడు అయితే, అతడు వేంచేసి ఉండే చోటు కూడా నాకు ప్రాప్యమే. అందువల్ల భగవంతుడు వేంచేసి ఉండే పర్వతంతోపాటు, దానితో చేరిన పర్వతంతో పాటు, క్షేత్రంతో పాటు, ఆ క్షేత్రానికి పోయే దారితో పాటు అక్కడికి పోవాలి అనే నిశ్చయంతో పాటు ఏమీ తేడా లేకుండా అన్నీ నాకు ప్రాప్యమే అని భావించి ఆనందిస్తున్నారు, ఈ దశకంలో.



**నమ్మాళ్వార్**

# 21)తృతీయ శతకం-ప్రథమ దశకం
# # ముడిచ్చోది

గడచిన దశకాన్ని ఆళ్వారులు పూర్తి చేసేటప్పుడు **"పొరుళాన్లు ఇవ్వులకమ్ పడైత్తవన్ పుకళ్హ్ మేల్ మరుళిల్ వణ్ కురుకూర్ శడకోపన్** (ఈ జగత్తు ఏదో ఒకనాటికి ఉద్ధరింపబడుతుంది అని దీనిని సృష్టించిన భగవంతుని కల్యాణ గుణాలను గూర్చి పలికినవారు, ఏ అజ్ఞానం లేని నమ్మాళ్వారులు) అని తనను గూర్చి పలికారు. దీని అర్థం ఏమంటే–భగవంతుని విషయంలో తమకు ఏ విధమైన అజ్ఞానం లేదు–అని అన్నారు. ఇప్పుడు ఈదశకంలో మొదటి పాశురాన్ని ప్రారంభించేటప్పుడే తమకు ఒక అజ్ఞానం ఉన్నదని అంటున్నారు. అజ్ఞానం అనేది నాలుగు విధాలుగా ఉంటుంది. ఒక వస్తువును పూర్తిగా నిశ్చయంగా తెలుసుకోలేకపోవడం, సందేహ పూర్వకంగా తెలుసుకోవడం, విపరీతంగా నిశ్చయించి తెలిసికోవడం, యధాతధంగా తెలిసికొన్నదానిని మరిచిపోవడం అనేవి ఈ నాలుగు. ఈ విధంగా ఉండే నాలుగు అజ్ఞానాలలో, సందేహ రూపమైన అజ్ఞానం తమకు ఉన్నదని ఇక్కడ ఆళ్వారులు పలుకుతన్నారు. పూర్వం తమకు ఏ అజ్ఞానం లేదని, మళ్లీ ఇప్పుడు ఒక అజ్ఞానం ఉన్నదని అంటే ఏ విధంగా సరిపోతుంది? అని అంటే - మన వంటివారికి కర్మ కారణంగా కలిగే అజ్ఞానం వీరికి లేదు అనేది తప్ప భగవంతుడు అనే విషయంలోని గొప్పతనంచేత కలిగే అజ్ఞానం కూడా లేదని అర్థం కాదు. భగవంతుని రూపసౌందర్యంలో చాలా అభినివేశాన్ని పొందిన ఆళ్వారులు "భగవన్! నీ ముఖకాంతియే కిరీట కాంతిగా వికసించిందా? లేక, కిరీట కాంతి ముఖకాంతిగా వికసించిందా? అని అడగడానికి మూలమైన సందేహం ఆళ్వారులకు కలిగినందున ఇక్కడ అజ్ఞానం పురుషార్థ కోటిలోకి చేరుతుందికదా!

“జ్ఞానవిపాకకార్యమైన అజ్ఞానంవల్ల కలిగేవి అన్నీ శ్లాఘ్యాలు" అనే శ్రీవచనభూషణ శ్రీ సూక్తి ఇక్కడ అనుసంధేయం. మన అజ్ఞానంవంటివి కాకుండా ఈ విధంగా చాలా విలక్షణమైన అజ్ఞానం ఆళ్వారులకు కలగడం వారి జ్ఞాన వైభవంగా తెలుస్తుంది. విలక్షణ విషయంలో, అంటే, భగవంతుడనే గొప్ప విషయంలో ఈ విధంగా జ్ఞానంలో కలతను పొందకుండా, నిశ్చయమైన జ్ఞానాన్ని గలవారైతే వారికి గొప్పతనం లేదు కదా. గడచిన దశకంలో వనగిరిని అనుభవించిన ఆళ్వారులు ఆ క్షేత్రంలో ఒక భాగం అనే విధంగా ఉన్న, ఒక కల్పవృక్షం శాఖోప శాఖలుగా ఎదిగి పుష్పించినట్లు ఉండే సుందరబాహుస్వామి రూపాన్నిదర్శించి ఆనందించి, వేదాలు, వైదికులు, బ్రహ్మ రుద్రాది దేవతలు కూడా తెలిసి కోవడానికి సాధ్యం కాని రీతిలో ఉండే సుందర బాహుస్వామి సౌందర్య సన్నివేశాన్ని దర్శించి ఆళ్వారులు ఆనందిస్తున్నారు.

## 22)తృతీయ శతకం-ద్వితీయ దశకం
## # మున్నీర్ ఇాలమ్

చాలా దాహం కలవాడు మంచినీరు సమీపంలో ఉన్నా నోరుమూసుకుని పోతే ఆ నీటిని తాగలేక తల్లడిల్లేటట్లు, ఆళ్వారులు కూడా తమకు పరమ భోగ్యమైన భగవంతుడు అనే విషయం సమీపంలో ఉన్నప్పటికీ, తమకు ఆశ మిక్కిలిగా ఉన్నప్పటికీ ఆ భగవంతుడు అనే గొప్పతనంచేత తాము తలచినట్లు అనుభవించ లేకపోయారు. "ప్రకృతి సంబంధం కారణంగా నా ఇంద్రియాలు సంకోచాన్ని పొందాయి కనుక కదా, భగవంతుడనే ఈ విషయాన్ని నేను పూర్తిగా అనుభవించలేక తల్లడిల్లుతున్నాను" అని భావించి చాలా ఆర్తిని పొందారు. "భగవంతుడు విశాలమైన హృదయంతో సృష్టించిన

ఇంద్రియాలు, శరీరం, ప్రాణం, జగత్తులో ఆ భగవానుడు ఎత్తిన ఎన్నో అవతారాలు నా విషయంలో ఏమి ఉపయోగం లేకుండా పోయాయి. నేను ఈ సంసార సంబంధాన్ని పోగొట్టుకొని పరమాత్మను పరిపూర్ణంగా అనుభవించి ఆనందించే అవకాశం లేకుండా పోయిందే" అని భావించి చాలా బాధ పడ్డారు. ఆ సమయంలో భగవంతుడు అవతారాలకు వెనకబడినవారు కూడా కోల్పోవాల్సిన అవసరం లేకుండా నేను వేంకటాద్రిపై ఉండే రీతిని చూపి ఆళ్వార్లను ఒక విధంగా సమాధాన పరుస్తాను అని భావించి "ఆళ్వారులూ! మీరు ఎందుకు ఈ విధంగా బాధపడతారు? నన్ను మీరు అనుకున్న రీతిలో అనుభవించలేక పోవడానికి కారణం మీ ఇంద్రియాల సంకోచం కాదు. ఆ విధంగా అనుకోకండి. మీవలె కరణ సంకోచం లేని నిత్యులు, ముక్తులు కూడా నన్ను పూర్ణంగా అనుభవించలేక మీ వలె తల్లడిల్లుతారు. అనుభవించే విషయం అనేది అంతులేనిది అయినందున "పరిపూర్ణమైన అనుభవం పొందలేక పోతున్నాను" అనే ఆర్తి పొందడం మీకు, వారికి అందరికీ సమానమే సుమా. దానిని గూర్చి మీరు చింతించకండి. మీరు భావించిన రీతిలో నాతో కలసి ఆనందించేటట్లు ఉత్తర దిక్కులో ఉండే వేంకటాద్రి లో నిలుచున్న సన్నివేశంలో నన్ను దర్శించి అనుభవించి ఆనందించండి" అని అన్నాడు. ఆళ్వారులు కూడా ఆ విధంగా వేంకటాద్రి లో ఉండే భగవంతుని మానసికంగా దర్శించి సమాధానపడుతూ ఆనందించడం ఈ దశకంలో తెలుపబడింది. ఈ దశకంలోని పదవ పాశురంలో ఆళ్వారుల కలిగిన ఈ అనుభవం సూచింపబడినది.

# 23)తృతీయ శతకం-తృతీయ దశకం

# # ఒழிవిల్ కాలమ్



భూదేవి, నీళాదేవి సమేత మలైయప్పన్ - తిరుమల

"పరమాత్మా! నిన్ను దర్శించడానికి నాకు అడ్డుగా ఉండే ప్రకృతి సంబంధాన్ని పోగొట్టాలి అ ని గడచిన దశకంలో ప్రార్థించిన ఆళ్వారులను చూచి భగవంతుడు "అళ్వార్లూ! మీరు ఆనందించడానికి ఈ ప్రకృతి మీకు అడ్డు కాదు సుమా. ఇది అనుకూలమే. ఈ ప్రకృతి మండలంలో మీ నుండి నేను సేవను స్వీకరించాలని కోరి తిరుమలలో ఉన్నాను. మీరు ఇక్కడికి వచ్చి సేవ చేసి ఆనందించవచ్చు" అని వేంకటాద్రిలో తాను ఉండే సన్నివేశాన్ని దర్శింపజేసి భగవంతుడు ఆళ్వారులను సమాధానపరచగా, వారు సమాధానపడి, ఈ దశకంలో వేంకటేశ్వరుని శ్రీచరణాలలో అన్ని విధాలైన సేవలను చేయాలని ఆశపడుతున్నారు.

## 24)తృతీయ శతకం-చతుర్థ దశకం
## # పుకழு నల్లొరువన్

గడచిన దశకంలో "**ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని ఒழுవిలా అడిమై శెయ్యవేండుమ్ నామ్**" అని భగవానునకు సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో సకల విధములైన సేవలను చెయ్యాలని ఆశపడిన ఆళ్వారుల మనోరథాన్ని చూచిన భగవంతుడు వారు తాము కోరిన రీతిలోనే సేవచేయడానికి అనుకూలంగా అన్ని వస్తువులలో తాను ప్రవేశించి, అంతటా ఉండే తన స్థితిని దర్శింపజేశాడు. ఆ విషయాన్ని దర్శించిన ఆళ్వారులు, గొప్ప గాలిలో కిందపడిన పండ్లను ఏరుకోవడానికి ఆశపడేవారు "ఈ పండును తీసుకుందామా? లేక, ఆ పండును తీసుకుందామా" అని తడపడినట్లుగా "దీనిని చెప్పనా? లేక, దానిని చెప్పనా?" అని అంటూ తడబడ్డారు. అంతటా అన్ని విధాలుగా అన్ని వస్తువులలో వ్యాపించి ఉండే ఆ భగవానునకు వాచికమైన సేవను చేయాలని తలచి "సకలకల్యాణగుణాలకు సముద్రంవంటి ఆ భగవానుని ప్రభావాన్ని నేను ఏమని వర్ణించను?" అని నిర్వేదంతో భగవంతుని సర్వాత్మకత్వాన్ని ఇందులో ఆళ్వారులు పలుకు-తున్నారు.

## 25)తృతీయ శతకం-పంచమ దశకం
## # మొయ్ మ్మామ్ పూంపొழிల్

ఆళ్వారులు గడచిన దశకంలో భగవంతుని చాలా ఆశ్చర్యకరంగా దర్శించి ఆనందించారు. ఆ అనుభవం వల్ల అపరిమితమైన ఆనందం వారికి కలిగింది. తమ మనసులో కలిగిన

ఆనందం వారి రూపంలో ప్రకాశించింది. అందువల్ల ఆడడం, పాడడం మొదలైన చేష్టలను చేశారు. ఈ లోకంలో ఈ విధంగా భగవద్గుణాలలో ఆసక్తిని పొంది ఆనందించి,



**మలైయప్పస్వామి - తిరుమల**

పారవశ్యాన్ని పొందిన శరీరాలను కలవారు ఎంతమంది ఉంటారు? అని పరిశీలించడం ఆరంభించారు. ఇటువంటివారు తక్కువ సంఖ్యలో ఉండడం చూశారు. భగవద్గుణాలలో ఆసక్తిని లేనివారే చాలామంది ఉండడం కూడా గమనించారు. మనసులో చాలా బాధ పడ్డారు. భగవంతుని గుణాలలో అభినివేశం కలవారిని మెచ్చి, ఆ విధంగా ఆసక్తి లేనివారిని నిందిస్తూ ఇందులో పలుకుతున్నారు. భగవంతుని గుణానుభవం ఎక్కువగా కలిగితే ఆ విధంగా కలిగినవారు నిలుచున్న చోటనే నిలువలేక ఆడడం. పాడడం

మొదలైన స్థితులను తప్పక పొందుతారు. ముక్తులు కూడా పరమపదంలో ఆనందించి ఆడి-పాడుతారు. నారద ముని మొదలైనవారు భగవంతుని సన్నిధిలోకి రాగానే ఆడడం, పాడడం చేస్తారని చెప్పబడుతున్నది కదా. ఇదే కదా మనకు కల కరచరణాది అవయవాలకు ప్రయోజనం. ఈ ప్రయోజనం పొందని పాపులను నిందించడం, పొందినవారిని పొగడడం అనేది భగవదనుభవంలో ఒక రీతి కనుక, అది ఈ దశకంలో చెప్పబడుతున్నది.

## 26)తృతీయ శతకం-షష్ఠ దశకం

## # శెయ్యతామరై క్కణ్ణనాయ్

గడచిన దశకంలో భగవంతుని గుణాలను, లీలలను తలచి చాలా ఆనందించింది ద్రవించి, తాము ఉన్న చోట ఉండలేక ఆడి పాడిన అళ్వార్లు, ఇదే జీవన యాత్రగా కలిగిన మహనీయులను స్తుతించారు. ఇటువంటి స్థితి లేనివారిని నిందించారు. ఆ విధంగా నిందింపబడిన లోకంలోనివారిని విడచి పెట్టలేని కరుణను కలవారు కదా ఆళ్వారులు. అందువల్ల, ఆ కరుణ కారణంగా ఆ పాపులను దారిలోకి తీసుకొని రావాలి అని భావించి, వారి రాతి గుండె కూడా చక్కగా కరిగేటట్లు భగవంతుని గొప్ప కల్యాణ గుణాలను వర్ణించి పలకాలి అని భావించిన ఆళ్వారులు ఈ దశకంలో పరమాత్మకు కల సౌలభ్య గుణాన్ని ప్రస్తావించి ప్రస్తుతిస్తున్నారు. మొదటి శతకంలోని మూడవ దశకం **"పత్తుడై"** అనే దశకంలో కూడా భగవంతుని సౌలభ్యగుణమే ప్రస్తావింపబడింది. అయినా, ఇప్పుడు ఆ గుణమే ఇక్కడ చెప్పబడినా, ఆ సౌలభ్య గుణం అంతకంటే విలక్షణ మైనది. అక్కడ చెప్పబడిన సౌలభ్య గుణం అవతారాలలోనిది. ఇక్కడ

వర్ణించే సౌలభ్యం అర్చావతార సౌలభ్యం. ఈ తేడాను శ్రీవరవరములు తమ నూఱ్ఱన్దాది ప్రబంధంలో పలికిన **"పత్తు-డైయోర్ క్కెన్ఱుమ్ పరనెళియనామ్ పిఱప్పాల్"** (భక్తిగలవారికి భగవంతుడు అవతరించడం ద్వారా సులభుడౌతాడు) అని, **"శెయ్య పరత్తువమాయ్ .... ఇన్నిలైయిల్ అర్చావతార మెళిదెన్రాన్"** (పరత్వం మొదలైన అన్ని దశలలోనూ అర్చావతారం సులభమని ఆళ్వార్లు అన్నారు) అనే సూక్తులద్వారా గమనించాలి. ఈ దశకానికి ప్రాణ స్థానీయమైన పాశురం **"తంజమాకియ తందై తాయొడు"** అనేది. అవతారం లోని సౌలభ్యాన్ని నిరూపించే పాశురం ఇదే.

## 27)తృతీయ శతకం-సప్తమ దశకం

## # పయిలుమ్ శుడరొళి

గడచిన దశకంలో ఆళ్వారులు అర్చావతార సౌలభ్యాన్ని తెలియజేసినా లోకుల రాతి గుండె కరుగలేదు. వారు లౌకిక విషయాలలోనే ఆసక్తులై ఉన్నారు. అటువంటి వారి స్వభావాన్ని చూచి ఆళ్వారులు గర్హించారు. ఆ ఏవగింపుకు పరిహారంగా తాము ఒక మహానందాన్ని అనుభవించాలని తలచి ఆళ్వారులు స్వరూపరూపపర్యంతసీమ అయిన భాగవతశేషత్వాన్ని ఈ దశకంలో అనుసంధించి దాని మూలంగా గొప్ప ఆనందాన్ని పొందుతున్నారు. ఒకడు ఒక వస్తువు విషయంలో గొప్ప ప్రేమను కలిగి ఉంటే, ఆ ప్రేమ అంతులేని లేనిదిగా ఉంటే, అది ఆ వస్తువువరకే నిలువకుండా, దానితో సంబంధం ఉన్న మిగిలిన వస్తువులలో కూడా ప్రసరించడం లోకంలో అందరికీ తమ తమ అనుభవంలో ఉండే విషయమే. ఆ విధంగానే ఇక్కడ భగవద్భక్తి అనేది భాగవత భక్తిగా పర్యవసించి వ్యక్తమవుతున్నది. భగవంతుని

పాదుకలలో మన గౌరవం కలిగినవారమై, వాటిని మన కళ్ళకు అద్దుకొని, వాటికి అభిషేకాన్ని చేసి ఆ తీర్థాన్ని స్వీకరించడం మన అనుభవంలో ఉన్నదే. ఇందువల్ల మనకి భగవంతుని విషయంలో ఉండే భక్తి అంతులేనిది అని కదా తెలుస్తున్నది. ఆ విధంగానే ఇక్కడ కూడా "**అడియారడియార్ తమ్మడియారడియార్ తమక్కడియా రడియార్ తమ్మడియారడియోంగళే**" (భగవానుని దాసులకు దాసులకు దాసులకు దాసులు) అనే విధంగా భాగవతశేషత్వం మొదలైన విషయాలను పలకడం భగవత్ శేషత్వంలోకి చేరుతుంది. అంతేకాక దాని అతిశయాన్ని కూడా తెలిపినట్లవుతుంది.

## 28)తృతీయ శతకం-అష్టమ దశకం

## # ముడియానే

గడచిన "**శెయ్య తామరై క్కణ్ణన్**" దశకంలో భగవంతుని విషయంలో తమకు ఉండే ఆర్తిని "**అన్ఱు తేర్ కడవియ పెరుమాన్ కనైకళల్ కాణ్బదు ఎన్ఱుకొల్ కణ్కళే**" (ఆనాడు అర్జునుని రథాన్ని నడిపిన శ్రీకృష్ణుని, అందెలతో ధ్వనించే పాదాలను సేవించడం ఎపుడో కదా?) అని ఆళ్వార్ వ్యక్తం చేశారు. వారికి అప్పుడు భగవంతుడు భగవద్భక్తులను చూపి ఒక విధంగా ఓదార్పును కలిగించాడు. అది గడచిన దశకంలో చెప్పబడింది. అందులో, భగవంతుని భక్తులను దర్శించి ఆనందించిన ఆళ్వారులు వారు మెచ్చిన విషయమైన భగవంతుడనే విషయంలోని గొప్పతనాన్ని ప్రతి పాదంలోనూ పూర్వార్ధంలో పలికినందున ఆ అనుభవం మళ్లీ పూర్వం వారికి ఉండే ఆర్తిని మళ్ళీ కలిగించింది. "**ఎన్ఱుకొల్ కణ్ కళ్ కాణ్బదు?**" (కన్నులు దర్శించడం ఎప్పుడో కదా?) అనే విధంగా కన్నులకు మాత్రం

కలిగిన ఆర్తి మిగిలిన ఇంద్రియాలలో కూడా కలిగింది. అది ఒక విలక్షణమైన రీతిలో కలిగింది. అంటే ఏమి అర్థం? అని అంటే , ఒక ఇంద్రియం చేసే వ్యాపారాన్ని ఇంకొక ఇంద్రియం ఆశపడే రీతిలో ఆర్తి ఏర్పడింది. తమకంటే ఆర్తిని పొందిన కరణాలు, కరణాల కంటే ఆర్తిని పొందిన తాము, ఈ విధంగా ఒక విలక్షణమైన స్థితి ఆళ్వారులకు కలిగింది. ఎక్కువ సంతానం కలిగిన ఒకడు కరువు కాలంలో తన ఆకలి భరించలేక, తన సంతానం ఆకలికి చూచి నిలువలేక , సంతానం నోటిలో ఉండే ఆహారాన్ని తాను తీసికొని భుజించడం, తన నోటిలో ఉండే ఆహారాన్ని వారి నోటికి అందివ్వడం చేస్తూ, "నా ఆకలిని ఏ విధంగా పోగొట్టుకుంటాను? నా సంతానం ఆకలిని ఏ విధంగా తీర్చగలను?" అని తల్లడిల్లేటట్లు ఆళ్వార్లుకూడా తమ కరణాలు, తాము బాధపడి ఆక్రందించే రీతిని ఈ దశకం తెలుపుతున్నది. ఈ దశకంద్వారాకం ఆళ్వారుల భక్తి చాలా విలక్షణమైనది అనే విషయం వ్యక్తమవుతుంది.

## 29)తృతీయ శతకం-నవమ దశకం
## # శొన్నాల్ విరోదమ్

ఆళ్వారులు కొన్ని సమయాలలో తమ కష్టానికి బాధపడతారు. మరి కొన్ని సమయాలలో సంసారుల హానిని చూచి బాధపడతారు. గడచిన దశకంలో వారు తమ కష్టాలను చూసి బాధ పడ్డారు. ఈ దశకంలో సంసారుల కష్టాల కోసం ఆక్రందిస్తున్నారు. కవిత్వాన్ని చెప్పగలిగిన శక్తిని పొంది, ఆ శక్తిని భగవంతుని విషయంలో ఉపయోగించకుండా, క్షుద్రమైన పురుషార్థాలను కోరి, అల్ప మానవుల విషయంలో దానిని ఉపయోగించి, "నరస్తుతిని చేసే కవులు" అనే నీచమైన పేరును పొంది, సంచరించేవారిని చూచి చాలా బాధ పడ్డారు, ఆళ్వారులు. వారిని తమ ఉపదేశంతో

మార్చి సంస్కరించి, భగవంతుని విషయంలో వారు కవిత్వాన్ని చెప్పేటట్లు చేసి బాగు చేయాలని తలచారు. వారిని పిలిచి సంబోధిస్తూ "మీరు ఈ విధంగా మీ వాక్కు హీనమైన విషయాలలో ఉపయోగించి అధోగతిని పొందడం సరికాదు" అని ఈ దశకంలో ఆళ్వారులు పలుకుతున్నారు. లోకంలో జ్ఞానం కలిగిన వారై ఉండడం అరుదు. జ్ఞానం కలిగి ఉన్నా కవిత్వాన్ని చెప్పగలిగిన సామర్థ్యం కలిగి ఉండడం చాలా అరుదు. ఆ సామర్థ్యం పొందినవారు తగిన విషయంలో తమ వాక్కును ఉపయోగించకుండా, నరస్తుతిలో వినియోగించడం చాలా విచారించదగిన విషయం. సంస్కృతంలో 'ప్రతాపరుద్రీయం' అనే



**మలైయప్పస్వామి - తిరుమల**

ఒక గ్రంథం చాలా ప్రసిద్ధమైనది. దీనిని రచించిన కవి పాండిత్యాన్ని, కవిత్వాన్ని ఆశ్చర్యకరమైన రీతిలో కలవాడు, అయినా, అతడు రచించిన ఆ గ్రంథం భగవంతుని గుణకీర్తనంలో చేయబడి ఉంటే చాలా అందంగా ఉండేది. ఆ విధంగా కాకుండా అల్ప ప్రయోజనాన్ని ఆశించి ఒక నీచ ప్రభువును విషయంగా చేసికొని ఈ గ్రంథం రచింపడినందున భగవద్భక్తులు ఏవగించుకునే రీతిలో ఉన్నది ఇటువంటి గ్రంథాలు లోకంలో ఎన్నో ఉన్నాయి. ఇటువంటి గ్రంథాలను రచించిన కవుల విషయంలో అళ్వారులకు ఉండే కోపం అంతులేనిది. ఆళ్వారులు తమ వాక్కు భగవంతుని విషయంలో ఉపయోగపడినందున ఆనందించి, మిగిలినవారు ఏ గతిని పొందినా పొందనీ ,దానిని గురించి చింతించను "**ఆరానుమాదానుమ్ శెయ్య అకలిడత్తై ఆరాయ్ న్దు అదు తిరుత్తలావదే**!" (విశాలమైన ఈ లోకంలో ఎవరు ఏమైనా చేయనీ! వారిని పరిశీలించి దిద్దుబాటు చేయడం సాధ్యం అవుతుందా?) అని పెరియ తిరువందాది ప్రబంధంలో పలికిన రీతిలో సంసారం గురించి బాధపడకుండా ఉండవచ్చు. కానీ, ఆ విధంగా ఉండే స్వభావం ఆళ్వారులకు లేదు. అందుచేత నరస్తుతిని చేసి కవిత్వం చెప్పే కవులను చూసి ఇందులో ఉపదేశిస్తున్నారు.

## 30)తృతీయ శతకం-దశమ దశకం

## # శన్మమ్ పల పల

గడచిన దశకంలో స్తుతించడానికి తగిన స్వరూపరూపగుణవిభూతిలీలలను కలవాడైన భగవంతుని స్తుతించడం మాని, క్షుద్రనరులను స్తుతించడంలో ఆసక్తులు అయినవారిని తమ ఉపదేశంతో బాగు చేయాలని చూచిన

ఆళ్వారులు తమ ఉపదేశంవల్ల వారు బాగుపడడనందున చాలా బాధపడ్డారు. "లోకంలోని వారివలె తాము కూడా నీచమానవులను స్తుతించకుండా ఉన్నాము కదా"–అనే సంతోషంతో గడచిన దశకాన్ని ఆళ్వారులు ముగించారు. ఆ ఆనందమే విశేషంగా ప్రవహించి వ్యక్తమవుతున్నది, ఈ దశకంలో. నరస్తుతిలో ప్రవేశించకపోవడం మాత్రమే కాక, భగవంతుని విషయంలో పరిపూర్ణంగా అవగాహించగలగడం, ఆనందించగలగడం అనే తమ అదృష్టాన్ని వివరంగా పలికి, ఏ విధమైన దుఃఖం గాని , దోషంగాని, హాని గాని తమకు లేదని అంటూ చాలా ఆనందంగా ఈ దశకంలో పలుకుతున్నారు.



**నమ్మాళ్వార్ - ఆళ్వార్ తిరునగరి**

# 31)చతుర్ధ శతకం-ప్రథమ దశకం
# # ఒరునాయకమ్

గడచిన మూడవ శతకం చివరి దశకంలో ఆళ్వార్లకు అంతులేని ఆనందం కలిగింది. తమకు ఏ కొరతా లేదు అనే విషయాన్ని వారు మాటి మాటికి వివరించి అందులో పలికారు.



శ్రీ శెల్వ నారాయణస్వామి - తిరునారాయణపురం(మేల్కోట)

సంసారులను తమ వలె ఏ కొరత లేనివారుగా చేయడంలో చాలా ఆసక్తిని కలవారైన ఆళ్వారులు వారిని సంస్కరించాలని

భావించారు. దానికి తగినట్లు ఈ దశకంలో ఉపదేశం చేస్తున్నారు. ప్రతి శతకంలోనూ ఉపదేశ రూపంగా ఒక శతకం కనిపిస్తుంది. మొదటి శతకంలో "**వీడుమిన్ ముఱ్ఱవుమ్**" అనే దశకం, రెండవ శతకంలో "**అణైవదు అరవణైమేల్**" అనే దశకం, మూడవ శతకంలో "**శెయ్య తామరై క్కణ్ణనాయ్**" అనే దశకం, "**శొన్నాల్ విరోదమ్**" అనే దశకంవలె ఈ శతకంలో ఈ దశకం ఉపదేశరూపంగా అవతరించింది. ఇందులో "**శొన్నాల్ విరోదమ్**" లో వలె అల్పులైన మానవులను స్తుతించడం చాలా చెడ్డ అని అన్నారు. ఈ లోకంలో పలువురు నీచులను స్తుతించడానికి ప్రయత్నించడం ఏవో కొన్ని ప్రయోజనాల కోసం కనుక, ఆ ప్రయోజనాలు అల్పంగా, అస్థిరంగా ఉండే రీతిని బాగా తెలిపితే, వివేకం లేనివారు కూడా దానిని గ్రహించి సంస్కరింపబడతారు అని ఆళ్వార్లు భావించారు. భగవత్ప్రాప్తి కంటే వేరు ప్రయోజనం ఏదయినా, అది ఆల్పత్వం, అస్థిరత్వం మొదలైన దోషాలవల్ల తగనివిగా ఉండడాన్ని ఇందులో ఆళ్వారులు ఉపదేశిస్తున్నారు.

## 32)చతుర్థ శతకం-ద్వితీయ దశకం

## # పాలనాయ్

మూడవ శతకంలోని "**ముడియానే**" అనే దశకంలో ఆళ్వార్లకు కలిగిన దశ తరువాత ప్రాసంగికమైన మూడు దశకాలలో అణగి ఉన్నది. ఇప్పుడు అది మళ్ళీ తలఎత్తింది. విభీషణుడు రావణునకు పలికిన హితం అతనికి ఉపయోగపడలేదు. అతడు శ్రీరాముని ఆశ్రయించడానికి ఉపయోగపడలేదు. ఆ విధంగానే హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు పలికిన హితం అతని మనస్సులో పడలేదు. అతనిలో భగవద్భక్తి కలగడానికి ఉపయోగించలేదు. ఆ విధంగానే ఇక్కడ ఆళ్వారులు చేసిన ఉపదేశం లోకులకు

ఉపయోగించ లేదు. అది కేవలం ఆళ్వార్లకు భగవంతుని విషయంలో మరింత మరింత అభినివేశం పొందడానికి కారణమైనది. అందువల్ల ఆనాడు ఎప్పుడో సంభవించిన భగవంతుని వృత్తాంతాలను ఆ కాలంలో వలె ఈనాడు అనుభవించాలి అనే ఆర్తి ఆళ్వార్లకు కలిగింది. తాము ఆశ పడిన రీతిలో వారు అనుభవించ లేకపోయారు. అందుచేత వారి మనసులో ఆర్తి చాలా ఎక్కువగా కలిగింది. ఆశ పడినట్లు ప్రయోజనం లభించనందున, భగవంతునితో కలసి, తరువాత దూరమైన ఒక నాయకి దశను వారు పొందారు. ఆ నాయకి మోహాన్ని పొందగా, ఆమెకు కలిగిన ఆ దశను ఆమె తల్లి చూచి బాధపడి, తమ కుమార్తె దశను వివరిస్తూ పలికే క్రమంలో ఈ దశకం అవతరించింది. దీని ద్వారా ఆళ్వార్లకు భగవంతుని విషయంలో ఉండే గొప్ప ఆర్తి తెలుపబడినట్లయినది.

## 33)చతుర్థ శతకం-తృతీయ దశకం

## # కోవై వాయాళ్

గడచిన దశకంలో ఆళ్వారులు ఆశ పడిన రీతిలో అన్ని విధాలైన అనుభవాలను వారు పొందేటట్లు భగవంతుడు వారితో కలిశాడు. తన పరమ ప్రణయిత్వ గుణాన్ని వ్యక్తం చేశాడు. దానిని దర్శించి చాలా ఆనందించిన ఆళ్వారులు ఆ గుణాన్ని ఈ దశకంలో వ్యక్తం చేస్తున్నారు. ఈ దశకాన్ని మన పూర్వాచార్యులు మూడు విధాలుగా నిర్వహించారు.

1) చంద్రుని పట్టి తనకు ఇవ్వాలని ఏడ్చే కుర్రవానికి కొబ్బరికాయ ఇచ్చి అతని ఏడుపు మాన్పించడం అనే రీతి ఒకటి ఉన్నది కదా. ఆ విధంగానే, గడచిన దశకంలో దేశకాలాలకు దూరమైన అనుభవాన్ని పొందాలని ఆశపడిన ఆళ్వారులకు

భగవంతుడు ఒక విలక్షణమైన ప్రణయిత్వగుణాన్ని అనుభవింపజేసి, దానివల్ల పూర్వం కలిగిన వారి క్లేశాన్ని తీర్చాడు. అందువల్ల ఈ దశకంలో ఆళ్వారులు ఆ ప్రణయిత్వగుణాన్ని కీర్తిస్తున్నారు అని 'గోవింద భట్టర్' అనే ఎంబార్ తెలిపారు.

2) కాలం వల్ల, దేశం వల్ల దూరమైన విషయాన్ని అనుభవించాలని ఆశ పడిన ఆళ్వారుల ముఖాన్ని చూసి భగవంతుడు "ఆళ్వారులూ! మీరు కోరిన రీతిలోనే చేస్తాను" అని ఒక మాట అనగానే, దానిని విని ఆనందించి తాము పొందిన బాధను ఆళ్వారులు మరచిపోయారు–అని 'తిరుమలనంబి' తెలిపారు.

3 )భగవంతుడు అళ్వారులు కోరిన రీతిలోనే చేసి వారిని ఆనందింప చేయ సమర్థుడైననందున, అంటే, తన ఇష్టం వచ్చిన రీతిలో కాలాన్ని నియమించగలిగినవాడై ఉన్నందున, కాల నియమాన్ని దాటి గడచిన కాలంలో జరిగిన అనుభవాలను ప్రస్తుత కాలంలో వలెనే జరిగినట్లుగా అనుభవింపజేయగా, వాటిని అనుభవించి ఆళ్వారులు ఆనందిస్తున్నారు–అని పరాశర భట్టర్ తెలిపారు.

ఆళ్వారులు కోరినట్లు అనుభవాన్ని ఇవ్వకుండా ఏదో ఒక అనుభవాన్ని అనుభవింప చేయగా దానివల్ల వారు ఆనందించారు–అని ఎంబార్ నిర్వాహం. ఆళ్వారులు కోరిన అనుభవాన్ని ఇవ్వకపోయినా, ఇస్తానని వారి ముఖాన్ని చూసి భగవంతుడు చెప్పి వారిని ఆనందింప చేశాడు–అనేది 'తిరుమల నంబి' నిర్వాహం. ఆశించిన రీతిలోనే భగవంతుడు వారిని ఆనందింప చేశాడు అనేది 'పరాశర భట్టర్' నిర్వాహం. ఈ విధంగా ఈ దశకాన్ని మూడు విధాలుగా వివరించే అవకాశం ఉన్నది–అని ఈ వివరణలవల్ల తెలుస్తున్నది.

## 34)చతుర్ధ శతకం-చతుర్ధ దశకం
## # మణ్ణైయిరున్తుழாవి

ఆళ్వారుల పరమ వైష్ణవత్వాన్ని ఈ దశకం నిరూపిస్తున్నది. భగవంతుని సంబంధాన్ని పొందిన వస్తువులను, భగవంతునితో సామ్యాన్ని కలిగిన వస్తువులను చూచి, ఆ భగవంతుని చూసినట్లు ఆనందించడమే పరమ వైష్ణవత్వం. ఆ స్థితిని ఆళ్వారులు ఈ దశకంలో పొందారు. గడచిన దశకంలో భగవంతుని ప్రణయిత్వ గుణాన్ని వర్ణించి, చాలా ఆనందాన్ని ఆళ్వార్లు పొందారు. ఆ స్థితిని చూసిన భగవంతుడు వేరొక అనుభవంతో ఆ అనుభవాన్ని వంట పట్టేటట్లు చేయడంకోసం తన సంశ్లేషాన్ని కొంచెంసేపు దూరం చేశారు. ఆ కారణంగా ఆళ్వారులకు ఆర్తి కలిగింది. డబ్బు సంచి పోగొట్టుకున్న వాడొకడు ఆ సంచి వలె ఉండే అన్ని సంచులను ముడి విప్పి చూసి వెదకినట్లు, భగవంతునితో సామ్యాన్ని కలిగిన వస్తువులను అన్నిటినీ, అతనితో సంబంధం వస్తువులను అన్నిటిని ఆ భగవంతునివలె తలచి వాటి దగ్గరకు వెళ్ళి చూచి, ఆళ్వారులు ఉన్మాదాన్ని పొందే రీతిని ఈ దశకం తెలుపుతుంది. నాయకి తల్లి మాటలతో అవతరించిన దశకం ఇది.

## 35)చతుర్ధ శతకం-పంచమ దశకం
## # వీఱ్ఱిరుందేழ்ఉలకమ్

గడచిన దశకంలో ఆళ్వారులు చాలా ఆర్తితో పలికారు. ఈ విధంగా అళ్వార్లు ఆర్తిని పొందాలనే కదా భగవంతుని ఉద్దేశ్యం. అన్నాన్ని భుజించడానికి ఆకలి అనేది ఉపకరణం అయినట్లు, భగవంతుని అనుభవించడానికి అంతులేని ఆశయే కదా

ఉపకరణం. ఆ ఆశ కలిగితే తప్ప పరిపూర్ణమైన అనుభవాన్ని ఇవ్వడానికి భగవంతుడు ఇష్టపడడు. అటువంటి ఆశ ఆళ్వార్లకు పూర్ణంగా ఈ ప్రబంధం చివరి దశకంలో కలుగబోతుంది. "**ముడిన్ద అవా**" అదే. దానిని పొందడం కోసమే అంతకుముందు చేసిన అంతులేని కృషి అంతా భగవంతుడు నిరంతరంగా తన సాక్షాత్కారాన్ని కలిగించకపోతే ఆళ్వార్లను కోల్పోవలసివస్తుంది కదా. "**తొండర్ క్కముదెన్నచ్చొల్ మాలైకళ్ శొన్నేన్**" (భక్తులకు అమృతంవంటి పాశుర మాలికలను చెప్పాను) అనే విధంగా భగవంతుని వట్ల రాసిక్యాన్ని కలవారికి చలువ పందిరి వేయడం కోసం కదా భగవంతుడు ఆళ్వార్లను ఈ లోకంలో ఇంతకాలం ఉంచాడు. సంశ్లేషం, విశ్లేషం అనేవి మారి మారి కలిగితే తప్ప భగవంతుని ఈ ఆశ నెరవేరే అవకాశం లేదు. మన వంటి వారి భాగ్యం పండే దారి లేదు. ఈ దశకంలో ఆళ్వారులకు కలిగే ఆనందం మాటలకు అందనిది. "**ఇని ఎన్న కుఱై?**" (ఇక ఏమి కొరత?) అని గుండెలను తడుతూ పలికేటట్లు వారిని భగవంతుడు ఆనందింప జేశాడు. ఈ దశకంలోని అనుభవ సన్నివేశం చూచినప్పుడు అంతకు మించి పరిపూర్ణమైన అనుభవం ఇంకొకటి లేదు–అనే విధంగా ఉంటుంది.

అందువల్లనే ఈ దశకం "**శూழ் విశుంబు**" అనే దశకానికి తరువాత దశకంగా ఉండి ఉండవచ్చు అని నంజీయర్ రసోక్తిగా అనేవారట. గడచిన దశకంలో భగవంతునితో సామ్యాన్ని లోకంలోని వస్తువులలో చూచి భ్రమించి ఆర్తి అధికంగా పొందిన ఆళ్వారులకు భగవంతుడు ఉభయవిభూతినాథుడై ఉండే తన విభూతిప్రకారాలను ఏమి లోటు లేని విధంగా పూర్ణంగా దర్శింప జేశాడు వారు ఆ ప్రకారాలను అన్నిటిని దర్శించారు. అపుడు స్వామి "ఆళ్వార్లూ! నా ఈ ఐశ్వర్యం అంతా మీ మాట ప్రభావంవల్లనే ఏర్పడింది సుమా. అందువల్ల మీరు నా ఐశ్వర్యాన్ని కీర్తించండి" అని పలికి ఆళ్వారుల చేతికి తన సంపద

తాళాలను ఇచ్చాడు. భగవంతుని ఆ నిరతిశయమైన ఐశ్వర్యాన్ని దర్శించి ఆనందించిన అళ్వార్లు దానికి మంగళాశాసనం ఈ దశకంలో చేస్తున్నారు.

## 36)చతుర్థ శతకం-షష్ఠ దశకం

## # తీర్ ప్పారై యామిని

గడచిన దశకానికి తరువాత ఈ దశకం ఉండే అవకాశం లేదు–అని మన పూర్వాచార్యులు అనేవారు. గడచిన దశకం అంతులేని ఆనందంతో గడిచింది. దానికి సరిగ్గా వ్యతిరేకమైన రీతిలో ఈ దశకం ఉన్నది. గడచిన దశకానికి, ఈ దశకానికి మధ్య సంగతిని చెప్పాలని ఎంబార్ ను కొందరు అడిగారట. దానికి సమాధానంగా "ఈ ప్రశ్నకు నేను ఏమని సమాధానం చెప్పను? అసంగతే సంగతి అని గ్రహించండి" అని చమత్కారంగా పలికారట. ఇది చాలా రసవంతమైన మాట. సంగతి చెప్పడానికి సాధ్యం కాదని దీనివల్ల పైపైకి తోచే అర్థం. అసంగతి అనేది విశ్లేషణం అనే అర్థాన్ని ఇస్తుంది. భగవంతుని ఆళ్వారులు విశ్లేషించడం ఇక్కడ సంగతి అనేది ఇక్కడ పరమార్థం. "**తీర్ ప్పారై యామిని**" అనే దశకంలో ఆళ్వార్లకు కలిగిన వ్యామోహాన్ని తీర్చడం కోసం దగ్గరకు వచ్చిన భగవంతుడు కనపడకుండా నిలువగా, ఆ స్వామి విశ్లేషాన్ని సహించలేక ఆళ్వార్లు ఈ దశకాన్ని విషాదంతో పలుకుతున్నారు.

ఆళ్వార్లు తమ ఆళ్వారుల దశను కోల్పోయి ఒక నాయకి స్థితిని పొందారు. అందులోనూ తన స్థితిని తన నోటితో చెప్పలేక ఇతరుల నోటితో వ్యక్తం చేయవలసిన స్థితి ఏర్పడింది. ఈ దశకం 'వెఱివిలక్కు' అనే ఆలంకారిక ప్రక్రియలో సాగింది. నాయకుని విరహాన్ని సహించలేక చాలా బాధ పడే నాయకి శరీరంలో కలిగిన

మార్పులను ఆమె తల్లి చూచింది. ఈమె ఈ విధంగా కృశించి పోవడానికి ఏమి కారణం? అని చాలా బాధపడి, 'సోది' ను చెప్పే సోదికత్తెను పిలచి ఆమెను అడిగింది. ఆమె కూడా తన పద్ధతి ప్రకారం గమనించి చూచి "ఈమెను మురుగన్ అనే దైవం ఆవేశించింది. తప్ప వేరొకటి లేదు" అని అన్నది. దీనిని విన్న తల్లి వెంటనే ఆ దైవం వదిలిపోయే పూజా పరిహారాన్ని చేయడానికి తగినవారిని పిలిచి, ఆవేశంగా ఆడించడం మొదలైన పనులను చేయించింది. దీనిని అంతా చూచిన నాయకి మనస్సు చాలా బాధపడింది. తన మనసును తల్లి గుర్తించలేదని క్లేశపడింది. అపుడు నాయకి మనసులోని నిజమైన అభిప్రాయాన్ని తెలిసికొన్న ఆమె చెలికత్తె తల్లి చేసే ప్రయత్నాలను అడ్డుకుంటూ పలికే దశకంగా ఈ దశకం అవతరించింది.

## 37)చతుర్థ శతకం-సప్తమ దశకం

## # శీలమిల్లా చ్చిఱియన్

వాడిపోయి నేల వాలిన తీగ, వర్షపు చినుకు పడగానే మళ్లీ గురించి ఏపుగా పెరిగేటట్లు, భగవంతుని విశ్లేషంలో అంతులేని ఆర్తితో ఉండే ఆళ్వారులు చెలికత్తె మాటలలో వ్యక్తమైన భగవన్నామాలను వినగానే చాలా తెలివిని పొందారు. అంతే తప్ప, తాము కోరిన రీతిలో భగవంతునితో కలయికను పొందలేకపోయారు. మోహాన్ని పొందిన వారి దశయే బాగున్నది. ఎందుకంటే, అప్పుడు తెలివి లేనందున దుఃఖం తెలియదు. నిద్రలో ఆకలిని సహించవచ్చు. మెలుకువ వస్తే భుజిస్తే తప్ప నిలువ లేరు కదా. ఆ విధంగానే ఆళ్వార్లకు కూడా మోహాన్ని పొందిన దశలోనే ఒక విధంగా సహించే స్థితిలో ఏర్పడింది, కానీ ఇప్పుడు తెలివి వచ్చినందున సహించడానికి సాధ్యం కాని ఆర్తి కలిగింది.

భగవంతుని విశ్లేషం ఈ దశకంలో ఆళ్వారులు ఆక్రందిస్తున్నారు. రోగులు మోహంలో ఉండేది సమయంలో కొంత బాధను సహిస్తారు. మోహం తీరగానే సహించలేనంత బాధను పొందుతారు కదా. ఇప్పుడు ఆ స్థితి ఆళ్వార్లకు కలిగింది. భగవంతుడే ఆపదలనుండి కాపాడగలడు. ఆపదకు మూలకారణాన్ని తెలిసి పరిహారాన్ని చేయగలవాడు. విశ్లేషిస్తే సహించడానికి సాధ్యం కాని రీతిలోని అందాన్ని కలవాడు. ఆపదలో విరోధిని పోగొట్టి సహాయపడడానికి తగిన శక్తిని కలవాడు. అయినా అతడు ఆర్తిని తీర్చడం లేదు అనే బాధతో, తమ మాటలను విన్న వారు అందరూ నీరైపోయే రీతిలో ఇందులో ఆళ్వారులు ఆక్రందిస్తున్నారు.

## 38)చతుర్థ శతకం-అష్టమ దశకం

## # ఏఱాళుమిఱైయోనుమ్

తమ మాటలను విన్నవారు అందరూ నీరు అయిపోయే విధంలో ఆళ్వారులు పలికినా, భగవంతుడు వచ్చి తన దర్శనాన్ని వారికి ఇవ్వలేదు. అందువల్ల భగవంతుడు తమను వద్దని అనుకుంటున్నాడని ఆళ్వారులు తమ మనసులో నిశ్చయించుకున్నారు. అతడు ఈ విధంగా కాదను కోవడానికి లక్ష్యమైన ఈ ఆత్మ, ఆత్మకు సంబంధించినవి అన్నీ నాకెందుకు? అతనికి అక్కరలేనివి నాకెందుకు? అని ఆత్మ ఆత్మీయాలును అన్నిటిని ఈ దశకంలో ఆళ్వారులు త్యజిస్తున్నారు. ఆళ్వారులు జనకకులసంతతితో (సీతతో) సాటి వస్తారు–అని మన పూర్వా-చార్యుల నిశ్చయం. సీతాదేవి అశోక వనం లో ఉన్నప్పుడు "**న హి మే జీవితేనార్థో నైవార్థైః న చ భూషణైః, వసంత్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్**" (రామునకు దూరమై రాక్షసస్త్రీల మధ్య ఉండే నాకు జీవితంతో పనిలేదు, ఆభరణాలతో పనిలేదు) అని

తన ఆత్మను, ఆత్మకు చెందినవానిని అన్నిటినీ వద్దని అనుకున్నది కదా. శ్రీరాముని పొందలేక, రాక్షసులమధ్య పడి ఉండే నాకు నా ప్రాణం, శరీరం మొదలైనవాని వల్ల ఏమి ప్రయోజనం? అని అన్నది కదా! అటువంటి స్థితి ఇప్పుడు ఆళ్వార్లకు ఆళ్వారుల దశలోనే, అంటే, స్త్రీభావన లేకుండానే కలిగింది. ఈ దశకం అళ్వార్లు అళ్వార్ల దశలోనే అనుగ్రహించలేదు, నాయకి భావంతో పలికారు అనేదానికి



**తిరువేంగడముడయాన్**

ఈ దశకంలో ఉండే "**మణిమామై కుఱైవిలమే, మేకలైయాల్ కుఱైవిలమే, వరివళైయాల్ కుఱైవిలమే**" (లావణ్యం వల్ల ప్రయోజనం లేదు, మేఖల(వడ్డాణం) వల్ల ప్రయోజనం లేదు, మంచి గాజుల వల్ల ప్రయోజనం లేదు) మొదలైన ప్రయోగాల వల్ల తెలుస్తుంది. తిరుమంగై ఆళ్వార్లు 'పెరియ తిరుమడల్' ప్రబంధంలో "**కన్నవిలుమ్ కాట్టకత్తోర్ వల్లిక్కడిమలరిన్ నన్నఱువాశమ్ మఱ్ఱారానుమెయ్ దామే మన్నుమ్ వఱునిలత్తు వాళాంగు కుత్తదుపోల్, ఎన్నుడైయ పెణ్ మైయుమ్ ఎన్నలను మెన్ ములైయుమ్, మన్నుమలర్ మంగైమైందన్ కణ పురత్తు పొన్ మలైపోల్ నిన్ఱవన్ఱన్ పొన్నకలమ్ తోయావేల్, ఎన్నివైతాన్ వాళా ఎనక్కే పొఱైయాకి మున్నిరుందు మూక్కిన్ఱు మూవామై కాప్పదోర్ మన్నుమరుందఱివీరిల్లైయే**" (రాళ్ళతో నిండిన అరణ్యంలోపల ఒక తీగకు పూచిన తేనె నిండిన పూల యొక్క మంచి పరిమళం ఎవ్వరికీ ఉపయోగపడకుండా కేవలం నేలమీదే వ్యర్థంగా ఉండిపోయేటట్లు - జ్ఞానం లేని నా ఆడతనం, నా గుణాలు, నా వక్షస్సు, తామరపూవులో నివసించే లక్ష్మీదేవి వచ్చి చేరే యువకుడు తిరుక్కణ్ణపురంలో బంగారు పర్వతంవలె ఉండేవాడైన భగవంతుని అందమైన వక్షస్థలంలో చేరలేకపోతే-ఇవన్నీ ఎందుకు? ఇవి నాకు భారంగా నా కంటిముందు ముసలితనాన్ని పొందుతున్నవి. ఈవిధంగా ముసలితనం పొందకుండా అడ్డుకోగల మందును తెలిసినవారెవరూ లేరే!) అని పల్కడం గమనించాలి.

# 39)చతుర్థ శతకం-నవమ దశకం

# # ముఖువలిప్ప

గడచిన దశకంలో ఆళ్వారులు "నాకు ఆత్మ వద్దు, ఆత్మకు సంబంధించినవి వద్దు, అది వద్దు, ఇది వద్దు" అని అన్నిటినీ కాదనడం మొదలుపెట్టారు. తాము కాదనుకున్నా, వద్దని అనుకున్నా అవి వదలిపోయేవి కావు కదా. ప్రాప్యాన్ని పొందడానికి మనం ఏవిధంగా భగవంతుని కరుణను ఎదురు చూసేటట్లే, మరణించాలన్నా ఆ స్వామి అనుమతి కావాలి.



శ్రీ మలైయప్పన్ - తిరుమల

అందువల్ల "స్వామీ! నన్ను నీవే అంతం చెయ్యి" అని అంటున్నారు, ఆళ్వారులు. వీరికి కలిగిన ఆర్తి మాటలకు అందని రీతిలో కలిగింది. దానిని ఈ దశకం వ్యక్తం చేస్తున్నది. ఆళ్వారుల

ఆర్తికి మూడు కారణాలున్నాయి. భగవంతునితో కలయికను పొందలేక విశ్లేషించి పొందే ఆర్తి ఒకటి. లోకులతో కలసి జీవించ లేక అనుభవించే ఆర్తి రెండవది. ఇంద్రియాలు తమ తమ విషయాలలో ఆకర్షించి అనర్థాన్ని కలిగిస్తున్నందున కలిగే ఆర్తి మూడవది. వీటిలో, భగవంతునకు దూరమైనందున కలిగిన ఆర్తి గడచిన దశకంలో వ్యక్తం చేయబడింది. ఇంద్రియాల వల్ల కలిగే ఆర్తి తరువాత రాబోయే "**ఉణ్ణిలా ఐవరాల్**" అనే దశకంలో వ్యక్తం కానున్నది. ఆ విధంగానే, సంసారులతో సహవాసాన్ని సహించలేనందున కలిగే ఆర్తి ఈ దశకంలో గమనించవచ్చు.

## 40)చతుర్థ శతకం-దశమ దశకం

## # ఒన్ఱుమ్ తేవుములకుమ్

గడచిన దశకంలో ఆళ్వారులు తమకు సంసారులతో సహవాసం సహించరానిదై ఉన్నదని పలు విధాలుగా తమ ఆర్తిని వ్యక్తం చేశారు. ఒక విధంగా వారి బాధను తీర్చాలని అభిప్రాయపడిన భగవంతుడు పరమపదంలో లక్ష్మీదేవి, తాను కలసిఉండే సన్నివేశాన్ని ఇక్కడ ఆళ్వార్లకు దర్శింపజేశాడు. ఆళ్వారులు కూడా దానిని దర్శించి ఒక విధంగా సమాధానపడి ఆనందించారు. "**కణ్ణాళా కడలై క్కడైన్దాయ్! ఉనకళత్కే వరుమ్ పరిశు తణ్ణావా దడియేనై ప్పణికండాయ్ శామాతే**" (కృపను కలవాడవై, గొప్ప ప్రయత్నం చేసి, భక్తులు కోరిన వాటిని సాధించి ఇచ్చేవాడా! నీ చరణాలలోనేను చేరేటట్లు ఆలస్యం కాకుండా శరీరాన్ని పోగొట్టి నా నుండి సేవను స్వీకరించు) అని, **“ఆమాఱొన్ఱఱియేన్ నాన్ అరవణైయాయ అమ్మానే! కూమాతే విరై కండాయ్ అడియేనై క్కుఱిక్కొళ్ళే**" (ఈ దుఃఖం తీరే ఉపాయం ఏదో నేను తెలియలేకున్నాను. ఆదిశేషునిపై శయనించి

ఉండే స్వామీ! నీకు శేషమైన న్ను కటాక్షించి, నీ దగ్గరకు పిలుచుకునేటట్లు నీవు తొందరగా ప్రయత్నించాలి) అని రాళ్లు కూడా కలిగే రీతిలో ఆళ్వారులు ఆక్రందించారు .అయినా భగవంతుడు వీరిని ఈ స్థితిలోనే ఉంచాడు. దీనికి అనేక కారణాలున్నాయి. వీరిద్వారా లోకానికి ఉపదేశాలను అందించి దానిని దిద్దుబాటు చేయాలి అనేది ఒక హేతువు కనుక, దానికి తగినట్లు భగవంతుడు ఒక విధంగా అళ్వార్లను ఈ లోకంలో ఉంచాడు. ఆళ్వార్లు కూడా భగవంతుని అజ్ఞను అంగీకరించి, దానిని పూర్తి చేయదలచారు. ప్రకృతిమండలంలో ఏ విధమైన



**శ్రీ ఆదినాథపెరుమాళ్ - తిరుక్కురుగూర్(ఆళ్వార్ తిరునగరి)**

ఉపదేశాన్ని చేయవచ్చు అని గమనించి వారు చూచారు. లోకంలోనివారు ఇంచుమించుగా భగవంతుని పరత్వాన్ని గమనించలేనివారుగా, దేవతాంతరాల విషయంలో మోహం కలవారుగా కనిపించినందున వీరికి భగవంతుని పరత్వాన్ని ఇతర

దేవతల తక్కువదనాన్ని చక్కగా తెలియజేస్తే, వీరు మారతారు, సంసారం బాగుపడుతుంది అని భావించి, ఈ విధంగా ఈ దశకంలో ఉపదేశిస్తున్నారు. పూర్వం "**ఉయర్వఅ, వీడుమిన్**" మొదలైన దశకాలలో భగవంతుని పరత్వాన్ని ఆళ్వార్లు తెలిపినా ఈ దశకం అర్చావతారంలో పరత్వాన్ని ఉపదేశిస్తున్నందున ఇది వాటి కంటే వేరు. ఆళ్వార్ తిరునగరిలో వేంచేసి ఉండే భగవంతునకు 'ఆదినాథుడ'ని పేరు గనుక, సకల జగత్కారణ భూతుడు అనే ఈ నామాన్ని కలిగి ఉండే ఈ స్వామి ఈ విషయంలో పరత్వాన్ని పలకడం సమంజసంగా ఉంటుందని ఆళ్వార్లు భావించి ఈ దశకంలో ఆ విధంగా అర్చావతారంలో పరత్వాన్ని పలుకుతున్నారు.



**శఠారి - నమ్మాళ్వార్**

# 41)పంచమ శతకం-ప్రథమ దశకం

# # కైయార్ శక్కరత్తు

నాలుగవ శతకంలో **"నణ్ణాదార్"** అనే దశకంలో సంసారులు పడే బాధను భావించి, ఆ దుఃఖాలు వారికి తొలగిపోయేటట్లు భగవానుని గొప్పతనాన్ని వారికి తెలియజేస్తాం అని భావించి, దానిని ఆళ్వారులు **"ఒన్ఱుమ్ తేవుమ్"** అనే దశకంలో తెలియజేశారు. ఆ ఉపదేశం విన్నవారు ఈ లోకంలో నిండుగా ఉండడం గమనించిన ఆళ్వార్లు **"పొలిగ పోలిగ"** అని అంటూ వారికి మంగళాశాసనం చేసేవారుగా తమను భావించారు. " నేను కూడా వీరివలె సంసారంలో పడి ఉండకుండా, వీరికి ఉపదేశం చేసేవాడనుగా కాలిగానుకదా! వీరిని సంస్కరించే-వాడనుగా భగవంతుడు నాపై అనుగ్రహాన్ని చూపించాడే! భగవంతుడు చూపిన ఈ కృపకు కారణం ఏదైనా ఉన్నదా? అని గమనించి చూచారు. కాని ఆ కృప నిర్హేతుకం అనే విషయాన్ని తెలిసికొన్నారు. అందువల్ల వారు మనసులో ద్రవించి దానిని గూర్చి పలికి ఆనందిస్తున్నారు, ఈ దశకంలో. "లౌకిక విషయాలలో నేను మునిగి ఉన్నా, భగవద్విషయాన్ని నోటితో చెప్పేవాడనుగా నన్ను భావన చేశాను తప్ప, నేను నాలో నిజమైన ప్రేమ కొంచెం కూడా లేదే! అయినప్పటికీ కృత్రిమమైన ఆ మాటలనే ఆధారంగా చేసుకొని భగవంతుడు నన్ను అనుగ్రహించాడు కదా! ఏమి కరుణ! అని ఆశ్చర్య పడుతున్నారు.

# 42)పంచమ శతకం-ద్వితీయ దశకం

# # పొలిక పొలిక పొలిక

ఆళ్వారులు ఈ దశకంలో ఈ లీలావిభూతి లో ఉండే శ్రీ వైష్ణవ సమృద్ధికి మంగళాశాసనం చేస్తున్నారు. ఇప్పుడు ఈ మంగళాశాసనం చేయడానికి ఏమి కారణం? అని అంటే, పూర్వం నాలుగవ శతకంలోని **"నణ్ణాదార్"** అనే దశకంలో అళ్వార్లు సంసారంలోనివారి క్లేశాలను తలచి దానికి పరిహారంగా **"ఒన్డుమ్ తేవుమ్"** అనే దశకంలో భగవంతుని పరత్వ గుణాన్ని విస్తృతంగా వర్ణించి వారిని సంస్కరించారు. దానివల్ల సంసారం, పరమపదం అనే తేడా లేకుండా అయినది. అక్కడ ఉండే వారు కూడా ఇక్కడకు వచ్చే రీతిలో ఈ విభూతిలో శ్రీవైష్ణవ సమృద్ధి ఏర్పడింది. దీనిని చూచి మంగళాశాసనం చేస్తున్నారు, ఆళ్వారులు. ఆళ్వారుల శ్రీ వైష్ణవశ్రీని దర్శించడంకోసం నిత్య సూరులు నిత్యవిభూతినుండి ఇక్కడకు ఈ లోకంలోకి రాగా, వారికి మంగళాశాసనం చేస్తున్నారు, ఆళ్వార్లు–అని కొందరు పూర్వాచార్యులు ఈ దశకంలోని అర్థాన్ని వివరించారు. ఆళ్వారుల శ్రీవైష్ణవశ్రీ అంటే వారి ఉపదేశాన్ని విని మారిన శ్రీవైష్ణవుల సమృద్ధి అనే సంపదయే. శ్రీవైష్ణవులకు సాక్షాత్తుగా ఈ దశకంతో మంగళ శాసనం చేస్తున్నారు ఆళ్వార్లు అనేది ఇది ఒక నిర్వాహం. శ్రీవైష్ణవులను దర్శించడం కోసం లోకాంతరంనుండి వచ్చినవారికి మంగళాశాసనం చేస్తున్నారు అనేది ఇంకొక నిర్వాహం. 'ఆచార్య హృదయం' అనే గ్రంథంలోని **"అడిమై పుక్కారైయుమ్, ఆట్పుక్కారైయుమ్ కాణ లోకద్వీపాంతరంగళిల్ నిన్డుమ్ పోన్ద దేవర్ కుళాంగళై క్కండు కాప్పిట్టు"** (భగవానుని కైంకర్యంలో ఆసక్తి కలిగిన భాగవతులను దర్శించడం కోసం ఈ లోకానికి వచ్చిన

నిత్యసూరుల సమూహాన్ని చూచి మంగళాశాసనం చేసి) అనే సూక్తి ఇక్కడ అనుసంధేయం.

## 43)పంచమ శతకం-తృతీయ దశకం

## # మాశఱు శోది

ఈ దశకంలో ఆళ్వారులు మడల్ అనే ఒక ప్రక్రియను అనుష్ఠిస్తున్నారు. గడచిన నాలుగవ శతకంలోని "**ఏఱాళుమ్**" అనే దశకంలో ఆళ్వారులకు కలిగిన ప్రేమయే ఇంకా ఇంకా పెరిగి వృద్ధి చెందింది. భగవంతునితో సంశ్లేషించగోరి, ఆ మనోరథం నెరవేరనందున ఆళ్వార్లు మడల్ ఎత్తుతానని భయపెట్టి భగవంతునివల్ల తాము అనుకున్న ప్రయోజనాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్నారు. శ్రీరాముడు సముద్రుని శరణాగతి చేసి వారధి కట్టడానికి దారి ఇవ్వమని ప్రార్థించాడు. కానీ సముద్రుడు సమాధానం చెప్పనందున, దారి ఇవ్వనందున రాముడు చాలా కోపించి "**సాగరం శోషయిష్యామి, చాపమానయ సౌమిత్రే! పద్భ్యాం యాంతు ప్లవంగమాః**" (లక్ష్మణా! ఈ సముద్రాన్ని ఇంకింపచేస్తాను. నా విల్లును తీసుకుని రా. వానరసేన కాలినడకనే లంకకు చేరనీ. ఒక్క క్షణంలో ఈ సముద్రం పడే పాటు చూడు) అని సముద్రుని ఇంకింపచేయాలని ప్రయత్నించినట్లే ఈ ఆళ్వార్లుకూడా "నా మనోరథాన్ని తీర్చని భగవానుడు ఎందుకు?" అని భగవత్తత్వాన్ని లేకుండా చేయాలని ప్రయత్నిస్తున్నారు. మడల్ ఎత్తడం అనేది ద్రావిడ ఆలంకారిక ప్రక్రియలలో ఒకటి. దీని స్వరూపం క్లుప్తంగా ఈ విధంగా ఉంటుంది: నాయకుడు వేటకోసం బయటకు వెడతాడు. నాయకి, చెలికత్తె కలసి ఉద్యానవనంలో పూలు కోయాలని వెడతారు. ఏదో ఒక కారణం వల్ల నాయకికి చెలికత్తె దూరమవుతుంది. ఆ సమయంలో నాయకుడు

దైవంవశం చేత ఉద్యానవనంలో కలుస్తాడు అక్కడ అతనితో నాయకి సంబంధం ఏర్పడుతుంది ప్రేమ చిగురించి సంబంధం ఏర్పడుతుంది. ఆ తర్వాత వారిద్దరికి వియోగం కలుగుతుంది. ఆ వినియోగం కారణంగా సహించలేని బాధను పొందిన నాయకి నాయకునితో కలవడంకోసం చేసే సాహస ప్రవృత్తి మడల్ అనబడుతుంది. నాయకుని రూపాన్ని ఒక తాటి మట్టలో రాశి దానినే చూస్తూ, పూలు, చందనం మొదలైన భోగ్య వస్తువులను విడచి పెట్టి, తిండి నిద్ర లేకుండా, ఏ సంతోషం లేకుండా, ఇంకొక తాటి మట్టను చేతిలో పట్టుకొని దానితో ఒంటి మీద కొట్టుకుంటూ, జుట్టు విరబోసుకుని ఊరంతా తిరుగుతూ, "ఈ పాపిష్ఠివాడు నన్ను రక్షించకుండా వదిలిపెట్టాడు. అతడు దయ లేని వాడు.అతనికంటే కఠినుడు ఇంకొకడు లేడు" అని వీధులలో బిగ్గరగా పలుకుతూ, ఆ మాటలను విన్న వారు అంతా భయపడేటట్లుగా, జాలిపడేటట్లుగా సంచరించడమే 'మడల్' అనే ఈ విధానం. ఈ విధంగా బిగ్గరగా పలుకుతూ ఊరిలో సంచరించ డానికి ఏమి ప్రయోజనం? అని అంటే, ఈ సాహస ప్రయత్నం చూచి, ఈమె ఆర్తిని చూచి సహించలేని బాధను చూచి ప్రభువులు కరుణను పొందినవారై, ఈప్రేయసీప్రియులను ఇద్దరినీ కలుపుతారు అని, లేక, చెలికత్తె అయినా కలుపుతుంది అని, లేదా, ఈ లోక నిందను భరించలేక నాయకుడే స్వయంగా వచ్చి కలుస్తాడని ఆశ. ఇవి ఏమి సిద్ధించకపోతే నాయకి ప్రాణాలను విడిచి పెడుతుంది. ఇవే మడల్ ఎత్తడంలో ప్రయోజనాలు. ఆళ్వార్లు ఈ విధంగా భగవంతుని నిందిస్తూ చాలా సాహసంతో మడల్ ఎత్తారా? అని అంటే, మడల్ ను ఆచరించారా? అని అంటే, లేదు, "నేను మడల్ ఎత్తుతాను" అని అంటూ భగవంతుని భయ పెట్టడమే తప్ప ఈ ప్రక్రియను వారు నిజంగా అనుసరించలేదు. **"తోళ్లి! ఉలకు తోఅలర్ తూఱ్ఱి ఆమ్ కోణైకళ్ శెయ్ దు కుతిరియాయ్ మడలూర్ దుమే"** (చెలీ!

లోకంలో అంతటా తిరిగి, నాయకునిపై నేరారోపణ చేసి, నేను చేయదగిన పనులను అన్నిటినీ చేసి, ఎవరికీ అణగకుండా మడల్ ఎత్తుతాను) ఇత్యాది వచనాలను మనం గమనించవచ్చు.

# 44)పంచమ శతకం-చతుర్ధ దశకం

# # ఊరెల్లామ్ తుంజి

గడచిన దశకంలో మడల్ ఎత్తాలనే ప్రయత్నం బలంగా ఆళ్వార్లు చేశారు. మడల్ ఎత్తాలంటే నాయకుని రూపాన్ని ఒక మట్టపై రాయాలి కదా. ఆ విధంగా రాయడానికి వీలు లేనట్లు గాఢమైన చీకటి వచ్చి వ్యాపించింది. "**ఆழియాల్ అన్రు ఇరవియై మఱైప్ప**" (ఆనాడు చక్రంతో సూర్యుని కప్పిపుచ్చి) అని, "**ఆழிకొండు అన్రు ఇరవియై మఱైప్ప**" (చక్రంతో ఆనాడు సూర్యుని కప్పిపుచ్చి) అని చెప్పే రీతిలో పూర్వం భారత యుద్ధ సమయంలో సైంధవుని వధించడంకోసం శ్రీకృష్ణుడు సూర్యుని కప్పిపుచ్చి అస్తమించినట్లుగా చేసినట్లే, ఇప్పుడు కూడా భగవంతుడు సూర్యుని అస్తమించేటట్లు చేశాడు కాబోలు. నాయకి మడల్ ఎత్తితే దానివల్ల తనకు దోషమే కదా కలుగుతుంది–అని భావించి దానికి అడ్డుగా ఈ విధంగా సూర్యుని అస్తమించేటట్లు చేశాడు భగవంతుడు, లేక, దైవవశంచేతనే సూర్యుడు అస్తమించి ఉండవచ్చు. ఏమైతేనేమి, రాత్రి వచ్చి ప్రవేశించింది. అది కూడా సంధ్యాకాలం వలే కాకుండా, చరాచరాలు అన్ని భయపడే విధంగా చీకటి వ్యాపించింది. అర్ధరాత్రి వలె అయినది. నాయకిని నిందించేవారు, హితాన్ని పలికేవారు అనే తేడా లేకుండా అందరూ నిద్ర పోయారు. నాయకికి తోడు ఎవరూ లేకుండా పోయారు. ఆ సమయంలో సర్వ రక్షకుడైన భగవంతుని కల్యాణ గుణాలను ఆళ్వార్లు అనుసంధించారు. ఈ అనుసంధానం సంశ్లేష దశలో

కాకుండా విశ్లేషణ దశలో అయినందున, ఆర్తిని ఎక్కువగా పొందడానికి అది కారణమైనది. అశోకవనంలో ప్రాణాలను తీసుకోవాలని ప్రయత్నం చేసిన సీతాదేవివలె ఆళ్వార్లు కూడా ప్రాణాలను విడువవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆ దశ అంతా ఈ దశకంలో వ్యక్తమవుతున్నది. గడచిన దశకంవలె ఈ దశకం కూడా నాయకి వచన రూపంగానే సాగుతున్నది.

## 45)పంచమ శతకం-పంచమ దశకం

## # ఎంగనేయో

గడచిన దశకంలో ఆళ్వార్లు చీకటికి, చలికి బాధపడిన విషయం తెలుపబడింది. ఈ లోకం అజ్ఞానప్రచురమైన లోకమైనందున అంతటా తమోగుణమే ఎక్కువగా వ్యాపించ బాధిస్తుంది–అనే విషయం ఇందులో స్వాపదేశార్థంగా చెప్పబడినట్లు గ్రహించవచ్చు. యామునాచార్యులవారు స్తోత్రరత్నంలో **"అవివేకఘనాంతదిఙ్ముఖే బహుధా సంతతదుఃఖవర్షిణి భగవన్! భవదుర్దినే"** (భగవన్! అజ్ఞానం అనే మేఘాలు కమ్ముకున్న ఉన్నందున దిక్కులు తెలియకుండా ఉన్నది, సదా అనేక విధాలుగా దుఃఖాన్ని వర్షించేది అయిన సంసారం అనే దుర్దినంలో) అని పలకడం గడచిన దశకంలోనే అర్థానికి ప్రతీకగా చెప్పవచ్చు. ఇప్పుడు రాత్రి గడిచి పగలు వచ్చింది. తమోగుణం నశించి సత్త్వగుణం తల ఎత్తడం ఆరంభించింది. అందువల్ల తమ మనస్సును తమాయించుకుని ప్రాణాన్ని ధరించడం కోసం ఆళ్వార్లు 'తిరుక్కుఱుంగుడి' అనే క్షేత్రంలోని భగవంతుని రూప సౌందర్యం, దివ్య ఆయుధాల, ఆభరణాల పొంది వల్ల ఏర్పడిన అందాన్ని ఈ దశకంలో ఆభ

కీర్తిస్తున్నారు. 'ఉరువెళిప్పాడు' అనే ప్రక్రియ ఉన్నది. అంటే, మానసిక సాక్షాత్కారం అని అర్థం. ఇది



**శ్రీవైష్ణవ నంబి - 'తిరుక్కుఋంగుడి'**

కంటికి ప్రత్యక్షంగా కనిపించకపోయినా మనసుకు ఒక వస్తువు యొక్క రూపం సాక్షాత్కరించడమే. ఇది ఈ దశకంలో పడుతున్నది. ఈ దశకంలో నాయకీ భావనతో ఆళ్వారులు పలుకుతున్నారు. నాయకితల్లి నాయకికి లోకంలోని నియమాన్ని గురించి పలికి, ఆమె నాయకుని దగ్గరకు వెళ్లాలనే ప్రయత్నంనుండి విరమింప చేయాలని ప్రయత్నించగా, "నాతో ఈ మాటలు చెప్పి ఏమి

ప్రయోజనం? నేను తిరుక్కురుంగుడి క్షేత్రంలోని స్వామి అందంలో మనసును కోల్పోయాను. నాకు మీరు ఈ అణకువనుగూర్చి చెప్పడం వల్ల ఏ ప్రయోజనం లేదు" అని నాయకి పలుకుతున్నది.

## 46)పంచమ శతకం-షష్ఠ దశకం

## # కడల ఞాలమ్

నాయకి నాయకునకు దూరమై బాధపడే సమయంలో నాయకుని అనుకరించి ప్రాణాలను నిలుపుకోవడం అనేది ఒక పద్ధతి ఉన్నది. అది ఏమంటే-భగవంతుని అనుసరించి పలికి తద్వారా కాలాన్ని గడపడం ప్రాణాలను ధరించడమే. రేపల్లెలో రాసక్రీడ జరిగిన తరువాత శ్రీకృష్ణుడు గోపికలను విడచిపెట్టి అంతర్ధానమయ్యాడు. ఆ స్వామి కనిపించనందున విశ్లేషానికి చాలా బాధ పడిన గోపికలు అందరూ శ్రీకృష్ణుని లీలలనుఅనుసరించి తమ ప్రాణాలను నిలుపుకున్నారు అనే విషయాన్ని శ్రీ విష్ణు పురాణం తెలుపుతున్నది.

కృష్ణే నిబద్ధహృదయాః ఇద మూచుః పరస్పరమ్
కృష్ణోహ మేష లలితం వ్రజామ్యాలోక్యతాం గతిః,
అన్యా బ్రవీతి కృష్ణస్య మమ గతిః నిశమ్యతామ్,
దుష్ట కాళియ తిష్ఠాత్ర కృష్ణోహ మితి చాపరా,
బాహు మాస్ఫోట్య కృష్ణస్య లీలాసర్వస్వ మాదదే,
అన్యా బ్రవీతి హే గోపాః నిశ్శంకైః స్థీయతా మిహ,
అలం వృష్టిభయేనాత్ర ధృతో గోవర్ధనో మయా,
ధేనుకోయం మయా క్షిప్తో విచరంతు యథేచ్ఛయా

ఇటువంటి శ్లోకాలు ఆ పురాణాలలో చాలా కనిపిస్తాయి. ఈ శ్లోకాల భావం ఏమంటే – శ్రీకృష్ణుడు గోపికలను విడిచి వెళ్ళినప్పుడు ఆ గోపికలు బృందావనంలో గుంపులు గుంపులుగా కలసి ఒకరితో ఒకరు శ్రీకృష్ణుని లీలలను అనుసరిస్తూ వాటిని గురించి పలుకుతూ కాలం గడిపారు. "నేను కృష్ణుడను. ఇదిగో అందంగా నడుస్తున్నాను చూడండి" అని ఒక గోపిక అన్నది. "నేను కృష్ణుడను. వినసొంపుగా మురళి ఊదుతున్నాను వినండి" అని ఇంకొక గోపిక అన్నది. "నేను కృష్ణుడను. ఓ దుష్ట కాళీయా! నిలు" అని మరి ఒకతె అన్నది. భుజాలను చరుచుకుంటూ కృష్ణుడు చేసే లీలలను అన్నిటినీ ఇంకొకతె చేసింది. "గోపాలులారా! మీరు వర్షానికి భయపడకండి, ఇదిగో నేను గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తుతున్నాను చూడండి" అని వేరొకతె అన్నది. “నేను ధేనుకాసురుని వధిస్తున్నాను. ఇక గోవులకు ఏ భయం లేదు. ఇష్టం వచ్చినట్లు అవి సంచరించ వచ్చు" అని ఇంకొక గోపిక అన్నది.

ఈ విధంగా కృష్ణుని లీలలను అనుకరించి ప్రాణాలను నిలుపుకున్న విధానాన్ని గోదాదేవిలో కూడా మనం గమనించవచ్చు. ఆమె తిరుప్పావై వ్రతాన్ని ఆచరించడం కోసం గోపికా భావనతో ఆ గోపికలు చేసిన వ్రతాన్ని అనుసరిస్తూ తిరుప్పావై ప్రబంధాన్ని పాడింది కదా. ఇటువంటి అనుకరణలు వేదంలో కూడా కనిపిస్తాయి ఆళ్వారులు ఆ అనుకరణ ప్రకారాన్నే ఈ దశకంలో పలుకుతున్నారు. అది కూడా తల్లి వచనాలతో వ్యక్తం చేస్తున్నారు. తన కుమార్తె చేసే భగవదనుకరణను తల్లి మొఱ పెడుతున్నది. పరాంకుశనాయకి జ్ఞానముద్రను కలిగిన గీతాచా-ర్యునివలె ఉండి, "**కడల్ ఞాలమ్ శెయ్దేనుమ్ యానే**" (భూమిని సృష్టించినదానను నేనే) అని, "**కడల్ ఞాలమావేనుమ్ యానే**" (భూమిని నేనే) అని ఈ విధంగా పలుకుతూ ఉండడం చూసిన తల్లి "ఏమి ఆశ్చర్యం! ఏమి రీతి ఇది" అని విచారించింది. భగవంతుని విశ్లేషించినందున ఏర్పడిన ఆర్తివల్ల ఆ స్వామిని ఈమె

అనుకరిస్తున్నది అనే విషయాన్ని తల్లి తెలియలేక, మనస్సులో కలత చెందింది. అప్పుడు కొందరు బంధువులు అక్కడికి వచ్చి "ఇదేమి" అని వారు ఆమెను అడిగారు. అపుడు "సర్వేశ్వరుడు ఈమెను ఆవేశించాడు కాబోలు" అని తల్లి సమాధానం చెప్పిన విధంగా ఈ దశకం సాగుతున్నది.

## 47)పంచమ శతకం-సప్తమ దశకం # నోற்றநோన్బు

గడచిన దశకంలో తాము భగవంతునిగానే తమను భావించి పలకడం ఒక విధంగా తమ మనసులో ఊరట చెందడంకోసం కదా! ఆ విధంగా పలికిన భగవంతుడు వచ్చి ఆళ్వార్లకు దర్శనాన్ని అనుగ్రహించ లేదు. అందువల్ల వారికి పూర్వం కంటే ఎక్కువ ఆర్తి కలిగింది. వెంటనే వచ్చి తన దర్శనాన్ని అనుగ్రహించడం స్వభావంగా కలిగిన భగవంతుడు నా విషయంలో ఈ విధంగా ఉపేక్షించడం ఎందువల్ల? అని ఆళ్వారులు ఆలోచించారు. కర్మయోగం, జ్ఞానయోగం మొదలైనవానిలో నాకు అన్వయం ఉండాలి అని భావించాడా? లేక, 'ఆయా ఉపాయాంతరాలలో నేను సంబంధం కలిగి ఉన్నాను' అని భావించి నన్ను వదిలి పెట్టాలి అని అనుకుంటున్నాడా? అతని మనసు ఏమో తెలియలేదే" అని బాధ పడిన ఆళ్వార్లు తమ వాస్తవమైన స్థితిని భగవంతుని సన్నిధిలో విన్నపించాలని భావించారు. ఆ విన్నపం 'వానమామలై' అనే క్షేత్రంలోని స్వామి చరణాలలో చేసి తమ అనన్యోపాయత్వం మొదలైనవానిని విజ్ఞాపన చేసి, వేరు తెగిన చెట్టువలె ఆ స్వామి పాదాలలో శరణు పొందుతున్నారు, ఈ దశకంలో 'శిరీవరమంగై', 'శిరీవరమంగళమ్' అని వానమామలై క్షేత్రానికి పేర్లు ఉన్నాయి. ఇది పాండ్య దేశంలోని

18 క్షేత్రాలలో ఒకటి. ఈ దశకంలో ఆరవ పాశురంలో "**వానమామలైయే తొళ్గ వందరుళే**" (వానమామల స్వామీ! నేను నమస్కరించగలిగేటట్లు ఇక్కడకు రా) అనే సూక్తిని గమనించి-నప్పుడు 'వానమామలై' అనే ఈ పేరు అక్కడ వేంచేసి ఉండే మూర్తికి పేరని, ఆ నామంతోనే ఆ క్షేత్రం పిలువబడుతున్నదని తోస్తుంది.



**శ్రీ దైవనాయకన్, శిరీవరమజ్జై - తోతాద్రి(వానమామలై)**

# 48)పంచమ శతకం-అష్టమ దశకం

# # ఆరావముదే

గడచిన దశకంలో ‘వానమామలై’ అనే క్షేత్రంలోని స్వామి చరణాలలో వేరు తెగిన చెట్టువలె చాలా ఆర్తితో ఆళ్వారులు శరణు పొందారు. అయినా భగవంతుడు తన దర్శనాన్ని వారికి కలిగించలేదు. అతడు "ఇతనికి ఈ సమయంలో ఇక్కడ దర్శనాన్ని ఇవ్వాలి" అనే అభిప్రాయం భగవానునకు



**శ్రీ కోమలవల్లీ తాయార్ సమేత ఆరావముద పెరుమాళ్ - తిరుక్కుడంద్రై (కుంభకోణం)**

ఉంటుంది కదా. అందువల్ల ఆళ్వారులకు 'కుంభకోణం' (తిరుక్కుడంద్రై) అనే క్షేత్రంలో తన దర్శనాన్ని ఇవ్వాలి అని భావించాడు. ఆళ్వార్లు కూడా ఆ విధంగానే భావించారు. "నాకు కుంభకోణంలో దర్శనాన్ని ఇవ్వాలని భగవంతుడు భావించి ఉండవచ్చు" అని వారు తలచారు "ఆ విధంగా భావించి , "నేను అక్కడకు వెళితే నా కోరిక తీరుతుంది. మా కొరతలు అన్ని తీరిపోతాయి" అని గట్టిగా ఆశించి, అళ్వార్లు ఆ క్షేత్రానికి వెళ్లారు. చిత్రకూట పర్వత ప్రాంతాలలో ప్రవేశించిన భరతుడు తాను ఆశించిన రీతిలో ఏ ప్రయోజనాన్ని పొందనట్లు, ఆళ్వార్లు కూడా కుంభకోణం క్షేత్రంలో కూడా ఏమి ప్రయోజనాన్ని పొందలేకపోయారు. స్వామి తన నేత్రాలను తెరచి చల్లగా చూడడం కానీ, నోరు తెరచి ఒక మంచిమాట మాట్లాడడం కాని, ఆలింగనం చేసుకోవడం కానీ, ఇంకా ఇటువంటివి వేనినీ భగవంతుడు చేయకపోవడం గమనించారు. అక్రూరుడు కృష్ణుని దగ్గరకు రాగానే **"మామ్ అక్రూరేతి వక్ష్యతి" (**నన్ను అక్రూరా! అని పిలుస్తాడు) అని అతడు ఆశించిన కోరిక ఫలించిందని విన్నాము. ఆ విధంగా తాము కోరినదానిని ఏమి పొందలేక, చాలా బాధపడిన ఆళ్వారులు చంటి బిడ్డ తల్లి దగ్గరకు వచ్చి ఆమె దర్శనాన్ని పొందలేక, చాలా ఆర్తిని చెందినట్లు, భగవంతుని సన్నిధిలో తల్లడిల్లుతూ, గట్టిగా రోదిస్తూ, "ఇంకా ఎంతమంది వాకిళ్ళలో రక్షణ కోసం తిరిగి ప్రార్థించను స్వామీ! నన్ను కాపాడవా" అని చాలా ఆర్తితో ప్రార్థిస్తున్నారు, ఈ దశకంలో.

# 49)పంచమ శతకం-నవమ దశకం

# # మానేయ్ నోక్కు నల్లీర్

గత దశకంలో ఆళ్వారులు కుంభకోణం క్షేత్రంలో చాలా ఆర్తిని పొందారు. అక్కడ నుండి 'తిరువల్లవాழ்' అనే కేరళ



శ్రీ కోలప్పిరాన్ - తిరువల్లవాழ்

దేశంలోని క్షేత్రానికి చేరాలని ప్రయత్నించారు. కాని, అక్కడకు పోవడం సాధ్యం కాక ఆ ఊరికి దగ్గరలో ఉన్న ఒక ఊరిలో ఉండే ఉద్యానవనాలు. అక్కడ పరిమళాన్ని గ్రహించి వీచే మలయమారుతం, తుమ్మెదల మధురమైన కంఠధ్వని, వైదికులు చేసే వైదికక్రియాకలపాల కోలాహలాలు, ఇంకా అక్కడ ఉండే సంరంభాలు అన్ని తమను మిక్కిలి బాధించగా, ఆ బాధతో తన ఆర్తిని నాయిక చెలికత్తెకు తెలియజేసే పాశురాలుగా ఈ దశకం అవతరించింది.

# 50)పంచమ శతకం-దశమ దశకం

# # పిఱందవాఱుమ్

గడచిన దశకంలో 'తిరువల్లవాళ్ల' అనే క్షేత్రాన్ని చేరి, తమ కోరికను అక్కడ ఉండే స్వామి సన్నిధిలో విజ్ఞాపన చేసి, కైంకర్యం చేసుకోవాలి అని ఆళ్వారులు ఆశపడ్డారు. కానీ ఆ విధంగా ఆ క్షేత్రంవరకు పోలేక వారు మార్గమధ్యంలోనే నిలచి ఆక్రందించారు. **"గోవిందన్ గుణమ్ పాడి ఆవి కాత్రిరుప్పేనే"** (గోవిందుని గుణాలను పాడి నా ప్రాణాలను నిలుపుకుంటాను) అనే విధంగా భగవంతుని గుణానుభవాన్ని పొంది ప్రాణాలను నిలుపుకోవడం అనే ఒక రీతి ఉన్నది కదా. ఆ విధంగా అయినా ప్రాణాలను నిలుపుకుందాం అని చూస్తే అది కూడా ఆళ్వార్లకు సాధ్యం కానిది అయింది. అందువల్ల వారికి చాలా మనోవ్యథ కలిగింది. "భగవంతునకు దూరమై బాధపడినా, ప్రాణాలను నిలుపుకొని నీ గుణానుభవాన్ని పొందేటట్లు నన్ను అనుగ్రహించాలి" అని ఆ స్వామి శ్రీ చరణాలలో వాలి ప్రార్థిస్తున్నారు ఈ దశకంలో. తమ కోరికను అర్చావతారాలలో పొందాలని ఆశ పడినవారు ఆ ఆశ సఫలం కానందున , దానిని విభవ రూపాలలో పొందాలని ఆర్థించడం తగునా? విభవావతారాలను దూరమైనవారిని కూడా అనుగ్రహించడం కోసమే కదా అర్చావతరాలున్నాయి. ఇక్కడ అర్చారూపంలో ఆశను పొందలేక విభవావతారం వరకు వెళ్లడం అనేది ఇది ఏమి? అని అంటే, వినండి. అర్చా రూపంలో చల్లగా చూడడం, కుశలం ప్రశ్నించడం, ఆలింగనం చేసుకోవడంవంటివి సాధ్యం కాదు అని భగవానుడు సంకల్పించినందున, సత్యసంకల్పుడైనవాని ఆ సంకల్పం విఫలం అయేటట్లు నిర్బంధం చేయకూడదు – అని అర్చారూపాలను ఆళ్వార్లు వదిలిపెట్టారు. విభవ రూపాలలో ఆ

విధంగా ఏ విధమైన నిర్బంధం లేనందున, **"సంస్పృశ్యాకృష్య ప్రీత్యా సుగాఢం పరిషస్వజే"** (చేతితో తాకి ప్రీతిగా దగ్గరకు తీసుకుని, గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు) అనే విధంగా అక్రూరుడు మొదలైనవారికి సర్వస్వ దానాన్ని చేసిన రీతిని అనుసంధించినందున, ఆ అవతారాలు కాలానికి దూరం అయ్యాయి అనే భావం ఆళ్వార్లకు కలుగలేదు. అందువల్ల వాటిని పొందాలని, ఆ రూపాలలో తమ మనోరథాన్ని తీర్చుకోవాలని వాటివరకు వెడుతున్నారు.



**నమ్మాళ్వార్**

## 51)షష్ఠ శతకం-ప్రథమ దశకం

## # వైకల్ పూంకళ్ళివాయ్

అయిదవ శతకంలోని "**నోఱ్ఱ నోన్బు**" అనే దశకంతో ఆరంభించి వరుసగా నాలుగు దశకాలలో అళ్వార్లు మాటిమాటికి భగవంతుని క్షణాలలో శరణాగతి చేశారు. ఫలం తప్పక ఇచ్చి తీరవలసిన ఆ శరణాగతి కూడా ఆళ్వారుల విషయంలో ఫలించలేదు. దానికి కారణం ఏమి? అంటే, మన భాగ్యమే అని చెప్పాలి, ఆళ్వారుల ముఖం నుండి ఇంకా కొన్ని పాశురాలు వ్యక్తం అయ్యేటట్లు చేసి లోకాన్ని తరింప చేయాలి అని భగవంతుడు



శ్రీ పంబనియప్పన్ - తిరువణ్ వణ్డూర్

భావించాడు. మన కోసంగానే ఆళ్వారుల శరణాగతిని కూడా స్వామి నిష్ఫలం చేశాడు. పూర్వం "**పిఱన్ద వాఱు**" అనే దశకంలో "**ఉన్నై ఎన్ఱు తలైప్పెయ్ వనే**" అని, "**ఉన్నై ఎన్ఱుకొల్ శేర్ వదువే**" అని, "**ఉన్నై ఎన్ఱుకొల్ కూడువదే**" (స్వామీ! నిన్ను ఎప్పుడు చేరగలను? అని, నీ దగ్గరకు ఎప్పుడు రాగలను? అని, నిన్ను ఎప్పుడు కూడగలను? అని) ఈ విధంగా పలు మార్లు ఆక్రందించి, భగవంతుని దగ్గరకు త్వరగా చేరాలి అని ఆళ్వార్లు తొందరపడ్డారు. ఆశపడ్డారు. ఆ భగవంతుడు 'తిరువణ్ వండూర్' అనే కేరళ దేశంలోని క్షేత్రంలో వేంచేసి ఉండడం చూచి, అక్కడికి తాము వెళ్ళలేక, తమ అవస్థను ఆ స్వామికి నివేదించే రీతిలో దూత ప్రేషణతో ఈ దశకం అళ్వార్లు అనుగ్రహిస్తున్నారు. ఏ విధంగా? అంటే, ఆళ్వారులు తమ సహజ దశను కోల్పోయి, నాయకీ భావాన్ని పొంది కొన్ని పక్షులను భగవంతుని దగ్గరకు దూతగా పంపుతున్నారు. భగవంతుని విషయంలో సంబంధం కలుగజేసేవారిని పక్షులుగా భావించడం అనేది ఇక్కడ స్వాప దేశం అని తెలియాలి. పక్షి రెండు రెక్కలను ఏ విధంగా కలిగి ఉంటుందో, ఆ రెక్కలతో ఆకాశంలో ఉన్నతంగా ఎగుర గలుగుతున్నదో, ఆ విధంగానే జ్ఞానం, ఆచరణ అనే రెండు రెక్కలతో ఉన్నతమైన గతిని పొందే మహానుభావులే ఇక్కడ పక్షులుగా చెప్పబడుతున్నారు.

## 52)షష్ఠ శతకం-ద్వితీయ దశకం

## # మిన్నిడై మడవార్కళ్

ఆళ్వారుల రీతులు పలు విధాలుగా ఉంటాయి. ఈ దశకంలోని రీతి అయితే చాలా విలక్షణమైనది. "**ఎన్ఱు మొరునాళ్ ఒళియామై యానిరందాల్ ఒన్ఱుమిరంగార్**

**ఉరుక్కాట్టార్**" (నేను ఏ దినం విడువకుండ ప్రార్థించినా కొంచెం కూడా దయ చూపించడం లేదు, తన దర్శనాన్ని భగవంతుడు ఇవ్వడం లేదు) అని, "**ఒరు నాళ్ కాణవారాయే**" (ఏదో ఒక నాడు నీ దర్శనాన్ని అనుగ్రహించు) అని ఈ విధంగా పలుసార్లు ఆళ్వారులు ప్రార్థించారు కానీ, ఇపుడు వారికి కలిగిన స్థితి చాలా విలక్షణంగా ఉన్నది. భగవంతుడు వచ్చి ఎదురుగా నిలువగా, "నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావు? నీవు మనసుల కోరుకునే వారి దగ్గరకు నువ్వు వెళ్ళవచ్చు. ఇక్కడ నీకు ఏమి పని ఉన్నది? త్వరగా ఇక్కడనుంచి వెళ్ళిపో" అని పలికి తలుపులు మూసి వేసే రీతిలో ఈ దశకం ఉన్నది. సంస్కృత భాషలో దీనికి 'ప్రణయ కలహం' అని పేరు. ద్రావిడ భాషలో 'ఊడల్' అని పేరు. దంపతులు కలిసినప్పుడు ఇటువంటి ప్రణయ కలహం తప్పక ఏర్పడుతుంది. భగవంతునితో మనకు కల సంబంధాలు 9 అని చెప్పబడుతున్నది. "**పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చ ఆద్య మనూదితః**" (అష్టాక్షరీ మహా మంత్రంలో భగవంతుడు మనకు తండ్రి, రక్షకుడు, శేషి, భర్త, స్వామి, ఆధారం, ఆత్మ, భోక్త అని చెప్పబడ్డాడు) అనే శ్లోకంలో ఆ తొమ్మిది సంబంధాలు తెలుప-బడ్డాయి. ఆ సంబంధాలలో 'భర్తృ-భార్యా' సంబంధం ఒకటి. అందువల్ల భగవంతుని భర్తగా తనను పత్నిగా అళ్వార్లు భావించడం అనేది స్వరూపానికి తగినది కనుక ,ఈ ప్రణయ కలహం తప్పనిసరి అయినది అని తెలుస్తున్నది. గడచిన దశకంలో ఆళ్వారులు భగవంతుని విరహాన్ని సహించలేక పక్షులను దూతగా పంపారు. ఆ దుఃఖాన్ని తెలిసిన భగవంతుడు గజేంద్రునకు సహాయపడడానికి మహా వేగంగా తొందరగా వచ్చినట్లుగా, వీరి దగ్గరకు కూడా వేగంగా వచ్చి, తన దర్శనాన్ని ఇవ్వాలని చూచాడు. అప్పుడు ఆళ్వార్లకు ప్రణయ రోషం కలిగిన నందున, "స్వామీ! ఇక్కడ నీకు ఏమీ పని లేదు. నీకు పని

ఉన్నచోటికి వెళ్ళిపో" అని తలుపులు మూసి పలికే రీతిలో ఈ దశకం ఉన్నది. కృష్ణావతారంలో శ్రీకృష్ణునితో కలసి వర్తించిన గోపికలు ఈ విధంగా ప్రణయ రోషంతో పలకడం కనిపిస్తుంది. వారి భావ బంధమే ఇప్పుడు ఆళ్వార్లకు కలిగి, వారిని ఆళ్వార్లు అనుకరించేటట్లు ఏర్పడింది. కులశేఖరుల ప్రబంధంలో "**ఏర్ మలర్ పూంకుళ్ళల్**" అనే దశకం, 'పెరియ తిరుమొళ్ళి' ప్రబంధంలోని "**కాదల్ కడిప్పు**" అనే దశకం ఇటువంటివే.

## 53)షష్ఠ శతకం-తృతీయ దశకం
## # నల్ కురవుమ్ శెల్వముమ్

ఆరవ శతకం మొదటి దశకంలో ఆళ్వార్లు పక్షుల ద్వారా దౌత్యాన్ని పంపినా, భగవంతుడు ఆలస్యం చేశాడు. ఆ విధంగా ఆలస్యం చేసిన భగవంతుని విషయంలో పరాంకుశ నాయకికి కలిగిన ప్రణయ రోషం ఎంత దూరం వెళ్లిందంటే, "మా గోష్ఠిలోకి నీవు రావద్దు" అని తలుపులు మూసి వేసే పర్యంతంగా సంభవించింది. సహజంగా ప్రణయ రోషానికి తరువాత నాయకీ నాయకుల సంగమం కలుగుతుంది. కనుక ఆ విధంగా సంశ్లేషం కలిగిన రీతి ఈ దశకంలో తెలుప బడుతున్నది. ఈ సంగతి "**నిన్రిలంగు ముడియనాయ్**" అనే పాశురంలో వ్యక్తమవుతున్నది. “ఏ విధంగా అయినా ఈ నాయకునితో కలువ రాదు”–అని చాలా కోపంతో ఉండే మనలను తనతో కలిసేటట్లుగా చేయగలిగిన ఈ స్వామి సామర్థ్యం ఎంత గొప్పది! అని ఆశ్చర్యపడిన ఆళ్వార్లకు భగవంతుడు తన అఘటితఘటనా సామర్థ్యాన్ని దర్శింపజేసి, అటువంటి వైభవాన్ని కల తాను 'తిరు విణ్ణకగర్' అనే క్షేత్రంలో నిత్య సాన్నిధ్యాన్ని కలిగి ఉండే రీతిని దర్శింప చేయగా, ఆళ్వార్లు ఆ విషయాన్ని ఈ దశకంలో పలుకుతూ ఆనందిస్తున్నారు.



**శ్రీ ఒప్పిలియప్పన్ - తిరువిణ్ణగర్**

## 54)షష్ఠ శతకం-చతుర్థ దశకం

## # కురవై ఆచ్చియరోడు

పూర్వం ఐదవ శతకంలోని **"పిఱన్ద వాఱుమ్"** దశకంలో భగవంతుని లీలా విశేషాలను అనుసంధించిన అళ్వార్ మనసులో ద్రవించి, "ఆహా వీటిని పూర్తిగా అనుభవించడం సాధ్యం కాలేదే!" అని ఆర్తితో, కొరతతో పలికారు. ఆ కొరత ఈ దశకంలో తీరుతున్నది. భగవంతుని పలు విధాలైన లీలా విశేషాలను

నోరారా పలికి, వాటిని చక్కగా అనుభవించి, దానివల్ల తమకు కలిగిన ఆనందాతిశయాన్ని పెద్ద గొంతుకతో ఇందులో వ్యక్తం చేస్తున్నారు, ఆళ్వార్లు. ఈ దశకంలోని ప్రతి పాశురంలోనూ ముందు రెండు పాదాలు భగవంతుని లీలావిశేషాలను తెలుపుతున్నాయి. తరవాత రెండు పాదాలు ఆ లీలలను అనుభవించడం వల్ల తమకు కలిగిన ఆనందాతిశయాన్ని తెలుపుతున్నాయి. "**నీశనేన్ నిఱై ఒన్ఱుమిలేన్**" (నేను నీచుడను, ఏ గుణం లేనివాడను) అని నైచ్యానుసంధానంలోని పర్యంత సీమలో నిలచిన ఆళ్వార్లు ఇందులో "**ఎనక్కినియార్ నికర్ నల్ వానత్తే**" (పరమపదంలో కూడా నాకు సాటి ఎవరు?), "**మాఞాలత్తో ఇమ్మణ్.మిశైయే**" (ఈ భూమిలో కూడా నాకు ఎవరు సాటి) అని ఈ విధంగా చాలా గర్వంతో అనడం సత్వగుణాన్ని అధికంగా కలిగిన వీరికి కొరతే గదా! అని భావించనక్కరలేదు. భగవంతుని గుణానుభవం వల్ల కలిగిన ఆనందం మితిమీరినప్పుడు, దాని ప్రవాహరూపంగా ఈ విధంగా పల్కడం అనేది తన ప్రయత్నం తో జరిగేది కాదు. అనుభవంలో కలిగిన పారవశ్యంచేత ఈ విధంగా పలకడం జరుగుతుంది. "**నావలిట్టు ఉழிతరుకిన్టోమ్ నమన్ తమర్ తలైకళ్ మీదే, మూవులకుండుమిழ்న్ద ముదల్వా! నిన్ నామమ్ కఱ్ఱ ఆవలిప్పుడైమై కండాయ్ అరంగమానకరుళానే!**" (యముని కింకరుల, తలపై నేను గర్వంగా కాలు పెడుతున్నాను. ముల్లో-కాలను కడుపులో పెట్టుకొని సృష్టించిన కారణభూతుడైనవాడా! నీ నామాన్ని చెప్పినందువల్ల కలిగిన గర్వం ఎంత గొప్పదో! రంగనాథ చూశావా?) అనే పాశురాలు సాత్వికాహంకార- రీతిలో అవతరించాయని తెలియాలి. లోకంలో మధువును సేవించినవాడు తమను తెలియలేక పారవశ్యంతో పలకడం చూస్తున్నాము. "**ఎనక్కు తేనే పాలే కన్నలే అముదే**" (నాకు తేనె వంటివాడు, పాల వంటి వాడు, కలకండ వంటివాడు, అమృతం

వంటివాడు) అనే విధంగా పరమ విలక్షణమైన మధువును పానం చేసినవారి విషయంలో ఇక చెప్పాలా?

## 55)షష్ఠ శతకం-పంచమ దశకం

## # తువళిల్ మామణిమాడమ్

ఆళ్వార్లకు భగవంతుని స్వభావాలను వర్ణించడంలో ఎంత కుతూహలం ఉన్నదో, అంత కుతూహలం తమ స్వభావాలను వర్ణించడంలో కూడా ఉన్నది. భగవంతునకు మంగళాశాసనం చేయాలని ఆరంభించిన 'పెరియాళ్వార్లు' **"ఆడియోమోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్రి ఆయిరం పల్లాండు"** (భక్తులమైన మాతోపాటు నీకు కలిగే కలయికకు వేయి సంవత్సరాలపాటు మంగళం) అని తమకు తామే మంగళాశాసనం చేసికొన్నారు. భగవంతుని మహిమను అనుభవించగలిగిన భక్తులు లేకపోతే భగవంతుడు ఉండి ఏమి ప్రయోజనం? వెన్నెల, చల్లగాలి మొదలైనవి చాలా భోగ్యమైనవి అయినా అవి అనుభవించే వారికి ఉపయోగ పడకపోతే 'అడవి కాచిన వెన్నెల' అనే విధంగా అవి దోషాన్ని కలిగినవే కాగలవు కదా. ఆ విధంగానే భగవంతుని మహిమలు కూడా అతనిని చక్కగా అనుభవించగలిగినవారు ఉంటేనే అవి సార్థకం అవుతాయి. భాగవతుల గొప్పతనాన్ని పలకడం భగవంతుని గొప్పతనాన్ని పలికినట్లే అవుతుంది. అందువల్లనే **"తిరుమాలవన్ కవి"** అని భగవత్కీర్తన రూపంగా ఉండే ఈ దివ్య ప్రబంధంలో **"పయిలుమ్ శుడరొళి"**, **"నెడుమాఱ్కడిమై"** మొదలైన దశకాలు భాగవత ప్రభావాన్ని కీర్తన చేసేవిగా అవతరించాయి. భాగవతులలో ఆళ్వార్లు గొప్పవారు కదా. ఆత్మ ప్రశంస, అంటే తనను తాను పొగడుకోవడం దోషమే

అయినా, భగవంతుని విషయంలో తమకుఉండే అభినివేశంవల్ల తమను



**శ్రీ దేవపిరాన్ (అరవిందలోచనన్) - తిరుతొలైవిల్లిమంగలం**

తామే పొగడుకోవడం తగినదే అవుతుంది. ఏ విధంగాను దోషం కాదు. అయితే భగవంతుని విషయంలో నేను ఈ విధంగా అభినివేశాన్ని పొందాను–అని స్పష్టంగా పలకడంలో ఆళ్వార్లకు కొంచెం సంకోచం ఉన్నది కాబోలు. భగవంతుడు కూడా తన గొప్పతనాన్ని ఒక గొప్ప ప్రబంధంగా వ్యక్తం చెయ్యాలి అని ఆశపడి, "ఆ విధంగా నేనే నా గొప్పతనాన్ని పొగడుకుంటే అది అంత రసవంతంగా ఉండదు" అని తలచి, ఆ స్వామి నమ్మాళ్వారులలో ఆవేశించి, వారి మాటల ద్వారా తన గొప్పతనాన్ని పలికి, **"కురుకూర్ శఠగోపన్ శొన్న"** (నమ్మాళ్వారు పలికిన) అని

ఆళ్వార్లపై ఆరోపించాడు–అని పెద్దల సూక్తి. ఈ విషయాన్ని స్వయంగా ఆళ్వార్లే ఏడవ శతకంలోని **"ఎన్నైక్కు మెన్నై"** అనే దశకంలో స్పష్టంగా పలకడం గమనించవచ్చు. ఆ విధంగానే ఇప్పుడు ఆళ్వారులు తమ గొప్పతనాన్ని తామే ప్రకటించుకోవాలి అని ఆశపడి, అది రసవంతంగా ఉండడం కోసం దానిని ఇంకొకరి మాటల ద్వారా చెప్పాలని భావించి, సఖి మాటలుగా పలికుతూ ఈ దశకాన్ని అనుగ్రహిస్తున్నారు. ఆళ్వారుల భగవద్విషయంలోని అభినివేశంలోని గొప్పతనాన్ని ఇతరులు కొందరు భక్తులు ప్రస్తావించి పలకడం ఈ దశకంలోని స్వాపదేశార్థమని గ్రహించాలి.

## 56)షష్ఠ శతకం-షష్ఠ దశకం

## # మాలుక్కు

గడచిన దశకం సఖీ వచనంగా అవతరించింది. ఈ దశకం తల్లి పలికే మాటలుగా అవతారిస్తున్నది. ఇందులో ప్రతి పాశురంలోనూ **"ఇళన్దదు"** అనే ప్రయోగం కనిపిస్తుంది. **"శంగై ఇళందాళ్, మామై ఇళందాళ్, శాయై ఇళందాళ్, మాణ్ పిళందాళ్"** (గాజులను పోగొట్టుకుంది, లావణ్యాన్ని పోగొట్టుకుంది, రంగును పోగొట్టుకుంది, సిగ్గును పోగొట్టుకుంది) అనే విధంగా పలుమార్లు ప్రయోగాలు చేయబడ్డాయి. దీనివల్ల భగవద్విషయంలో ప్రావణ్యం కలిగి ఉండడం, కోరిన రీతిలో భగవంతుని సంశ్లేషం పొందలేనందున శరీరం సన్నబడడం, ఒక కట్టడికి అణిగి ఉండలేకపోవడం మొదలైనవి ఈ దశకంలో చెప్పబడుతున్నాయి అని గ్రహించాలి. ఇంతకుముందు నాలుగవ శతకంలో **"ఏఱాళు మిఱైయోనుమ్"** అనే దశకంలో **"మాఱాళన్ కవరాద మణిమామై కుఱైవిలమే"** (భగవంతుడు ఇష్టపడని నా లావణ్యంవల్ల ఉపయోగం లేదు), **"మణిమాయన్ కవరాద**

**మడనెంజాల్ కుఱైవిలమే"** (మణివంటి వర్ణాన్ని కల భగవంతుడు ఆదరించని భవ్యమైన మనసు అక్కరలేదు) అని ఈ విధంగా తామే అక్కరలేదు అని త్యజించిన ఆత్మ–ఆత్మీయాలు అన్నీ ఇపుడు తమకు తామే వదిలి వెళ్ళిపోతున్నాయి అని చెప్పబడుతున్నది. భగవంతుని ఒక్కొక్క అవతారలీలను, ఒక్కొక్క గుణాన్ని భావించగా, భావించగా అళ్వార్లు పారవశ్యాన్ని పొంది, శరీరం కృశించి, ఆత్మ ద్రవీకరించడం ఇందులో అన్యాపదేశ రూపంగా చెప్పబడుతున్నది.

## 57)షష్ఠ శతకం-సప్తమ దశకం

## # ఉణ్ణుమ్ శోఱు

గడచిన దశకం వలె ఈ దశకం కూడా తల్లి పలికే వచనాలుగానే అవతరించింది. పడక మీద పరుండిన పరాంకుశ నాయకితో పాటు పడుకొని, తన కుమార్తె ఆర్తికి తగిన ఉపచారాలు చేసే తల్లి కొంత సేపు అయిన తరువాత పడుకను తడిమి చూసింది. ఎక్కడ కుమార్తె కనిపించలేదు. ఆమెను భూతం ఎత్తుకుపోయిందా? లేక, పిశాచం ఎత్తుకుపోయిందా? అని సందేహపడవలసి ఉండగా, ఆ విధంగా కాకుండా, నాయకికి 'తిరుక్కోళూరు' క్షేత్రంలో వేంచేసి ఉండే భగవంతుని విషయంలో ఉండే ఆర్తిని తల్లి బాగా తెలుసుకున్నది కనుక, నాయకి ఆ క్షేత్రానికి వెళ్లి ఉంటుంది భావించింది. ఆ విషయాన్ని వ్యక్తం చేసే సూక్తులుగా ఈ దశకం ఉన్నది. 'తిరుక్కోళూరు' క్షేత్రానికి వెళ్లి అక్కడ భగవంతునితో నిత్యసంశ్లేషాన్ని పొందాలి అని భావించిన ఆళ్వారుల ఆశ ఈ దశకంగా అవతరించింది.



శ్రీ వైత్తమానిధి పెరుమాళ్ - తిరుక్కోళూర్

## 58)షష్ఠశతకం-అష్టమ దశకం

## # పొన్నులకు ఆళీరో

ఈ దశకంలో నాయకి నాయకుని దగ్గరకు దౌత్యాన్ని పంపుతున్నది. **"వానవర్ కోనై క్కండు యామిదువో తక్కవాఱెన్ఱు వేండుమ్"** (పరమపదంలోని స్వామిని చూచి ,ఇదేనా నీకు తగిన విధానం అని అడగాలి) **అనే పాశురాన్ని, "ఎంగుమ్ శెన్ఱాకిలుమ్ కండు ఇదువో తక్కవాఱెన్మిన్"** (ఎక్కడికైనా సరే వెళ్లి, ఇదేనా నీకు తగిన పని–అని అడగాలి) అనే పాశురాన్ని ఆధారంగా చేసికొని ఈ దశకంలో ఆళ్వార్లు పరరూపంలో, అంతర్యామి రూపంలో దౌత్యం పంపారు అని పెద్దలు అంటారు.

## 59)షష్ఠ శతకం-నవమ దశకం

## # నీరాయ్ నిలనాయ్

ఈ విధంగా దూతప్రేషణాన్ని చేసినా భగవంతుడు రాలేదు. అందువల్ల స్వామినిగూర్చి తమకు గల గొప్ప ఆర్తితో కూడా పరమపదంలో ఉన్న అతడుసైతం వినే రీతిలో ఇందులో ఆక్రందిస్తున్నారు. దూత ప్రేషణను చేయడం కంటే ఆర్తనాదం కార్యాన్ని సఫలం చేస్తుంది అని ఆళ్వార్లు భావించారు .ఈ దశకంలోని సారాన్ని తెలిపే శ్రీవరవరములు నూఱ్ఱన్దాదిలో **"నీరాకి క్కేట్టవర్ కళ్ నెంజళియ మాలుక్కుమ్ ఏరోర్ విశుంబిల్ ఇరుప్పు అరిదామ్"** (విన్న వారి మనస్సు ద్రవించి శిధిలమయేటట్లుగా, భగవంతునకు కూడా పరమపదంలో ఉండడం సాధ్యం కానట్లుగా) అని అన్నందున ఈ దశకంలో ఆళ్వారుల ఆర్తి అతిశయం చాలా ఎక్కువ అని తెలుస్తున్నది.

## 60)షష్ఠ శతకం-దశమ దశకం

## # ఉలగముండ పెరువాయా

గడచిన దశకంలో అంతులేని ఆర్తితో పరమపదం వరకు తమ పిలుపు వినిపించేటట్లు ఆళ్వారులు ఆక్రందించారు. ఆ విధంగా ఆళ్వారులు ఆక్రందించినప్పటికీ భగవంతుడు వచ్చి తన దర్శనాన్ని అనుగ్రహించలేదు. కనుక, ఇంకా ఎక్కువగా తల్లడిల్లి ఆళ్వారులు ఆ భగవంతుడు శ్రీ వైకుంఠంలోనుండి ఈ లోకానికి వచ్చి, రామకృష్ణాది అవతారాలు ఎత్తాడు. ఆ కాలంలో ఆ అవతారాలకు వెనుకబడినవారు కూడా తన దర్శనాన్ని కోల్పోరాదు అనే భావంతో 'వేంకటాద్రి' పోయి అక్కడ నిత్యసూరులతోతోపాటు, సంసారులతో పాటు, తిర్యక్కులతోపాటు



**తిరువేఙ్గడముడైయాన్ - తిరుమల**

తేడా లేకుండా అందరికీ తన దర్శనాన్ని ఇచ్చి, అందరు సమానంగా ఆశ్రయించడానికి వీలు అయ్యేటట్లు అక్కడ నిత్యవాసాన్ని కలిగి ఉండే ఆ భగవానుని సన్నివేశాన్ని తలచి, ఆ వేంకటేశ్వరుని శ్రీచరణాలలో లక్ష్మీదేవి సమక్షంలో తమ అనన్యగతిత్వాన్ని విన్నపం చేసి, ఆళ్వారులు శరణు పొందుతున్నారు, ఈ దశకంలో.

# 61)సప్తమ శతకం-ప్రథమ దశకం

# # ఉణ్ణిలావియ

భగవంతుడు భగవద్గీతలో "**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా**" (దివ్యమైన మూడు గుణాలు కలిగిన ఈ ప్రకృతి ఎవరికి దాటడానికి సాధ్యం కానిది) అని పలికి, వెంటనే "**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే**" (ఎవరు నన్ను ఆరాధిస్తున్నారో వారే ఈ ప్రకృతిని దాటగలరు) అని అన్నాడు. ఒక పిచ్చుక కట్టిన గూడును విప్పడం ఎవరికీ సాధ్యం కానట్లే, జీవుడు తాను చుట్టుకున్న మాయా జన్మల గూడును విప్పడం ఎవరికి సాధ్యం కాదు అని ముందుగా పలికి, "నా చరణాలను ఎవరైతే శరణు పొందుతారో వారు ఆ గూడును సులభంగా విప్పుకోగలరు" అని భగవంతుడు అంటున్నాడు. ఆ సూక్తిలోని నమ్మిక చేత ఆళ్వార్లు గడచిన దశకంలో లక్ష్మీదేవి పురుషకార పూర్వకంగా శ్రీ వేంకటేశ్వరుని శ్రీచరణాలలో చాలా ఆర్తితో శరణం పొందారు. మాయ అనే ప్రకృతివల్ల కలిగిన అజ్ఞానాన్ని తీర్చి, నిత్య కైంకర్య సామ్రాజ్యాన్ని పొందేటట్లుగా చేయాలని వారు భగవంతుని ప్రార్థించారు. కాని ఆ శరణాగతి ఫలించలేదు. భరతుడు చేసిన శరణాగతికి ముందు దేవతల శరణాగతి చేసినందున దానికి తగిన ఫలాన్ని కలిగించిన తర్వాతే, భరత శరణాగతికి ఫలాన్ని ఇవ్వాలని శ్రీరాముడు అనుకున్నట్లే, ఇక్కడ కూడా ఆళ్వార్ల శరణాగతికి ముందు ఈ లోకంలో కొందరు సంసారులు శరణాగతి చేసి ఉంటారు. "మేము జీవించేటట్లు చాలా ఉన్నతమైన ఒక ప్రబంధాన్ని మాకు అనుగ్రహించాలి" అని కొందరు శరణాగతి చేసి ఉంటారు. అదే ముందు శరణాగతి కనుక, దానికి ఫలాన్ని ఇచ్చిన తర్వాతే అళ్వార్ల శరణాగతికి ఫలాన్ని ఇవ్వాలి అని భగవంతుడు ఆలస్యం చేశాడు. భగవంతుని

స్వరూప-రూప-గుణ-విభూతి-లీలలను ఏ లోటూ లేకుండా వర్ణించగలిగిన ఒక ప్రబంధం అవతరించాలి అని ఇంతకుముందే కొందరు శరణాగతి చేసినందున, ముందుగా దానికి ఫలం ఇవ్వాలని అనుకున్న భగవంతుడు ఆళ్వారుల శరణాగతికి తాత్కాలికంగా ఫలాన్ని ఇవ్వకుండా నిలిపాడు–అని చెప్పాలి. వీరి శరణాగతికి ఇప్పుడే ఫలాన్ని ఇస్తే తిరువాయ్ మొళ్లి ప్ర బంధం అసంపూర్ణంగా నిలిచిపోతుంది కదా. ముందు చేసిన శరణాగతికి ఫలం సిద్ధించినట్లు కాదు కదా. తిరువాయ్ మొళ్లి పూర్తి చేయాలని అనుకొని భగవంతుడు ఇంకా కొంతకాలం ఈ విభూతిలో ఆళ్వారులు ఉండాలి అని అనుకొని వారి శరణాగతికి ఫలితాన్ని ఇవ్వకుండా ఆలస్యం చేసి వారిని ఈ లోకంలో ఇంకా ఉంచాడు. ఇంతకుముందే ఆళ్వార్లు **"పావియేనై పల నీ కాట్టి పడుప్పాయో?"** (పాపిష్టివాడను అయిన నాకు అనేక వస్తువులను చూపించి నన్ను పాడు చేస్తావా?) అని ఆక్రందించారు కదా. ఆ ఆక్రందనే మళ్ళీ మళ్ళీ తల ఎత్తి, **"అందో ఉనపాదమ్ ఆకలకిల్లేన్ ఇఱైయుమే"** (అయ్యో! ఒక్క క్షణం కూడా నీ పాదాలను నేను విడిచి ఉండలేను) అని పలికి, "నన్ను నీకు దూరంగా సంసారం మధ్యలో ఉంచి బాధించడం ధర్మమేనా" అని ఈ దశకంలో ఆళ్వారులు ఆర్తిగా పలుకుతున్నారు.

## 62)సప్తమ శతకం-ద్వితీయ దశకం # కంగులుమ్ పగలుమ్

గడచిన ఆరవ శతకం చివరి దశకంలో లక్ష్మీదేవిని ముందుంచుకుని ఆళ్వార్లు శ్రీవేంకటేశ్వరుని చరణాలలో వాలి శరణాగతి చేసినా, ఆళ్వారులు తాము భగవంతుని సన్నిధిని పొందలేకపోయారు. అనుకున్న రీతిలో ప్రయోజనాన్ని

పొందలేకపోయారు. ఇంకా ఈ ప్రకృతిలో తాము నిలిచి ఉన్న సంగతిని గమనించారు. శబ్దాదివిషయాలు, ఇంద్రియాలు వర్తించే




**శ్రీరంగనాథ పెరుమాళ్ - శ్రీరంగం**

ఈ సంసారంలో తమను నిలిపి ఉంచగానే, తమ పట్ల భగవంతుడు ఆదరం చూపించలేదని ఇంకా ఈ ప్రకృతి మండలంలోనే ఉంచి బాధపెట్టాలని అనుకున్నాడు-అని భావించారు. పులి నోటిలో చిక్కుకున్న రీతిలో గడచిన దశకంలో చాలా క్లేశంతో ఆళ్వార్లు పలికారు. ఈ ఆర్తిని భగవంతుడు గమనించకుండా పోలేదు. "ఏ విధంగానైనా వీరికి నేను వీరు కోరిట్లు మోక్షప్రాప్తిని కలిగించడం తథ్యం. వీరు అక్కడికి పోయి చేసే కార్యాన్ని ఇక్కడే చేయనీ" అని భావించాడు. తన సంతానాన్ని ఆకలితో నిలిపి ఉంచి, ఇంటికి వచ్చిన అతిధులను ఆదరించినట్లుగా, "ఈ ఆళ్వార్లు నాలుగు దినాలు బాధపడితే బాధ పడనీ. వీరి దివ్య ప్రబంధాన్ని పురస్కరించుకొని లోకాన్ని తరింప చేయాలి" అని భగవంతుడు తలచాడు. వీరు ఒక్క క్షణం ఈ లోకంలో ఉన్నా, భగవంతునకు

కూడా సంస్కరించడానికి సాధ్యం కాని రీతిలోని సంసారం ఎంతగానో బాగపడి ఉజ్జీవించేటట్లు అయినది కదా. అందువల్లనే భగవంతుడు ఆళ్వార్లను ఈ లోకంలో నిలిపి ఉంచాడు. "అయ్యో! ఈ క్రూరమైన లోకంలో ఉండడం సహించలేని నన్ను పురస్కరించుకొని భగవంతుడు తన కార్యాన్ని పూర్తి చేసుకోవాలని తలుస్తున్నాడు. ఈ లోకంలో ఉండడం ఇష్టపడేవారు చాలామంది ఉన్నారు కదా. అటువంటివారిని పురస్కరించుకొని, వారిలో ఎవరినైనా ముందుంచుకుని తన కార్యాన్ని చేసుకోకూడదా! అని ఆళ్వార్లు చాలా బాధ పడ్డారు. ఇక్కడ ఉండడం సహించలేనివారినే ముందుంచుకుని కార్యాన్ని పూర్తి చేసుకోవాలి అనేది భగవంతుని పట్టుదల. "ఈ విధంగా భగవంతునకు దూరమై క్లేశాన్ని పొందే అవస్థ నాకు కలిగింది" అని మిక్కిలి బాధపడిన ఆళ్వార్లు తమ ఆళ్వారుల దశను కోల్పోయి, నాయకి భావాన్ని పొంది, తమ పరితాపాన్ని తమ నోటితో చెప్పుకోలేని దశలో తల్లి మాటలతో వ్యక్తం చేయవలసిన ఆవస్థను పొందారు. ఈ విధంగా ఈ దశకంలో పరాంకుశ నాయకి తల్లి, తన కుమార్తె పొందే బాధను తెలుపుతున్నది. పరాంకుశ నాయకి తల్లి తన కుమార్తెను 'శ్రీరంగనాథు'ని సన్నిధికి తీసికొనిపోయి, "ఈమె ఏడవడం, నమస్కరించడం, మోహ పడడం, జల్పించడం, క్రమాన్ని తప్పి మాట్లాడడం, నిట్టూర్పు విడవడం, అది కూడా చేయలేకపోవడం, స్థబ్ధగా ఉండడం మొదలైన దశలను పొందుతున్నదే" అని తన కుమార్తె దశలను ఆ స్వామి ముందు పలికి, "ఈ విషయంలో నీవు ఏమి చేయాలని నిశ్చయించుకున్నావు" అని ప్రశ్నిస్తున్నది.

# 63)సప్తమ శతకం-తృతీయ దశకం

## # వెళ్ళౌ చ్చురిశంగు

గడచిన దశకంలో ఆళ్వారుల దుఃఖం మాటలకు అందనిది అయినది. శ్రీరంగనాధుని నేత్రసౌందర్యాన్ని, రూపసౌందర్యం మొదలైనవానిని పరాంకుశ నాయకి అయిన తాను నేరుగా పలకడంవల్ల, తల్లి చెప్పగా వినడంవల్ల ఆమె ప్రాణాలను



శ్రీ మకర నెడుంకుళ్ళైక్కాదన్ - తెన్ తిరుప్పేర్

ధరించడం జరిగింది. ఆమె మోహం కొంతవరకు తీరింది. తెలివి వచ్చింది. తర్వాత 'తెన్ తిరుప్పేర్' క్షేత్రంలోని 'మకర నెడుంకుళ్ళైక్కాదన్' అనే పేరుగల స్వామి దగ్గరకు వెళ్ళి తీరాలి – అనే ఆర్తి కలిగి, ఆ స్వామి దగ్గరకు వెళ్ళాలని బయలుదేరింది. మునుపటివలెనే చెలికత్తె, తల్లి ఆమెను అడ్డుకొని "నీకు ఇంతటి సాహసం, ప్రావణ్యం తగదు. మన వంశానికి ఈ విధంగా నువ్వు ఇల్లు విడిచి వెళ్ళడం నిందకు కారణం అవుతుంది" అని అన్నారు.

"మీరు అడ్డు చెప్పినందున ఏ విధమైన ప్రయోజనం లేదు. నేను స్వామి విషయంలో మనస్సు పోగొట్టుకున్నాను. అందువల్ల నేనే పోవడం కంటే మీరే నన్ను వెంటబెట్టుకుని తీసుకుని పోయి ఆ స్వామి దగ్గరకు చేర్చండి" అని పరాంకుశనాయకి  తనకు కలిగిన నిశ్చయాన్ని వారికి చెప్పడం ఈ దశకంలోని విషయం.

## 64)సప్తమ శతకం-చతుర్థ దశకం

## # ఆழி ఎழ

ఈ దశకంలో ఆళ్వార్లకు కలిగిన ఆర్తి భక్తి పరిమితి లేనిది. **"మణ్ తిణి ఞాలముమ్ ఏழு కడలుమ్ నీళ్ విశుంబుమ్ కళియ పెరిదాల్"** (భూలోకం కంటే, ఏడు సముద్రాల కంటే, విశాలమైన పరమపదం కంటే పెద్దది నా ఆర్తి. ఆహా!) అని అంటూ ఆళ్వార్లు ఈ విషయాన్ని తెలియజేశారు. ఈ విధంగా కట్టలు తెగి ప్రవహించిన తమ భక్తిని కల నేను ఇక్కడ ఉండలేను. 'తెన్ తిరుప్పేర్' క్షేత్రానికి వెళ్లి తీరాలి-అని అన్నారు. ఆమె తల్లి, చెలికత్తె మొదలైనవారు ఈ విధంగా చేయడం తగదు. నీ స్వరూపానికి హాని కలుగుతుంది"  అని పలికి అడ్డుపెట్టారు. కానీ నాయకి వినలేదు. ఈ స్థితిలో ఉండే ఆళ్వార్లు తాము అనుకున్నట్లు బయలుదేరాలని వెళ్లాలని ప్రయత్నించారు.  కానీ, **"కాలాళుమ్ నెంజళియుమ్"** అనే విధంగా కాళ్లు తడబడ్డాయి. మనసు ద్రవించింది. ఇటువంటి స్థితిలో ఉండే ఆళ్వార్లు తాము తలచినట్లు బయలుదేరి వెళ్ళలేని బలహీనతను పొందారు. నోటితో మాట్లాడడానికి కూడా సాధ్యం కాని బలహీనతను కల వీరికి ఏదో ఒక విధంగా బలాన్ని కలిగించాలి–అని భగవంతుడు చూచాడు. తన విజయ వృత్తాంతాల పరంపరను వారికి దర్శింపజేసి నట్లయితే వాటిని దర్శించి వారు బలాన్ని పొంది నిలువ గలరు–అని భావించాడు.

తాను ముల్లోకాలను కొలిచిన వృత్తాంతం, సముద్ర మధనం, భూమిని ఉద్ధరించడం, ప్రళయకాలంలో లోకాలను తన నోటిలో పెట్టుకొని కాపాడడం మొదలైన వృత్తాంతాలను వారికి దర్శింపచేశాడు. "ఆళ్వారులూ! వీటిని మీరు దర్శించి, ఆనందించి సత్తువను పొందండి" అని అన్నాడు, ఆళ్వార్లు కూడా ఆ వృత్తాంతాలను ఆ కాలంలోనే జరిగినట్లుగా దర్శించి ప్రతీ పాశురంలోనూ ఒక్క వృత్తాంతాన్ని వర్ణిస్తూ ఆనందిస్తున్నారు, ఈ దశకంలో.

## 65)సప్తమ శతకం-పంచమ దశకం

## # కఱ్ఱార్ ఇరామపిరానై

గడచిన దశకంలో భగవంతుని కొన్ని విజయ వృత్తాంతాలను దర్శించి ఆనందించిన ఆళ్వారులు, అటువంటి ఇంకా కొన్ని వృత్తాంతాలను నోరారా వర్ణిస్తూ, "ఆహా! ఇటువంటి భగవద్గుణాలను అనుభవించడానికి తగిన యోగ్యతను కలిగి పుట్టిన సంసారులు వీటిని అనుభవించకుండా, వేరు విషయాలను ఆదరించి ఆనందిస్తున్నారే! ఇది ఏమి? " అని మనసులో ఆశ్చర్యపడుతూ, బాధపడుతూ ఈ దశకంలో పలుకుతున్నారు.

## 66)సప్తమ శతకం-షష్ఠ దశకం

## # పామరు మూవులకమ్

గడచిన దశకంలో పరోపదేశం స్పష్టంగా లేకపోయినా, పరోపదేశంలోనే దృష్టి కలిగి ఉన్నది. "**కఱ్ఱార్ ఇరామపిరానై యల్లాల్ మఱ్ఱుమ్ కఱ్పరో?** (ప్రియాన్ని, హితాన్ని అనుసంధించేవారు రాముని తప్ప ఇంక ఎవరిని అయినా

అనుసంధిస్తారా") అని, **"నారణఱ్కాళన్ఱి యావరో"** (నారాయణునకు తప్ప ఇంకా ఎవరికి దాసులు అవుతారు?) అని, **"కణ్ణనుక్కాళన్ఱియావరో"** (కృష్ణునకు తప్ప ఇంక ఎవరికీ దాసులు అవుతారు?) అని ప్రతి పాశురంలోను పరోక్షనిర్దేశంగా ఉన్నా, ఎదురుగా ఉండే వ్యక్తులను నిర్దేశించే రీతిలో సంబోధన రూపంగా పలకడంలోనే ఆళ్వారుల అభిప్రాయం ఉన్నది. " పాపులరా! మీరు ప్రాప్యాన్ని అన్యాయంగా కోల్పోతున్నారు" అని సంసారులను ఉద్దేశించి పరితాపంతో పలకడం, "ఆ విధంగా కోల్పోకుండా దానిని పొందండి" అని ఉపదేశించడమే గత దశకానికి ప్రమేయం. ఆ విధంగా ఇతరుల నష్టానికి బాధపడి పలికిన ఆళ్వారులు తమను గమనించి చూసుకున్నారు. ఇతరులు కోల్పోవడం నాస్తిక్యంవల్ల. అటువంటి నష్టం తమకు లేకపోయినా, భగవంతుని పరిపూర్ణంగా అనుభవించాలి అనే ఆశ తమకు ఏ లోటు లేకుండా ఉన్నప్పటికీ, ఆ అనుభవం పొందలేకపోవడం అనే నష్టం తమకు సహించరానిదిగా అయినది. అందువల్ల తమ ఆర్తిని అంతటినీ అర్థం అయ్యేటట్టుగా పరమపదంలో ఉండే పరమాత్మ వరకు వినిపించే విధంగా పెద్ద గొంతుకతో ఈ దశకంలో గొంతెత్తి ఆక్రందిస్తున్నారు. 'అమ్మంగి అమ్మాళ్' అనే ఆచార్యులు "ఈ దశకంలోని శబ్దరాశిని మనం నోటితో పలకడం, చెవులతో వినడం తప్ప ఇందులో ఆళ్వార్లకు కలిగిన ఆర్తి ఇంతటిది అని నిర్దేశించి చెప్పడానికి మనకు యోగ్యత లేదు" అనేవారట.

## 67)సప్తమ శతకం-సప్తమ దశకం

## # ఏఴాழையరావి

గడచిన దశకంలో అళ్వార్లు గొంతెత్తి చేసిన ఆక్రందన పరమపదంవరకు వెళ్లి పరవాసుదేవుని చెవిలో పడి ఉంటుంది

కదా. అది విని ఆ స్వామి ఆళ్వార్లకు ఒక విధంగా ఊరట కలిగించడంకోసం వారికి ప్రత్యక్ష సమానాకారమైన దర్శనాన్ని అనుగ్రహించాడు. అంటే, భగవంతుని దివ్యావయవాల దర్శనాన్ని ప్రత్యక్షంగా కాకుండా మానసికంగా ఆళ్వార్లు పొందారు. ఆ విషయం ఈ దశకంలో చెప్పబడుతున్నది. నాయకీభావంతో పలికే దశకం ఇది. తల్లిని చూసి, చెలికత్తెను చూసి నాయకి "భగవంతుని రూప సౌందర్యం నాకు ప్రత్యక్ష సమాన కారణంగా గోచరిస్తున్నది. భగవంతుని దివ్యావయవ సౌందర్యం సాముదాయికంగా, ప్రత్యేకంగా గోచరించి నన్ను బాధిస్తున్నది ఈ బాధను ఏ విధంగా నేను తట్టుకోగలను? ఇక మీ మాటలకు నేను ఏవిధంగా అంగీకరించగలను? భయపడగలను?" అని ఈ దశకంలో పరాంకుశ నాయకి పలుకుతున్నది. పూర్వం ఐదవ శతకంలో **"ఎంగనేయో అన్నైమీర్గాళ్"** అనే 'తిరుక్కుఱుంగుడి' దశకంలో కూడా ఈ విధంగానే ప్రత్యక్ష సమానాకారంగా ఆళ్వార్లు పలికినట్లు కనిపిస్తోంది. అంతకంటే భిన్నంగా ఈ దశకంలో ఏమి ఉన్నది? అని అంటే, అక్కడ అప్రీతి, ప్రీతి సమానంగా గోచరిస్తుంది, ఇక్కడ ఆప్రీతి ఎక్కువగా గోచరిస్తుంది. ప్రారంభంలోనే ఇందులో **"ఇణైక్కూఱ్ట్రంగొలో!"** (రెండు మృత్యుదేవతలా?) అని పలికినందున బాధకత్వంలోని దార్ఢ్యం స్పష్టమవుతుంది.

# 68)సప్తమ శతకం-అష్టమ దశకం

# # మాయా వామననే

గడచిన దశకంలో అళ్వార్లు ప్రత్యక్ష సమానాకారంగా భగవంతుని దివ్యావయవ సౌందర్యాన్ని మానసికంగా దర్శించి బాధపడ్డారు. ఆ బాధను తీర్చడం భగవంతునకు అసాధ్యం కాదు గదా. అయినా, కొన్ని కారణాల వల్ల అతడు మనసులో ఒక

సమయంకోసం ఎదురు చూస్తున్నందున ఆలస్యం చేశాడు. ఆ అభిప్రాయాన్ని ఆళ్వారులు కూడా తెలియనివారు కాదు. తెలిసినప్పటికీ బాధను తట్టుకోగలవారు కాదు గదా. ప్రాణం పోయే స్థితి తమకు కలిగినప్పటికీ భగవంతుడు తమ ప్రాణాన్ని పోనివ్వకుండా ఉంచిన రీతిని చూసి చాలా ఆశ్చర్య పడ్డారు. "ఈ విధంగానా ఒక ఆశ్చర్యం ఉన్నది !" అని భగవంతుని ఉద్దేశించి చూచి పలుకుతూ "ఏమి ఆశ్చర్యం ఇది!" అని భగవంతునితో పలుకగా, అప్పుడు భగవంతుడు "ఆళ్వారులూ! ఈ ఒక్క ఆశ్చర్యమే నా దగ్గర ఉన్నది అని అనుకుంటున్నారా? నా విచిత్రాలను అన్నిటిని చూపిస్తాను చూడండి" అని పలికి తన విరుద్ధవిభూతికత్వాన్ని చూపించాడు. దానిని దర్శించిన ఆళ్వార్లు చాలా ఆశ్చర్యపడి, తమ అనుభవాన్ని ఇందులో పలుకుతున్నారు.

# 69)సప్తమ శతకం-నవమ దశకం

# # ఎన్నైక్కుమ్

గత దశకంలో భగవంతుని ఒక ఆశ్చర్యకరమైన చాతుర్యం వ్యక్తమయింది. ఆళ్వార్లు ఒకటి అడగగా, భగవంతుడు ఇంకొకటి పలికి, వారు అడిగిన విషయాన్ని మర్చిపోయేటట్లు చేయడంలో సమర్థుడు కనుక, ఒక్కొక్క సమయంలో భగవంతుని ఒక్కొక్క గుణం వ్యక్తం కావడం, దానిని ఆళ్వార్లు అనుభవించి కీర్తించడం, ఆ విధంగా కొంతకాలం గడవడం అని ఈ విధంగా నడుస్తున్నది. ఇప్పుడు భగవంతుని గట్టిగా నిర్బంధించి అడిగి, దానికి తగిన సమాధానాన్ని తప్పకుండా పొంది తీరాలి అనే ఒక తీవ్రమైన రుచి ఆళ్వార్లకు కలిగింది. అందువల్ల భగవంతుని తీవ్రంగా నిర్బంధించి పలుకుతూ "స్వామీ! నా ఆర్తి లో ఏదైనా లోటును చూశావా? నీ శక్తిలో కొరతను చూశావా? ఎందుకు ఈ విధంగా నన్ను

బాధిస్తున్నావు? అసత్యమైన జ్ఞానం, అసత్ప్రవర్తన, వీటి వల్ల కలిగే ఈ మురికి శరీరం–అనే వీటిలో జుగుప్సను పొందిన నన్ను ఈ క్రూరమైన సంసారంలో ఉంచి బాధించి, వేధించడం పరమ కారుణికుడవైన నీకు తగినదేనా? ఏ అభిప్రాయంతో నన్ను ఇక్కడ నిలిపి ఉంచావు? ఈనాడు నాకు దీనినిగూర్చి తప్పక చెప్పి తీరాలి" అని నిలదీసి అడిగారు. ఈ మాటలను విన్న భగవంతుడు "ఆళ్వార్లూ! నా అభిప్రాయం ఏమిటో మీకు తెలియదా? తెలిసినా తెలియనివారివలె అడుగుతున్నారే! నాకు, నాకు చెందినవారికి కాలక్షేపానికి తగిన, వినడానికి చాలా సొంపైన, తియ్యని పలుకులను కల ప్రబంధాన్ని పాడించాలని కదా మిమ్ములను ఈ లోకంలో ఇంత కాలం ఉంచాను! ఆ విధంగా ఉండగా మీరు ఎందుకు తొందర పడుతున్నారు?" అని అడిగాడు. దానిని విన్న ఆళ్వార్లు "స్వామీ! నీ అభిప్రాయం ఇదా? సర్వేశ్వరుడువై ఉండి, అవాప్త సమస్తకాముడవైన నీకు ఒక ఆశ కలిగి, ఆ ఆశను నా ద్వారా తీర్చుకోవాలని భావించడం చాలా బాగుందే! నీకు కొన్ని మంచి ప్రబంధాలు కావాలంటే, వాటిని రచించి ఇవ్వడానికి తగిన జ్ఞానం, శక్తి మొదలైనవానిని సంపూర్ణంగా కలిగిన వ్యాసమహర్షి, పరాశర మహర్షి, వాల్మీకి మహర్షి మొదలైనవారి ద్వారా పాడించు కోకూడదా? చాలా నీచుడను, ఏ గుణం లేని వాడను అయిన నా ద్వారా ఈ ప్రబంధాన్ని పాడించాలని నీవు అనుకోవడం ఏమి ఆశ్చర్యం! ఇది ఏమి నీ సౌలభ్యం! ఇది ఏమి నీ వాత్సల్యం!" అని కృతజ్ఞతతో పలుకుతూ, "దీనికి తగినట్లు నేను నీకు చేయగలిగిన ప్రత్యుపకారం ఏమీ కనబడడం లేదే! ఏమి చేయను?" అని తడబడుతూ ఆళ్వారులు పలుకుతున్నారు, ఈ దశకంలో.

# 70)సప్తమ శతకం-దశమ దశకం

# # ఇన్బమ్ పయక్క

భగవంతుడు తమ ద్వారా తిరువాయ్ మొఝి ప్రబంధాన్ని పాడించడంద్వారా చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం ఏమీ కనపడటం లేదే! అని గడచిన దశకంలో ఆళ్వార్లు తడబడ్డారు. ఇటువంటివి వీరి తడబాటును తీర్చడంకోసం భగవంతుడు "అళ్వార్లూ! మీరు ఎందుకు ఈ విధంగా తడబడుతున్నా రు? మీరు ఈనాడు ఒక పనిని చేసి మీ కొరతను తీర్చుకోవచ్చు అని భావిస్తున్నాను. పూర్వం అయోధ్యలో నేను



తిరుకురళప్పన్ - తిరువారన్ విళై

కుశలవుల నోటి ద్వారా శ్రీ రామాయణ గానాన్ని విన్నాను అనే విషయం మీరు విని ఉన్నారు కదా. ఆ విధంగానే ఇప్పుడు 'తిరువాఱన్ విళై' అనే క్షేత్రంలో తిరువాయ్ మొఝిని వినడం కోసం వేచి ఉన్నాను. అయితే, శ్రీరామాయణం విన్నప్పుడు నేను

సీతాదేవికి దూరంగా ఉన్నందున "ఒంటరిగానే ఆ రామాయణ గానాన్ని విన్నానే!" అనే ఒక కొరత ఉన్నది. ఇప్పుడు ఎటువంటి కొరత ఏమీ లేకుండా నేను నా పత్నులతో పాటు వినాలని నిశ్చయించుకున్నాను. అందువల్ల మీరు అక్కడకు వచ్చి తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని నాకు వినిపిస్తే ఒక విధంగా మీ మనసులోని కొరతను తీసుకోవచ్చు కదా !" అని అన్నాడు. భగవంతుని ఈ మాటలను విన్న ఆళ్వారులు "నా ద్వారా తిరువాయ్ మొళ్ళిని పాడించి, ఉపకారాన్ని చేయడంతో నిలువకుండా, దానిని నా ద్వారా వినాలని అనుకున్నావా స్వామీ! ఇది ఏమి మహోపకారం!" అని తలమునకలుగా సంతోషాన్ని పొంది, 'తిరువాఅన్ విళై' క్షేత్రానికి వెళ్లి తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని వినిపించే కైంకర్యం చేయాలనే తమ ఆశను ఈ దశకంలో ఆళ్వార్లు వ్యక్తం చేస్తున్నారు.



**నమ్మాళ్వార్ - పరాంకుశనాయకి తిరుక్కోలం - శ్రీరంగం**

# 71)అష్టమ శతకం-ప్రథమ దశకం

# # తేవిమారావార్

గడచిన దశకంలో ఆళ్వార్లు "తిరువాఱన్ విళై" అనే క్షేత్రంలో వెళ్లి, అక్కడ తాను, లక్ష్మీదేవి కలసి వేంచేసి ఉండి తిరువాయ్ మొఴి ప్రబంధాన్ని వినాలి అనే భగవంతుని ఆశకు తగినట్లుగా మనం అక్కడకు వెళ్లి తిరువాయ్ మొఴి ప్రబంధాన్ని ఆ స్వామికి వినిపించి, ఆ విధంగానే ఇంకా కొన్ని సేవలను చేసి ఆనందిద్దాం" అని ఆశపడ్డారు. ఆ ఆశ కేవలం ఆశగానే మిగిలిపోయింది తప్ప భావించిన రీతిలో అది నెరవేరలేదు. అందువల్ల ఆళ్వార్లకు భగవంతుని కొన్ని కళ్యాణగుణాలలో సందేహం తోచింది. దానినివారు ఈ దశకంలో తెలియజేస్తున్నారు. లక్ష్మీదేవి సమీపంలో ఉన్నప్పటికీ, నిత్య సూరులు దగ్గరలో ఉన్నప్పటికీ, తలచిన రీతిలో ఏ కార్యాన్ని అయినా చేసి ముగించగల శక్తి ఆ స్వామికి ఉన్నప్పటికీ, భక్తులు కోరినట్లు రూపాలను గ్రహించి, వారిని ఆనందింపజేసి, వారి ఆశను తీర్చగలిగినవాడై ఉన్నప్పటికీ, తమకు అభినివేశంలో ఏ లోటు లేకుండా ఉన్నప్పటికీ, తలచిన రీతిలో ఆశను ఆళ్వార్లు పొందలేకపోయారు. అందువల్ల వారికి చాలా నిరాశ కలిగింది. అపుడువారు భగవంతుని ఉద్దేశించి "స్వామీ! నేను తలచినది భ్రమా! నీ భక్తులకు నీవు వశమై ఉంటావు అని, అన్ని వస్తువులు నీవశంలో ఉంటాయి అని- ఈ విధంగా కొన్ని గుణాలను నేను నీలో ఉన్నాయని భావించాను. ఆ భావన సరైనది కాదా ! అని ఇప్పుడు నాకు సందేహం కలుగుతున్నది, నేను నేనొక్కడిని పుట్టి నీతో నీ గుణాలు లేకుండా ఉండేటట్లు చేశాను కాబోలు-అని ఇందులో పలుకుతున్నారు. అశోకవనంలో సీతాదేవి **"ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చ సానుక్రోశశ్చ రాఘవః, సద్వృత్తో నిరనుక్రోశః**

**మన్యే మద్భాగ్యసంక్షయాత్**" (గొప్ప జ్ఞానం కలవాడని, కృతజ్ఞత కలవాడని, దయ కలవాడని పేరు పొందినవాడు, గొప్ప వర్తనను కలిగిన రాముడు నా విషయంలో దయ కలవాడు కాకపోవడం నా అదృష్ట లోపం వల్లనే) అని శ్రీరాముని గుణాలలో సందేహాన్ని పొందినట్లే ఇదికూడా. **"గోవిందన్ గుణమ్ పాడి ఆవికాత్తిరుప్పేనే"** (గోవిందుని గుణాలను కీర్తించి నా ప్రాణాలను నిలుపుకుంటాను) అని ఈ విధంగా భగవంతుని కల్యాణగుణాలను భావన చేస్తూ ప్రాణాలను ధరించవలసినవారు వాటిలో సందేహాన్ని పొందితే తర్వాత జీవించడానికి దారి లేనందున, ఈ విధంగా సందేహాన్ని పొందిన ఆళ్వార్లను ఇక నేను పోగొట్టుకోవాల్సి వస్తుందా ఏమి? అని భగవంతుడు చాలా సందేహపడి, "ఆళ్వారులూ! ఈ విధంగా మీరు సందేహ పడడం తగినదేనా? నేను మీకు ఏమీ చేయలేదా? నేను ఎంత చేశాను అనే విషయాన్ని మీరే ఆలోచించి చూడండి. ఇంత చేసిన నేను ఇకపై చేయవలసిన దానిని కూడా క్రమంగా చేస్తాను సుమా! మీరు వ్యర్థంగా సందేహ పడకండి" అని పలికి, సమాధాన పరచాడు. ఆళ్వార్లు అపుడు సమాధానపడి, భగవంతుని గుణాలను అనుసంధానం చేసి, ఆనందిస్తున్నారు.

## 72)అష్టమ శతకం-ద్వితీయ దశకం

## # నంగళ్ వరివళై

"భగవంతుడు ఆశ్రిత పరతంత్రుడు, సర్వ నిర్వాహకుడు అని తలచాను. ఆవి నా విషయంలో అసత్యాలు అవుతున్నాయా? ఏమి! అని భగవంతుని గుణాలలో, స్వరూపంలో సందేహాన్ని పడిన ఆళ్వార్లను భగవంతుడు ఒక విధంగా సమాధానపరచి తేటపడేటట్లు చేశాడు. తమకు కలిగిన సందేహం తీరింది తప్ప,

తాము కోరిన విధంగా భగవంతుని బాహ్య సంశ్లేషాన్ని ఆళ్వార్లు పొందలేకపోయారు. అందువల్ల వారికి ఇంకొక సందేహం కలిగింది. అది ఏమంటే – 'నాకు సంసారంలో ఆశ లేదు అని నేను భావించినప్పటికీ, "ఉళ్ళువారుళ్ళిత్తెల్లామ్ ఉడనిరుందఱిది" (భక్తుల మనసులలో నిలిచి ఉండి వారి భావాలను అన్నిటినీ తెలిసికొంటావు అనే విధంగా భక్తుల ఆంతర్యాన్ని, భగవంతుని మనసును గమనించి చూస్తే ఆ స్వామికి నాకింకా సంసారంలో ఆశ ఉన్నదని అనుకుంటున్నట్లు తోస్తున్నది. లేకపోతే అతడు నన్ను ఇక్కడే నిలిపి ఉంచే అవకాశం లేదు కదా. అతడు నన్ను ఉపేక్షిస్తున్నాడు కనక నాకు సంసార రుచి ఇంకా ఉన్నది, తీరలేదు-అని భగవంతుని అభిప్రాయ కావచ్చు. సర్వజ్ఞుడైన అతడు ఆ విధంగా భావిస్తే అది అసత్యమై ఉండదు కదా. నాకు తెలియకుండానే నాలో సంసారం పట్ల ఆశ ఉన్నదా ఏమి?" అనే సందేహం ఆళ్వార్లకు కలిగింది. అందువల్ల తమకు



**తిరువేంగడముడైయాన్**

ఆత్మాత్మీయాలలో ఆశలేదని భగవంతుని మనసులో పడేటట్లు చేయాలని వారు భావించారు. ఆ విషయాన్ని నేరుగా విన్నవించకుండా, చెలికత్తెలతో సంభాషించే విధంగా అన్యాపదేశప్రక్రియలో ఈ దశకంలో ఆళ్వార్లు తెలియజేస్తున్నారు. **"కాలమ్ పల శెన్రుమ్ కాణ్బదానై ఉంగళోడు ఎంగళిడైయిల్లైయే"** (ఎంతకాలం గడిచినా అతని ఆజ్ఞను ఎదురుచూస్తున్నాను. ఈ నిర్ణయాన్ని పాడు చేయాలని చూసే మీతో నాకు సంబంధం లేదు) అని, **"పాద మడైవదన్ పాశత్తాలేమఱ్ఱవన్ పాశంగళ్ ముఱ్ఱ విట్టు"** (భగవంతుని చరణాలను పొందడంలో ఉండే గొప్ప ఆశచేత మిగిలిన విషయాలలో ఉండే బలమైన కోరికలను నేరుగా విడచి) అని మొదలయిన పాశురాలు ఈ దశకంలో ముఖ్యమైనవి. అన్యాపదేశ ప్రక్రియ ఈ దశకంలో ఏ విధంగా ఉన్నది? అని అంటే, సర్వేశ్వరునితో కలసి, తరువాత ఆ స్వామి దూరమైన ఒక నాయిక మళ్లీ అతడే వచ్చేవరకు వేచి ఉండకుండా, తానే బయలుదేరి, అతడు ఉండే చోటికి వెళ్లాలని ప్రయత్నించగా, ఈ ప్రయత్నాన్ని చెలికత్తె మొదలైనవారు చూచి, "నీవు ఈ విధంగా కట్టడిని దాటి బయలుదేరడం ఏ మాత్రం తగదు" అని హితాన్ని పలికి, ఆమెను ఆ ప్రయత్నం నుండి విరమింప జేయాలని చూచారు. అప్పుడు వారిని చూచి నాయిక "భగవద్ విషయం ఒక్కటి తప్ప మిగిలిన దేనిలోనూ నాకు ఆశ లేదు" అని పలుపుతూ, వారి మాటకు తాను అంగీకరించలేకపోవడాన్ని తెలుపుతున్నది.

# 73)అష్టమ శతకం-తృతీయ దశకం

# # అంగుమింగుమ్

గడచిన దశకంలో పదవ పాశురంలో **"ఓర్ కోల నీల నన్నెడుమ్ కున్ఱమ్ వరువదొప్పాన్"** (ఒక అందమైన నల్లని గొప్ప పర్వతం వస్తున్నట్లుగా ఉన్నాడు) అని భగవంతుని దివ్య మంగళ విగ్రహ వైలక్షణ్యాన్ని అళ్వార్లు అనుసంధించారు. ఆ అనుసంధానం వారి మనసులో బాగా నాటుకున్నది. అటువంటి సౌందర్యసౌకుమార్యాలకు ఆకరమైన రూపంతో అన్యప్రయో-జనాలను ఆశించే ప్రతికూలురు ఉండే ఈ లోకంలో ఒంటరిగా వచ్చి సంచరిస్తున్నాడే! రక్షించేవారు ఎవరూ లేరే! ఆ స్వామికి ఏమి హాని కలుగుతుందో! ఏమో! అని ఆళ్వార్లు అస్థానే భయశంకను పొందగా, దానిని చూచి భగవంతుడు "ఆళ్వార్లూ! నన్ను రక్షించడానికి ముముక్షువులు, నిత్యులు, ముక్తులు ఉన్నారు. నాకు ఏ కొరతా లేదు. ఎందుకు వ్యర్థంగా భయపడుతున్నారు. భయపడకండి" అని అన్నారు. అప్పుడు ఆళ్వారులు ఈ విధంగా సమాధానపడాన్ని ఈ దశకం తెలుపుతున్నది. ఇందులో మొదట **"ఆళుమాళార్ ఆళియుమ్ శంగమ్ శుమప్పార్ తామ్ వాళుమ్ విల్లుమ్ కొండు పిన్ శెల్ వార్ మట్రిల్లై"** (భగవంతుని రక్షించేవారు ఎవరూ లేరు. సుదర్శనాన్ని, శంఖాన్ని ధరించేవారు, కత్తిని, విల్లును తీసుకొని వెంట వెళ్ళేవారు ఎవరూ లేరు) అనే పాశురాన్ని గమనించినప్పుడు అతిశంకతో భయపడినట్టు తెలుస్తుంది. తరువాత **"కలక్కమిల్లా నల్ తవమునివర్ కరైకండోర్ తుళక్కమిల్లా వానవర్ ఎల్లామ్ తొழுవార్ కళ్"** (నిత్యులు ముక్తులు, ముముక్షువులు మంగళాశాసనం చేస్తారు) అనే పాశురాన్ని గమనించినప్పుడు ఒక విధంగా సందేహం తీరి సమాధాన పడినట్టు తెలుస్తున్నది.

# 74)అష్టమ శతకం-చతుర్ధ దశకం

# # వార్కడావరువి

"భగవంతుడు ఈ సంసార మండలంలోకి వచ్చి అవతరించి ఒంటరిగా సంచరిస్తున్నాడు. సంసారులు తమ తమ కోరికలను ఆ స్వామి వల్ల పొంది అతనిని విడిచి వెళ్ళిపోతున్నారు తప్ప, అతనికి మంగళాశాసనం చేసేవారు ఎవరూ లేరే! ఇతనికి ఏమి ప్రమాదం వస్తుందో ఏమో!" అని భయపడిన ఆళ్వారుల భయం గడచిన దశకంలో ఒక విధంగా తీరినప్పటికీ, ఇంకా నా విషయంలో ఉండే ప్రేమాధిక్యం చేత మళ్ళీ వారికి భయం కలుగ వచ్చు –అని భగవంతుడు తలచాడు. "ఆళ్వారులూ! శత్రువులు ఎవరూ ప్రవేశించడానికి వీలు లేని రీతిలో రక్షణ కలిగిన, ప్రాకారాలను కల 'తిరుచ్చెంగున్నూరిల్ తిరుచ్చిట్రాఱు' అనే దివ్యదేశంలో గొప్ప శక్తిమంతులైన మూడువేల మంది వైదికులు చాలా ప్రేమతో రక్షిస్తూ ఉండగా వారితో కలసి నేను వేంచేసి ఉన్నాను. చూడండి. నాకు అసాధారణమైన వీర్య పరాక్రమ గుణ సమృద్ధి కూడా ఉన్నది. చూడండి" అని భగవంతుడు వాటిని దర్శింప చేయగా, దానివల్ల భయం పూర్తిగా తీరి, ఆ స్వామి రూప సౌందర్యంలో మనసు నిలిపి, ఆనందించి తమ ఆనందాన్ని ఈ దశకంలో ఆళ్వారులు తెలియజేస్తున్నారు. శ్రీవిభీషణుడు శ్రీరామచంద్రుని చరణాలలో శరణు పొందగా, "ఇతనిని దగ్గరకు చేర్చుకుంటే శ్రీరామునకు ఏమి ప్రమాదం కలుగుతుందో" అని సందేహపడిన సుగ్రీవుడు మొదలైన వారికి భయం తీరే విధంగా **"పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, అంగుళ్యగ్రేణ తాన్ హన్యాన్ ఇచ్ఛన్ హరిగణేశ్వర"** (ఓ సుగ్రీవా! ఈ లోకంలోని పిశాచాలను, దానవులను యక్షులను,



శ్రీ దేవాదిదేవ పెరుమాళ్ - తిరుచెంగున్నూర్

రాక్షసులను నేను వధించాలని అనుకుంటే నా కాలి బొటన-వేలితోనే సంహరించగలను సుమా!) అని పలికి తన శక్తిని శ్రీరాముడు పోగొట్టినట్లే-ఇదికూడా. ఈ విధంగా భగవంతుడు తన శక్తిని చూపించగా భయం తీరి సుగ్రీవుడు ఆనందించినట్లే ఆళ్వార్లు కూడా ఇక్కడ ఆనందిస్తున్నారు.

## 75)అష్టమ శతకం-పంచమ దశకం

## # మాయ కూ్కత్తా

పూర్వం "**అంగుమ్ ఇంగుమ్**", "**వార్ కడావరువి**" అనే రెండు దశకాలలో భగవంతుని రక్షణ కోసం ప్రయత్నంచేసి భగవంతుడు పలికిన మాటల వల్ల ఆళ్వారులు సమాధానాన్ని

పొందారు. "**వార్కడావరువి**" అనే దశకంలో "**తిరుచ్చెయ్య కమలక్కణ్ణుమ్ శెయ్య వాయుమ్ శెయ్య వడివుమ్ శెయ్య కైయుమ్ కమల ఉందియుమ్ శెయ్య కమలై మార్బుమ్ శెయ్య వుడైయుమ్ ఎన్ శిందైయుళానే**" (అందమైన తామర వంటి నేత్రాలు, అందమైన ఆధరం, అందమైన రూపం, అందమైన చేతులు, లక్ష్మి ఉండే వక్షస్సు, దివ్యాయుధాలు అన్ని నా మనసులో ప్రకాశిస్తున్నాయి) అని ఆళ్వార్లు తమ మనసులో,



శ్రీ గోవర్ధనగిరిధారి పెరుమాళ్- వడ(ఉత్తర) మధుర

శరీరంలో ఉబ్బి తబ్బిబ్బు అయ్యేటట్లు అనుసంధించిన భగవంతుని అందం వారి మనసులో గట్టిగా వేరు ఊనుకొని ఉన్నందున, ఆ అందాన్ని కళ్ళారా దర్శించి, బాహ్య సంశ్లేషం పొందాలనే కోరిక వారికి కలిగింది. కాని ఆ విధంగా పొందలేక పోయినందున, "ఇంతకుముందు అనేక దశకాలలో పడిన క్లేశం అంతా దీనికి సరిపోదు, అన్ని క్లే శాలలో ఇది సాటిలేనిది"–అనే విధంగా చాలా బాధపడి, దావాగ్నిలో పడినట్లుగా తాపాన్ని పొందారు. వారి కంటే ఎక్కువ తాపాన్ని వారి ఇంద్రియాలు

పొందాయి. నా తాపం అంతా తీరేవిధంగా దివ్యావయవాలతో వేంచేయాలి. అందమైన కిరీటాన్ని కలిగినవాడవై రావాలి. అందమైన రూపంతో రావాలి. మేఘం వచ్చినట్లు రావాలి. ఉదయ కాలంలో సూర్యుని వలె గొప్ప ప్రకాశంతో రావాలి" అని ఈ విధంగా అర్థించారు. ఇంకా అతడు వచ్చి దర్శనాన్ని అనుగ్రహించ-నందున "నేను ఈ బాధతోనే ముగిసి పోవాలి, అంతే కదా" అనే అతృప్తితో ఈ దశకాన్ని ఆళ్వార్లు ముగిస్తున్నారు.

## 76)అష్టమ శతకం-షష్ఠ దశకం

## # ఎల్లైయుమ్ కాలైయుమ్

గడచిన **"మాయ కూ్కత్తా"** అనే దశకంలో ఆళ్వార్లకు కలిగిన తాపం మాటలకు అందనిది–అని మనం తలుస్తున్నాం. నిజానికి ఆళ్వారుల విషయంలో భగవంతునకు ఉన్న ఆర్తి అంతకంటే చాలా అపరిమితమైనది. "ఈ విధంగా ప్రార్థించే ఆళ్వార్లకు సహాయపడ లేకుండా ఉన్నాను" అని అతడు చాలా బాధపడి మనసులో ఆకులుడై లజ్జను కూడా పొందాడు. "ఇక నేను ఏమి చెయ్యాలి?" అని ఆలోచించాడు. "వెంటనే వెళ్లి నేను వేగంగా ఆళ్వార్లకు నా దర్శనాన్ని అనుగ్రహిస్తే ఆ సంతోషాతిశయాన్ని వారు తట్టుకోలేరు. అందువల్ల ఆ సంతోషం వారికి వంటపట్టేటట్లు చేయాలి" అని నిశ్చయించుకున్నాడు. 14 సంవత్సరాలు విరహంతో బాధపడిన భరతుని ప్రాణంతో నిలువ కలిగేటట్లు చేసి, తన దర్శనాన్ని ఇవ్వడం కోసం హనుమంతుని ద్వారా వార్తలు పంపి ముందుగానే తన రాక తెలియజేస్తూ తాను భరద్వాజ మహర్షి ఆశ్రమంలో ఉన్నట్లే, పాండవుల కోసం దూతగా పోయినప్పుడు తన పట్ల ఎంతో ప్రేమను కలిగిన విదురుడు మొదలైనవారికి తన రాక

వల్ల కలిగే సంతోషం వారికి వంట పట్టేటట్లు చేయడం కోసం **"కుశస్థలే నివసతి స చ ప్రాతరిహేష్యతి"** (కృష్ణుడు కుశస్థలిలో



**శ్రీ అమృతనారాయణ పెరుమాళ్ - తిరుక్కడిత్తానమ్**

ఉన్నాడు. పొద్దున ఉదయాన్నే ఇక్కడకు వస్తాడు) అనే విధంగా కుశస్థలిలో విడిది చేసి మరునాడు హస్తినాపురానికి వచ్చినట్లే, ఆళ్వార్లతో సంశ్లేషించాలని భావించిన భగవంతుడు దానివల్ల వారికి కలిగే సంతోషం వారికి వంటపట్టేటట్లు చేయడంకోసం 'తిరుక్కడిత్తానమ్' అనే దివ్యదేశంలో వేచి ఉన్నాడు. దీనిని తెలిసిన అళ్వార్లు ఈ విధంగా భగవంతుడు తమ విషయంలో చూపించే వ్యామోహాన్ని అనుసంధించి ఆనందించి ,ఆ ఆనందాన్ని ఈ దశకంలో తెలుపుతున్నారు.

# 77)అష్టమ శతకం-సప్తమ దశకం
# # ఇరుత్తుమ్ వియందు

గడచిన దశకంలో ఆళ్వారులు తాము కోరిన ప్రాప్యాన్ని పొంది ఆనందించే విధానం చాలా విలక్షణమైనది. ఈ విషయంలో ఈ దశకంతో సాటి వచ్చే దశకం వేరొకటి తిరువాయ్ మొழி ప్రబంధంలో లేదు-అని చెప్పవచ్చు. భగవంతుని పొందడంలో ఆళ్వార్లకు ఉండే ఆశ అధికమా? లేక వారిని పొందడంలో భగవంతునకు ఉండే ఆశ అధికమా?అనే విషయాన్ని గమనించి చూస్తే, భగవంతుని ఆశే అధికం అని తెలుస్తుంది. "**జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్**" (జ్ఞాని అయినవాడు నాకు సాక్షాత్తూ ఆత్మ) అని, "**వాసుదేవః సర్వ మితి స మహాత్మా సుదుర్లభః**" (వాసుదేవుడే అంతా అని తలచే మహాత్ముడు దొరకడం చాలా అరుదు) అని పలికే భగవంతుని మాటలను గమనిస్తే ఒక చేతనుని పొందడం భగవంతునకు ఎంతో లాభంగా ఉంటుంది కదా. ఆళ్వారులను పొందడం భగవానునకు పరమ లాభం గనుక, దానికి తగినట్లు కృషి చేసేవాడు అతడే గనుక, అతడు కూడా ఆళ్వారుల ఆర్తిని శాసనంగా తలచి సహాయ పడేవాడు గనుక, తానే స్వయంగా సంశ్లేషించడం కోసం అర్థించేవాడై , స్వయంగా వచ్చి కలిశాడు. దీనిని చూసిన ఆళ్వార్లు "ఆహా! నాతో కలవడానికి భగవంతుడు అర్థించేవాడై ఉండగా, నేను అర్థిస్తూ ఉన్నానే!" అని బాధపడి, "ఒక సంసారి జీవుని విషయంలో భగవంతుడు చూపించే కృప ఎంత గొప్పది!" అని ఆశ్చర్యపడుతూ ఈ దశకంలో తమ ఆనందాన్ని తెలుపుతున్నారు.

# 78)అష్టమ శతకం-అష్టమ దశకం

# # కణ్గళ్ శివందు

"**మాయ కూ్కత్తా**" అనే దశకంలో ఆళ్వార్ల ఆర్తి అపరిమితంగా ఉన్నది. ఆ ఆర్తి అంతా తీరేవిధంగా భగవంతుడు వచ్చి వారితో సంశ్లేషించాడు. అందువల్ల ఆ స్వామి ఆర్తి కూడా తీరింది. గొప్ప సంతోషం ఆ స్వామికి కూడా కలిగింది. గడచిన దశకంలో ఆళ్వార్లు తాము పొందిన పరమానందాన్ని ప్రస్తావించేటప్పుడు "**శిఱియేనుడైయ శింద్రైయుళ్**" (చాలా చిన్నవాడను అయిన నా మనసులో) అని అన్నారు కదా. ఆ మాటను భగవంతుడు చాలా గమనించి ఆలోచించాడు. "అయ్యో! వీరు తమను 'చాలా చిన్నవాడిని' అని అంటూ నైచ్యాన్ని అనుసంధించడం ఆరంభించారే! ఇంతకుముందే "వళవేழுళకు" అని దశకం మొదలైన చోట్ల వ్యక్తమై ఒక విధంగా సమసిపోయిన నైచ్యానుసంధానం మళ్లీ తల ఎత్తింది కాబోలు. ఇది ఇంకా ముదిరిపోతే తర్వాత దీనిని పోగొట్టడం చాలా కష్టమవుతుంది. అందువల్ల ఇప్పుడే దీనిని సమూలంగా పోగొట్టాలి" అని తలచి దానికి కారణంగా భావించిన ఆత్మవస్తువు యొక్క గొప్పతనాన్ని వీరి మనస్సులో పడేటట్లు చేయాలి–అని భావించి, ఆ పని చేయడం ఆరంభించాడు. ఆ పని చేసేటప్పుడు "మీ ఆత్మ స్వరూపం ఎటువంటిదో తెలియజేస్తాను చూడండి" అంటే, "మిణుగురు పురుగువలే అల్ప ప్రకాశంగా ఉండే దీనిని నీవు తెలియజేయాలా? నేను తెలుసుకోవాలా?" అని వీరు అంగీకరించకపోవచ్చు. ఇంతేకాక, "**అవ్వాయన్ని యానటియేన్ మఱ్ఱరుళే**" (భగవంతుడు ఉండే ఆ ప్రకారాన్ని తప్ప వేరు దీనిని నేను తెలియను) అని వీరు నారూప సౌందర్యంలో చాలా ఆసక్తి కలిగినవారు కనుక, నన్ను ముందుంచుకుని ఆత్మ స్వరూప

వైలక్షణ్యాన్ని చూపిస్తాను" అని భగవంతుడు భావించాడు. "ఆళ్వార్లూ! రండి నా రూప సౌందర్యం ఎటువంటిదో చూశారా! నన్ను చూసేటప్పుడు మీ ఆత్మ స్వరూపాన్ని కూడా గమనించ-వచ్చు సుమా!" అని పలికి, తన రూప సౌందర్యాన్ని ముందుగా వారికి అనుభవింపజేసి, తనకు దివ్యాభరణం వలె చాలా భోగ్యంగా, శేషంగా ఉండే ఆత్మస్వరూపాన్ని తెలియజేయగా, దానిని అనుసంధించి, ఆళ్వారులు ఇందులో ఆనందంగా పలుకు-తున్నారు.

## 79)అష్టమ శతకం-నవమ దశ కం

## # కరుమాణిక్క మలై

ఈ దశకం సఖీ వచన రూపంగా ఉన్నది. తిరువాయ్ మొழி ప్రబంధంలో చెలికత్తె వచనాల గా కనిపించే దశకాలు 3. అవి– **"తీర్ పార్రై యామిని"**, **"తువళిల్ మామణిమాడమ్"**, అనే దశకాలు, ఈ దశకం. ఈ మూడు దశకాలలోను ఓంకారంలో ఉండే ఉకారంయొక్క అర్థమైన అనన్యార్హశేషత్వం వ్యక్తమవుతున్నది . **"తీరార్రై యామిని"** అనే దశకంలో దేవతాం- తర భజనాన్ని నిరసించడం ద్వారా అది తెలియజేయబడింది. **"తువళిల్ మా మణిమాడమ్"** అనే దశకంలో **"ఒని ఉమక్కాశై యిల్లై విడుమినో"** (ఇక మీకు ఆశ లేదు విడిచిపెట్టండి) అని పలుమార్లు తల్లిని చూసి పలకడం ద్వారా అది వ్యక్తం చేయబడింది. ఇప్పుడు ఈ దశకంలో ఆ విషయం ఏ విధంగా తెలియజేయబడుతున్నదో చూడండి.. పరాంకుశనాయకికి పతి సంయోగానికి తగిన వయస్సు ముదిరి పరిణతి చెందడం చూచి ఆమె తల్లి, తండ్రి ఆమెకు స్వయంవరం ప్రకటించి నగరంలో పెళ్లి బాజా మోగించారు. దీనిని

చూచిన చెలికత్తె "**మానిడవఱ్కెన్ఱు పేచ్చుప్పడిల్ వాழకిల్లేన్**" (మానవులకు నన్ను ఇచ్చి వివాహం చేస్తాను అనే మాట వినబడితే




**శ్రీ మాయప్పిరాన్ - కుట్టనాట్టు తిరుప్పులియూర్**

నేను బ్రతకలేను) అని, "**అణ్ణిప్పిన్ మఱ్ఱొరువర్ క్కుఎన్ఱు పేశలొట్టేన్ మాలిరుమ్ శోలై ఎన్నల్లాల్**" (వనగిరిలో ఉండే సుందరబాహుస్వామికి తప్ప నన్ను ఇంకొకరికి ఇచ్చి వివాహం చేస్తాను అనే మాటను నేను సహించలేను) అని ఈ విధంగా చాలా గట్టి నిర్ణయాన్ని కలిగిన నాయిక ఇప్పుడు ఈ విధంగా ఈమె తల్లిదండ్రులు చేసే వివాహ ప్రయత్నాలను తెలిస్తే చాలా బాధపడుతుందే" అని మనసులో చింతించింది. ఈ నాయికకు 'తిరుప్పులియూర్' అనే దివ్య దేశంలో వేంచేసి ఉండే స్వామితో కల సంబంధాన్ని గురించి తనకు తెలిసినా, దానిని స్పష్టంగా తల్లికి తెలిపితే నా మీద కూడా కోపం వస్తుంది, అది తెలుపకకపోతే నాయిక కూడా లజ్జ వల్ల ఈ విషయాన్ని చెప్పలేక ఊరికే ఉండి పోతుంది. కనుక విపరీతమైన పరిణామం ఏర్పడి అనర్థానికి

దారితీస్తుంది. అందువల్ల ఇప్పుడు ఒక మంచి ఉపాయాన్ని ఆలోచించి ఇవ్వాలి. నాకు ఇంతకు ముందే ఏమీ తెలియనట్లుగా ప్రవర్తిస్తూ, ఇప్పుడే నాయికను గమనించి తెలుసుకున్నట్లుగా పలుకుతూ, ఒక విధంగా వాస్తవాన్ని వీరికి తెలియజేస్తాను" అని అనుకున్నది. తరువాత నాయిక తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లి, "అమ్మలారా! మన కుమార్తె పరిస్థితిని గమనించినపుడు ఈమెకు 'తిరుప్పులియూర్' అనే క్షేత్రంలోని స్వామితో కలయిక ఏర్పడినట్లు తెలుస్తున్నది. మీరు ఈ విధంగా వివాహ ప్రయత్నాన్ని చేయడానికి తగిన ప్రసక్తి లేనట్లు కనిపిస్తున్నది" అని మధ్యస్థవచనాలను పలికింది. ఈ రీతిగా ఇక్కడ ఆళ్వార్ల అనన్యార్హశేషత్వం వ్యక్తం చేయబడింది. గడచిన దశకంలో ఆత్మ స్వరూప వైలక్షణ్యంశోధింపబడినందున అది ఇక్కడ బాగా వడగట్టబడు-తున్నది అని గ్రహించాలి.

## 80)అష్టమ శతకం-దశమ దశకం

## # నెడుమాఱ్కడిమై

గడచిన దశకంలో ఆత్మ యొక్క అనన్యార్హ శేషత్వం నిష్కర్షింపబడింది కదా. ఈ ప్రసంగంలో భాగవత శేషత్వం అనేది వడగట్టిన శేషత్వంగా చెప్పవలసినది ఉన్నది కదా. అది ఇక్కడ ఈ దశకంలో చెప్పబడుతున్నది. గడచిన దశకంలోని చివరి పాశురంలో "**తొండర్ తొండర్ తొండర్ తొండన్ శడగోపన్**" (భగవంతుని దాసులకు దాసులకు దాసులకు దాసులకు దాసుడను) అని ఆళ్వార్లు అన్నారు కదా. ఆ విషయం ఈ దశకంలో విశదీకరింపబడుతున్నది. ఒకడు ఒక వస్తువు (వ్యక్తి) విషయంలో ప్రేమను కలిగి ఉంటే, ఆ ప్రేమ అంతులేనిది ఉన్నప్పుడు, ఆ ప్రేమ అ వస్తువు వరకే పరిమితం కాకుండా, దానితో సంబంధం

కల, దానితో సంబంధం కల (పరంపరగా సంబంధం కల) వస్తువులలో అన్నిటిలోనూ ప్రస- రిస్తుంది అనే విషయం అందరూ తమ తమ అనుభవంలో తెలిసికొనే విషయమే. ఈ విధంగానే భాగవత భక్తి అనేది భగవద్భక్తి యొక్క పర్యంత సీమగా పరిణమిస్తుంది. భగవద్భక్తి అతిశయించినప్పుడు అది భాగవతభక్తిగా వ్యక్తమవుతుంది. స్వామిపాదుకలలో మనం ఆదరాన్ని కలిగి ఉండి, వాటిని కంటికి అద్దుకోవడం, తలమీద అలంకరించుకోవడం, వాటిని అభిషేకించి ఆ తీర్థాన్ని గ్రహించడం చేస్తున్నాము. ఇందువల్ల మనకు ఆ యజమాని విషయంలో ఉండే భక్తి అపారమైనది అనే విషయం తెలుస్తున్నది కదా. ఆ విధంగానే ఇక్కడ కూడా "**అవనడియారడియే కూడుమిదువల్లాల్**" (ఆ భగవంతుని భక్తులతో కలవడం జరిగితే) ఇత్యాది సూక్తులతో తెలుపబడిన భాగవతశేషత్వంలోని అతిశయం అంతా భగవచ్ఛేషత్వంలోని అతిశయాన్ని తెలిపినట్లు కాగలదు. అష్టాక్షరిలో – అహంకారం, మమకారం పోయి, భగవచ్ఛేషత్వం యథాతథంగా ప్రకాశించే నమస్సులో ఆ భగవచ్ఛేషత్వం యొక్క చివరి సీమ అయిన భాగవతశేషత్వం అనుసంధింపబడాలి - అనేది శాస్త్రార్థం. అష్టాక్షరీలోని ముఖ్యమైన అర్థం భాగవతశేషత్వమే అనే ఈ విషయం 'పెరియ తిరుమొழி' ప్రబంధంలోని "**నిన్ తిరువెట్టెழுత్తుమ్ కఱ్ఱు నానుఱ్ఱదు ఉన్ అడియాఱ్కడిమై**" (ఈ అష్టాక్షరిని గ్రహించిన నేను తాత్పర్యం ఏమని తెలిసికొన్నాను? అంటే, భాగవత శేషత్వమే) అనే పాశురంలో తెలుపపడుతున్నది. పూర్వం మూడవ శతకంలోని "**పయిలుమ్ శుడరొళి**" అనే ఏడవ దశకం స్వరూప ప్రతిపాదక పరం అనే విధంగా సమన్వయం చేయబడింది. అక్కడ వ్యాఖ్యానంలో మణవాళమహాముని "**భగవచ్ఛేషత్వత్తిలుమ్ తత్కాష్ఠైయాన భాగవతశేషత్వమే ఆత్మావుక్కు ఉద్దేశ్యమెన్ఱు ప్రతిపాదిత్త 'పయిలుం శుడరొళియుమ్'**

**భాగవతకైంకర్యపర్యంతమాకవేణుమెన్ను మనోరథిత్త' నెడుమాఱ్కడిమైయుమ్**' (భగవత్ శేషత్వం కంటే దానికి పరాకాష్ఠ అయిన భాగవత శేషత్వమే ఆత్మకు తగినది అని తెలిపే "**పయిలుమ్ శుడరొళి**' అనే దశకం, భాగవత కైంకర్యంవరకు కొనసాగాలి అని కోరే '**నెడు మాఱ్కడిమై**' దశకం) అని పలకడం గమనించవచ్చు. ఇందువల్ల భాగవతశేషత్వం ఆత్మ స్వరూపం అనడంలో '**పయిలుమ్ శడరొళి**' అనే దశకానికి దృష్టి ఉన్నది, భాగవత కైంకర్యమే పురుషార్థం అనే విషయంలో దృష్టి ఈ దశకంలో ఉన్నది–అని తెలిపినట్లు అయినది. ఈ దశకానికి చెందిన ఈడు అవతారికలో ఒక ఐతిహ్యం కనిపిస్తున్నది. అది ఏమంటే – 'అమ్మంగి ఆళ్వాన్' అనేవారు పోసల (కర్ణాటక)రాజ్యం నుండి వచ్చిన సమయంలో, భట్టర్ వారితో "నీవు శ్రీవైష్ణవులకు చాలా కైంకర్యం చేశావు అని విన్నాను. నీ ప్రకృతికి తగినట్లు నేను '**నెడుమాఱ్కడిమై**' దశకం వివరిస్తాను, విను" అని అన్నారట– అనేది ఆ ఐతిహ్యం.



నమ్మాళ్వార్ - ఆళ్వార్ తిరునగరి

# 81)నవమ శతకం-ప్రథమ దశకం

# # కొండ పెండిర్

ఇంతకుముందు **"నెడుమాఱ్కడిమై"** అనే దశకంలో భగవత్ భక్తులను ఉపాయోపేయాలుగా ఆశ్రయించడం అనే తమ గొప్ప అధ్యవసాయాన్ని ఆళ్వార్లు వ్యక్తం చేశారు. భక్తుల మనసు ఆనందించే అర్థాన్ని ఈ దశకంలో పలుకుతున్నారు. భాగవతులతోనే అన్ని సంబంధాలు అని అనడం గత దశకంలోని విషయం. భగవంతునితోనే అన్ని విధాలైన సంబంధాలు అనేది ఈ దశకంలోని విషయం. ఇవి ఒకదానికి ఇంకొకటి విరుద్ధం అని భావించనక్కరలేదు. భగవద్భక్తి లోని చరమావధి భాగవత భక్తి. ఆ విధంగానే భాగవతభక్తి యొక్క చరమావధి భగవద్భక్తి అని తెలియాలి. లోకంలో ఒక వ్యక్తి విషయంలో మనం కలిగి ఉండే ప్రీతి ఆ వ్యక్తి వరకే నిలువకుండా, అతనితో సంబంధం కలిగినవారివరకు అది కొనసాగుతుంది. ఆ విధంగానే భగవంతుని విషయంలో కలిగి ఉండే భక్తి అతని వరకే కాకుండా, అతనితో సంబంధం కలిగినవారు, వారితోసంబంధం కలిగినవారివరకు కొనసాగుతుంది. ఆ రీతిలోనే భగవత్ భక్తుల విషయంలో కలిగి ఉండే వ్యక్తి వారితో సంబంధాన్ని పొందిన ఈ కారణంచేత భగవంతుని వరకు కొనసాగుతుంది. పరాశర భట్టర్ 'శ్రీగుణరత్న కోశం' అనే స్తోత్రంలో **"జామాతా దయిత స్తవేతి భవతీ సంబంధ దృష్ట్యా హరిం పశ్యేమ"** (అమ్మా! నీకు వల్లభుడు అనే దృష్టితోనే మేము భగవంతుని దర్శిస్తాము) అని అనడం ఇక్కడ అనుసంధించాలి. లక్ష్మీదేవికి నాథుడనే కారణాన్ని పురస్కరించుకుని మనం భగవంతుని ఆధరిస్తున్నాము – అని దీని భావం. ఇవి పరస్పరము ఒకదానికి ఒకటి వ్యతిరేకమైనవి కావు. రెండూ పరమార్థాలే. ఈ విధంగానే భగవంతుని సంబంధాన్నిబట్టి

భాగవతులను ఆదరించడం, భాగవతుల సంబంధాన్నిబట్టి భగవంతుని ఆదరించడం తగినది కనుక, గడచిన దశకంలో పలికి అర్థానికి విరుద్ధం కాకుండానే ఈ దశకంలోని అర్థం కొనసాగుతున్నది-అని తెలియాలి. లోకంలో ప్రాకృత సంబంధం కలిగిన ఆభాస బంధువులను నమ్మినవారి భ్రమ తొలగేటట్లుగా తగిన ఉపపత్తులతో ఈదశకం తెలుపుతున్నది. ఏ దశలో అయినా భగవంతుడు ఒక్కడే నిరుపాధికరక్షకుడు అని, మనం బంధువులు అని భావించేవారంతా భక్షకులే తప్ప రక్షకులు కాదని విస్తృతంగా అళ్వార్లు ఇందులో తెలుపుతున్నారు. ఇంతకుముందు అయిదవ శతకంలోని "**శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తంద్రైయుమ్ ఆవరే ఇనియావారే**" (అందమైన భార్యలు, గొప్ప సంపద, మంచి సంతానం, తల్లీ, తండ్రి, ఇంకా అందరూ బంధువులు ఆ భగవంతుడే) అనే పాశురంలో చెప్పినది ఇక్కడ వివరింపబడుతున్నది . "**ఈశ్వరనై ఒళిన్దవర్ కళ్ రక్షకరల్లరెన్టుమిడమ్ ప్రపన్నపరిత్రాణత్తిలే శొన్నోమ్" (**భగవంతుని కంటే వేరయినవారు ఎవ్వరూ కూడా రక్షకులు కాదు అనే విషయాన్ని ప్రపన్న పరిత్రాణం అనే గ్రంథంలో చెప్పాను) అని ‘ముముక్షుప్పడి’ అనే గ్రంధంలో పలికినట్లుగా ‘ప్రపన్న పరిత్రాణం’ అనే గ్రంధంలో తెలుపబడిన అర్థాలకి ఈ దశకమే ఆధారం. ఈ దశకంలో పలు పాశురాలలో "**వడమదురై ప్పిఱన్ద**" అని వస్తున్నందున ఉత్తరమధురా-క్షేత్రానికి మంగళాశానం చేసే దశకం ఇది-అని కూడా చెప్పవచ్చు. ఇంకొక విశేషం ఏమంటే, ఇందులో పరోపదేశం చేయబడింది.

# 82)నవమ శతకం-ద్వితీయ దశకం

# # పండై నాళాలే

సర్వేశ్వరుని కంటే వేరైన వారెవ్వరూ బంధువులు కారు. వారంతా ఆభాస బంధువులు. భగవంతుడొక్కడే నిజమైన బంధువని గడచిన దశకంలో ఆళ్వార్లు పలికారు. ఆళ్వార్లు చెప్పడమే కాదు, నిజానికి వేదం కూడా భగవంతుని సర్వవిధ బంధువుగా పలికింది. **"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః"** అని వేదం చెప్పిన మాట అబద్ధం కాదు కదా. "ఆ విధంగా పరమ బంధువు అయిన భగవంతుడు బంధువులు చేయవలసిన పనిని వేయకుండా ఉండడు కదా. ఆ పనిని చేయడానికి తగినట్లు 'తిరుప్పుళింగుడి' అనే క్షేత్రంలో



శ్రీ భూమిపాలక పెరుమాళ్ - తిరుపుళింగుడి

ఉన్నాడు. నేను కూడా అక్కడకు వెళ్లి సేవిస్తే, నాకు బంధువులు చేయవలసిన కృత్యాలను అన్నిటినీ తప్పక చేస్తాడు" అని భావించి ఆళ్వారులు ఆ దివ్యదేశానికి వెళ్లారు. ఆ విధంగా పరమ

బంధువై ఉండేవాడు వేంచేసి ఉండే క్షేత్రం అయిన తిరుప్పుళింగుడిలో అన్ని విధాలైన సేవలను చేయాలని ఆళ్వార్లు ఆశపడ్డారు. అయినా, ఆ స్వామి వీరిని చూచి పలకరించడం కానీ, చల్లగా చూడడం కానీ, ఒక మాట మాట్లాడడం కాని ఏమీ చేయలేదు. అయినప్పటికీ, "**ఇన్హాక నాళైయేయాక ఇని చ్చిఱిదు నిన్హాక నిన్నరుళ్ ఎన్ పాలదే**" (ఈనాడు కానీ రేపు కానీ ఇంకా కొంచెం సేపు అయిన తరువాత ఎప్పటికైనా నీ కరుణ నేను పొందాలి) అనే రీతిలోని గట్టి నమ్మకాన్ని కలిగినవారు కదా, వీరు, అందువల్ల "సర్వవిధ బంధువైన భగవంతుడు వేంచేసి ఉన్నప్పుడు అతడు బంధుకృత్యాన్ని చేయక మానడు. కొంచెం ఆలస్యం చేస్తే ఏమి కొరత?" అని ఒక విధంగా ఊరట చెందారు, ఆళ్వార్. అయినా వారికి ఇంకొక విధమైన ఆర్తి మనసులో కలిగినది. అది ఏమంటే – ఏనాడు ఈ క్షేత్రానికి వచ్చి ప్రయత్నించాడో అప్పటినుండి ఈనాటి వరకు ఒకే విధంగా కదలకుండా మెదలకుండా పరుండి ఉన్నాడే! ఈ స్వామికి ఎంత శ్రమ కలిగిందో ఏమో - అని ఆర్తి వాళ్ళ మనసులో కలిగింది. ఇంతకుముందు ఎనిమిదవ శతకంలో "**కొడియార్ మాడ కోళూరకత్తుమ్ పుళింగుడియుమ్ మడియాదిన్నే నీ తుయిల్ మేవి మమకిఝ్ర న్దదుదాన్ అడియారల్లల్ తవిర్ త్త అశైవో అన్టేల్ ఇప్పడితాన్ నీండు తావియ అశైవో పణియాయే**" (స్వామీ! నీవు అందమైన పతాకలను కలిగిన భవనాలతో కూడి ఉండే తిరుక్కోళూరు, ఆ విధంగానే తిరుక్కుఱుంగుడి అనే దివ్యదేశాలలో కదలకుండా పరుండి ఉన్నావే! ఏమి కారణం? భక్తుల ఆర్తిని తీర్చినందు వల్ల కలిగిన శ్రమ వలననా? లేక, చాలా దీర్ఘంగా లోకాలను కొలిచిన శ్రమవలననా? చెప్పు) అనే పాశురంలో కలిగిన ఆస్థానే భయశంక మళ్లీ తలఎత్తింది. ఈ గొప్ప ఆర్తితో "స్వామీ! నీవు, లక్ష్మీదేవి కలసి వేంచేసి ఉండే సన్నివేశాన్ని నాకు దర్శింప చేయాలి. నన్ను చూడగానే సంతోషంతో నా ముందుకు వచ్చి నాలుగు అడుగులు పెట్టాలి. చిరునవ్వు నవ్వాలి. ఒక మంచి

మాటను పలకాలి" అని ఈ విధంగా తమకు మాత్రమే తెలిసిన రీతిలో వాకిటి తలుపులు మూసి ఏకాంతంలో తమ కోరికలను అన్నిటిని ఆళ్వారులు ఈ దశకం విన్నవిస్తున్నారు. ఈ దశకంలోనే అర్థ స్వారస్యం ఒక విధంగా ఉండనివ్వండి. శబ్దంలోని మాధుర్యం రాతి గుండెను కూడా కరగించే విధంగా ఉన్నది. ఈ సంసార మండలంలో బాధను పొంది, మనసు తడబడి నప్పుడు ఈ దశకంలోని పాశురాలను నోరారా పలికితే మనసు శాంతిని పొందుతుంది. సుమారు 40 సంవత్సరాల ముందు నేను శ్రీరంగ క్షేత్రానికి వెళ్ళినప్పుడు అక్కడ ఆరైయర్ స్వాములు ఈ దశకాన్ని చాలా మధురంగా అనుసంధానం చేశారు. ఆ సందర్భంలో మా ఆచార్యులైన 'అழகియ మణవాళ జీయర్' ఆ గానాన్ని విని కన్నీరు-మున్నీరు అయిన సందర్భం ఇప్పటికీ నా కంటి ముందు మెదులుతున్నది.

## 83)నవమ శతకం-తృతీయ దశకం

## # ఓరాయిరమాయ్

గడచిన దశకంలో ఆళ్వారులు "**తొండరోర్ క్కరుళి శోదివాయ్ తిఱందు ఉన్ తామరై క్కణ్ గళాల్ నోక్కాయ్**" (భక్తులను అనుగ్రహించి ఈ అందమైన నీ నోటిని తెరిచి, మాటను పలికి, తామర వంటి కన్నులతో కటాక్షించు) అని, "**ఇడంకొళ్ మూవులకుమ్ తొழ ఇరుందరుళాయ్**" (విశాలమైన ముల్లోకాలు నిన్ను కొలిచే టట్లు వేంచేసి ఉండు) అని, "**మెల్లడియై క్కొడువినైయేన్ పిడిక్క నీ ఒరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాదే**" (పాపిష్టి వాడను అయిన నేను నీ చరణాలను ఏనాడైనా ఒక నాడు సంవాహనం చేసేటట్లు నీవు నన్ను పలకరించడం, ఆ విధంగానే దగ్గరకు రావడం చేయాలి) అని పలు విధాలుగా

ప్రార్థించారు. ఈ ప్రార్థనలను అన్నిటినీ విన్న భగవంతుడు ఆళ్వార్లను చూసి "ఆళ్వారులూ! నాకు నారాయణుడు అనే పేరు ఉన్నట్లు మీకు తెలుసా? నారాయణుడు అనే పదానికి నారాలకు ఆయనమై ఉండేవాడు అనే అర్థమే కాక, నారాలను అయనంగా కలవాడు అని అర్థం ఉన్నట్లు మీకు తెలుసా? ఆ అర్థంలో సకల చేతనాచేతనాలు నాకు శరీరమని, వాటికి నేను శరీరం అనే అంశం తెలుస్తున్నది అని కూడా మీకు తెలుసా? శరీరానికి కలిగే లాభం శరీరికి చెందుతుంది కనుక, శరీరమైన మీకు ఒక ప్రాప్యం అనేది ఉన్నదా? శరీరి అయినా నాకే కదా ఉన్నది. నా లాభానికి మీరు ప్రార్థించడం తగునా? అన్నిటినీ నేనే చేసి ముగించ గలను. మీకు, నాకు మధ్య ఉండే గర్భ సంబంధాన్ని తెలిసికొని కూడా మీరు ఈ విధంగా ప్రార్థించడం, బాధ పడడం తగినది కాదు" అని సమాధానపరచాడు. ఈ మాటలను విన్న ఆళ్వార్లు ఒక విధంగా సమాధాన పడి, ఆ విషయం ఇందులో వ్యక్తం చేస్తున్నారు. అంతేకాక "భగవంతుని శీల గుణంఎంత గొప్పది!" అని కూడా భగవంతుని శీలంలో అభినివేశంతో ఆ విషయాన్ని కూడా ఇందులో తెలుపుతున్నారు.

ఈ దశకానికి వేరే విధంగా కూడా ఈడు వ్యాఖ్యానంలో అవతారిక ఇవ్వబడింది. అది నడువిల్ తిరువీధి పిళ్లై భట్టర్ అనే పెద్దలు చేసిన నిర్వాహం. దాని సారాంశం ఏమంటే – ఇంతకుముందు ఏడవ శతకంలో **"కణ్ గళ్ శివందు"** అనే దశకంనుండి ఆరంభించి క్రమంగాఅష్టాక్షరీ మహా మంత్రార్థం తెలుపబడు తున్నది. ఇంతకుముందు ఉండే **"పండై నాళాలే"** అనే దశకంలో కైంకర్యం ప్రార్థనను చేయడం ద్వారా ఆ మంత్రంలో వ్యక్తచతుర్థి వరకు ఉండే అర్థం తెలుపబడినది. ఆ విధంగా అర్థాన్ని అనుసంధించిన ఆళ్వార్లు ఆ అర్థాన్ని కలిగిన మంత్రం అష్టాక్షరీ మహామంత్రమే అనే విషయాన్ని ఈ దశకంలో తెలుపుతున్నారు అనేది ఆ నిర్వాహం. ఈ దశకంలోని మొదటి

పాశురంలో ఉండే "**నారాయణన్ నంగళ్ పిరాన్**" అనే ప్రయోగంలో ఈ నిర్వాహం దృష్టి కలిగి ఉన్నది.

## 84)నవమ శతకం-చతుర్థ దశకం

# # మైయార్ కరుంకణ్ణి

భగవంతుడు శాస్త్రాలలో ఒక పక్క స్వతంత్రుడు అని కీర్తింపబడినట్లే ఇంకొక పక్క శీలం మొదలైన గుణాలతో ప్రకాశించేవాడు అని కీర్తింపబడుతున్నాడు. స్వాతంత్ర్యం అనే గుణం అతనికి స్వరూపం. శీలం మొదలైన గుణాలను కలిగి ఉండడం అతనికి స్వరూపమే అయినా, స్వాతంత్ర్యం అడుగున ఆ శీలాది గుణాలు పడి ఉండడం వల్ల తల ఎత్తవు. స్వాతంత్రం లోనే అణగి పోయి ఉంటాయి. అవి ఎప్పుడు తలెత్తుతాయి? అంటే, లక్ష్మి పురుషకారం చేసే ఈ సమయంలోనే అవి బయటకు వస్తాయి. ఇది మన పూర్వాచార్యులు గ్రహించి చెప్పిన విషయం. ముముక్షుప్పడి గ్రంధంలో "**పురుషకారబలత్తాలే స్వాతంత్ర్యం తలై శాయ్ న్దాల్ తలై ఎడుక్కుమ్ గుణంగళై చ్చొల్లుకిఱదు నారాయణపదమ్**" (లక్ష్మి చేసిన పురుషకారం బలంచేత భగవంతుని స్వాతంత్ర్యం తలవాల్చినప్పుడు తల ఎత్తే గుణాలను ద్వయ మంత్రంలోని నారాయణ పదం తెలియజేస్తున్నది) అనే దివ్య సూక్తిని ఇక్కడ స్మరించాలి. ఈ విధంగా గడచిన దశకంలో అనుసంధింపబడిన శీల గుణానికి మూల కారణం లక్ష్మీదేవి సంబంధం కనుక, దానిని ఆళ్వార్లు అనుసంధించారు. "**మాక వైకుందమ్ కాణ్బదఱ్కు ఎన్ మనమ్ ఏకమెణ్ణమ్ ఇరాప్పకలిన్ఱియే**" (గొప్పదైన పరమపదాన్ని సేవించాలని అని నా మనసు రాత్రి పగలు అనే తేడా లేకుండా ఎల్లప్పుడు ఆశ పడుతున్నది) అని గడచిన దశకంలో వ్యక్తం చేసిన ఆశ ఆళ్వార్లకు

అధికమైంది. అతడు గొప్ప శీల గుణాన్ని కలవాడై, లక్ష్మీపతియై ఉండి ఈ విధంగా నన్ను బాధ పెడుతున్నాడే! ఉపేక్షిస్తున్నాడే! అని చాలా బాధ పడ్డారు. గజేంద్రుని రక్షించడం కోసం చాలా వేగంగా మడుగు దగ్గరకి పరుగెత్తుకుని వచ్చినట్లు, ఆ విధంగానే, ప్రహ్లాదుని కరుణించడం కోసం కంబంనుండి ఆవిర్భవించినట్లు వేగంగా వచ్చి సహాయ పడవలసిన స్థితి వారికి కలిగింది. ఇటువంటి స్థితిలో కూడా అతడు వచ్చి తన దర్శనం ఇవ్వలేదు. అతడు చాలా గొప్ప శీలం మొదలైన గుణాలను కలవాడు అని చెప్పే మాటలు అన్ని సముద్ర ఘోష అయిపోతాయి. అతడు ఈ విధంగా తన గుణాలను వ్యర్థం చేసుకుంటున్నాడు అనే బాధ వారికి కలిగింది. దీనిని గమనించిన భగవంతుడు వారికి తన దర్శనాన్ని అనుగ్రహించాడు. అప్పుడు ఆళ్వార్లు "నేను కృతకృత్యుడు అయ్యాను. కైంకర్యం చేసికోగలిగాను. ఉజ్జీవించాను. శ్రీవైష్ణవులకు అందరికీ గొప్ప సేవను చేసుకోగలిగాను. ఇటువంటి ప్రయోజనాలను ఇక ఎవరైనా పొందగలరా!" అని పలుకుతూ తమ గొప్ప ఆనందాన్ని ప్రకటిస్తూ ఈ దశకాన్ని పలుకుతున్నారు.

## 85)నవమ శతకం-పంచమ దశకం

## # ఇన్నుయిర్ చ్చేవలుమ్

పూర్వం "**పండై నాళాలే**" అనే దశకంలో ఆళ్వార్లకు ఒక క్లేశం కలిగింది. దానిని తీర్చడం కోసం ప్రయత్నించిన సర్వేశ్వరుడు "ఆళ్వార్లూ! నేను నారాయణుడను కదా. మీకు అన్ని విధాలైన సంబంధాల వల్ల కలగవలసిన కార్యాలను ఏ లోటు లేకుండా నిర్వహిస్తాను" అని అనగా ఆ భగవంతుని శీలగుణానికి చాలా ముగ్ధులై ఒక విధంగా తమ అనుభవాన్ని ఆళ్వార్లు గత దశకంలో అనుసంధించారు. "భగవద్ భక్తులకు అమృతంవంటి

పాశురాలను పాడగలిగేటట్లుగా మిమ్ములను చేశాను కదా. ఇది మీకు సామాన్యంగా లభించే ఫలమా?" అని భగవంతుడు అనగా, దానితో ఆళ్వార్లు చాలా ఆనందించింది, తమ ప్రాణాలను నిలుపుకున్నారు, గత దశకంలో. అక్కడ "**దేవర్ కళెక్కెల్లామ్ కరువాకియ కణ్ణనై కండుకొండేన్** (దేవతలకు అందరికీ మూల కారణం అయిన స్వామిని దర్శించాను) అని పలికిన వారికి బాహ్య సంశ్లేషంలో కోరిక కలిగింది. వీరికి ఇంకా ఇంకా ఆర్తిని కలిగించిన తర్వాత నేను నా దర్శనాన్ని ఇవ్వాలి అని భగవంతుడు తలచినందున అతడు ప్రత్యక్షం కాలేదు, ఆలస్యం చేశారు. ఆ కారణం చేత ఆళ్వారుల ఆర్తి మరింత ఎక్కువ అయినది. ఆర్తి చెందినవారు ప్రాణాలను నిలుపుకోవడానికి అనేక మార్గాలు ఉన్నాయి కదా. లోకంలో కనిపించే వస్తువులలో మనసును సారించి, ఆ అన్య పరతతో ఒక విధంగా ప్రాణాలను ధరిస్తాను అని భావించి, భగవంతునితో పోలికలు కలిగిన వస్తువులను చూచి అయినా ప్రాణాలను నిలుపుకుంటామని భావించి, ఆ విధంగానే లౌకిక పదార్థాలలో ఆళ్వార్లు దృష్టిపెట్టారు. ఒక విధంగా తమ ప్రాణాలను నిలుపుకోవడానికి చేసిన ఆ ప్రయత్నం ఊరటను పొందడానికి కారణం కాకుండా భగవంతుని అవి గుర్తు చేస్తున్నందున బాధకు కారణం అయ్యాయి. లోకంలో ఏ వస్తువును చూసినా అది భగవంతుని వలెనే ఉండే రీతిని భావించి గాని, అతనితో సంబంధాన్ని కలిగి ఉన్న రీతిని భావించి కానీ, అతనికి పోలిక ఉండే స్థితిని భావించిగాని ఆళ్వార్లు బాధ పడరు కదా. గడచిన నాల్గవ శతకంలో "**మణ్ణైయిరుంతుళావి**" అనే దశకంలో పడిన బాధ తెలుసు కదా. అందువల్ల లౌకిక పదార్థాలు అతనిని గుర్తుచేసి బాధించగా, వాటి వల్ల బాధపడే రీతిని అన్యాపదేశ ప్రక్రియలో ఈ దశకం తెలియజేస్తున్నది. భగవంతునితో కలసి తరువాత అతనికి దూరమైన ఒక నాయిక తనకు కలిగిన ఆర్తివల్ల ఆ భగవంతునితో పోలిక కల వస్తువులను చూచి అయినా ప్రాణాలను

నిలుపుకుందాం—అని తలచి ఒక పూల తోటకు వెళ్ళింది. అక్కడ ఉండే కోయిల, నెమలి మొదలైనవి అతని మాటలను, రూపాన్ని గుర్తుచేసి వారిని బాధించాయి. "ఇవి స్వయంగా నన్ను బాధపెట్టేవి కావు. నన్ను అంతం చేయాలని చూచిన భగవంతుడు వీటిని ప్రేరేపించి వీటి ద్వారా నన్ను బాధ పెడుతున్నాడు. అంతే" అని భావించారు. ఆ కోకిల మొదలైన వాటిని చూచి "మీరు నన్ను బాధించాలి అనే అభిప్రాయం మీకు ఉంటే, ఇంత ప్రయత్నం కావాలా? నా ప్రాణాలను ఇవ్వడానికి నేనే సిద్ధంగా ఉన్నాను" అని పలికి, ఒక విధంగా భగవంతుని కల్యాణ గుణాలను తలుస్తూ ఆళ్వార్లు ప్రాణాలను నిలుపుకోవడం ఈ దశకంలో తెలుపబడింది.

## 86)నవమ శతకం-షష్ఠ దశకం

## # ఉరుకుమాల్ నెంజమ్

గడచిన దశకంలో చివర "**ఎళ్ళ నణ్ణీ నాముమ్ నమ్ వాననాడనోడొన్టినోమ్**" (మనం కూడా పరమపదానికి పోవాలని ప్రయత్నం చేసి, మనకు ప్రాప్యం అయిన పరమపదంలో ఉండే స్వామితో ఒకే అభిప్రాయాన్ని కలిగినవారం అయినాము) అనే సూక్తిని గమనించినప్పుడు అళ్వార్లు ఆ పాశురంతోనే తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని పూర్తి చేసినట్లు, ఇక పాశురాలను అనుగ్రహించడానికి అనువుగా ఆళ్వార్లు ఈ లోకంలో లేనట్లు అనిపిస్తుంది. అయినా, వారు ఇంకా ఈ లోకంలో చింత చెట్టు మొదటిలోనే వేంచేసి ఉండి, మిగిలిన పాశురాలను అనుగ్రహించారుకదా. అయితే, భగవంతుడు వచ్చి తన దర్శనాన్ని ఇచ్చి ఆళ్వార్లను ప్రాణాలను ధరించినట్లు చేశాడా? అందువల్ల వారు ప్రాణాలను నిలుపుని పాశురాలను పలికారా? అని అంటే, లేదు. భగవంతుడు వచ్చి దర్శనాన్ని అనుగ్రహించినప్పుడే వీరు

నిలువగలిగి ఉండడం, లేకపోతే విలువ లేకపోవడం అనే దశ వీరికి ఉన్నప్పటికిని, ఆ స్వామి వచ్చి దర్శనాన్ని ఇవ్వలేదు. ఇవ్వకుండానే ఒక ఉపాయాన్ని చేశాడు. ఆ ఉపాయం ఏమిటి? అంటే, ఇంతకుముందు ఏడవ శతకంలో **"ఇరుత్తుమ్ వియందున్నై"** అనే దశకంలో ఒక విలక్షణమైన సంశ్లేషం వీరిద్దరికీ ఏర్పడింది కదా. దానిని ఆళ్వార్లకు స్మరింప జేసి, ఒక విధంగా ప్రాణాలను వారు నిలుపుకునేటట్లు భగవంతుడు చేశాడు. అదే అతడు చేసిన ఉపాయం. దానివల్ల ఆళ్వారులు నిలువగలిగి ప్రాణాలను ధరించగలిగారు. ఈ దశకాన్ని అనుగ్రహించారు. దీనికి మూడు విధాలుగా కారణాలను ఈడు వ్యాఖ్యానంలో నంబిళ్ళై తెలియజేశారు.

1) ఆళ్వార్లు మొదటి దశకం నుండి **"కురుకూర్ శడకోపన్ శొల్ ఆయిరమ్"** (ఆళ్వారులు చెప్పిన పాశురాలు వేయి) అని భగవంతునకు వేయి పాశురాలు పలికి తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పూర్తిచేయాలని సంకల్పించినందున, ఆ సంకల్పించిన రీతిలోనే ఆ కైంకర్యాన్ని పూర్తి చేయగలిగిన అదృష్టాన్ని పొందారు.

2)ఆళ్వారుల మధురమైన పాశురాలను ఇంకా ఇంకా వినాలి అని ఆశ పడే భగవంతుని అదృష్టం అనేది ఒకటి ఉన్నది.

3) **"తొండర్ క్కముదుణ్ణ చ్చొల్ మాలైకళ్ శొన్నేన్"** (భాగవతులకు అమృతం వంటి పాశురాలను పలికాను) అని ఆళ్వార్లు స్వయంగా పలికినట్లు ఈ పాశురాలతో కాలక్షేపం చేసే సంసారి చేతనుల అదృష్టం ఒకటి ఉన్నది.

ఈ విధంగా మూడు కారణాలతోను ఆళ్వార్లు ఇంకా ఈ లోకంలో ప్రాణాలను ధరించి నిలువగలిగారు. పోయిన ప్రాణం

తిరిగి వచ్చింది. "**ఇరుత్తుమ్ వియందు**" అనే ఒక దశకంలో నడచిన, సంభవించిన సంశ్లేషం స్మరణకు వచ్చింది.

అశోకవనంలో హనుమంతుడు తన దగ్గరకు వచ్చినప్పుడు సీతాదేవి తాను పూర్వం చాలా దినాలుగా పడిన బాధ



శ్రీ వామనమూర్తి - తిరుకాట్కరై

అంతా ఉన్నా, శ్రీరాముడు వచ్చి దర్శనాన్ని అనుగ్రహించకపోయినా, వనవాసానికి ముందు అయోధ్యలో 12 ఏళ్ళు కాలం శ్రీరాముడు తాను ఏక భోగంగా ఆనందించి అనుభవించిన అనుభవం గుర్తుకు వచ్చింది. "**సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే, భుంజానా అమానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ**" (అయోధ్యలో నేను శ్రీరాముని ఇంటిలో 12 ఏళ్లే కాదని దివ్యమైన భోగాలను అనుభవించాను) అని ఆ ఆనందాలను స్మరించి కాలక్షేపం చేసినట్లే, "**ఇరుత్తుమ్ వియందు**" అనే దశకంలో తలమునకలుగా ఏర్పడిన ఆనందం

వీరికి స్మరణకు రాగా, అది కేవలం స్మృతి మాత్రమే కాకుండా, సమకాలంలో అప్పుడే అనుభవించినట్లుగా మనసుకు తోచి ఆ శీలగుణాన్ని ఈ దశకంలో పలికి ఆళ్వార్లు ద్రవిస్తున్నారు. ఈ విధంగా గతంలో జరిగిన విషయాన్ని స్మరణకు తెచ్చుకొని ప్రాణాలు ధరించేటట్లుగా చేయ గలిగినవాడు 'తిరుకాట్కర' క్షేత్రంలోని స్వామి. అందువల్లనే ఈ దశకం ఆ స్వామి విషయంగా అవతరించింది. ఈ క్షేత్రం కేరళ దివ్యదేశాలలో ఒకటి.

## 87)నవమ శతకం-సప్తమ దశకం

## # ఎంగానలకఙ్కழிవాయ్

గడచిన దశకంలో ఒక విధంగా శీల గుణ స్మరణతో ప్రాణాలను నిలుపుకోగలిగేటట్లు కలిగేటట్లు చేశాడు, భగవంతుడు. గుణాలను స్మరించగా స్మరించగా మరింతగా మరింతగా ఆ స్వామిని నేరుగా దర్శించాలి అనే ఆర్తి ఆళ్వార్లకు బాగా కలిగినందువల్ల ఈ దశకంలో పక్షుల ద్వారా రాయబారాన్ని పంపుతున్నారు, స్వామి దగ్గరకు. తిరువాయ్ మొழி ప్రబంధంలో పక్షుల ద్వారా రాయబారం పంపే దశకాలు నాలుగు ఉన్నాయి. అవి, **1)అంజిరైయ మడనారాయ్, 2)వైకల్ పూంకళివాయ్, 3) పొన్నులకాళీరో, 4) ఈ దశకం.** వీటిలోని మొదటి దశకంలో అపరాధ సహత్వం అనే 'క్షమా'గుణం ఆధారంగా చేసికొని వ్యూహంలోకి రాయబారాన్ని పంపారు. రెండవ దశకంలో ఆశ్రిత 'జనరక్షణదీక్షితత్వం' అనే గుణాన్ని ఆధారంగా చేసుకొని విభవ రూపంలో రాయబారానికి పంపారు. మూడవ దశకంలో 'ఐకరస్యం' అనే గుణాన్ని ఆధారంగా చేసుకొని అంతర్యామి దగ్గరకు రాయబారానికి పంపారు. ఇక ఈ దశకంలో భగవంతుని రూపసౌందర్యాన్ని ఆధారంగా చేసుకొని అర్చా రూపంలో



శ్రీ సూక్తినాథ పెరుమాళ్ - తిరుమూళ్ళిక్కళం

రాయబారాన్ని పంపుతున్నారు. మొదటి రెండు పాశురాలలో **"తిరుమూళ్ళి కళత్తు తమరోడు అంగమైవార్ కుక్క"** (తిరుమూ**ళ్ళి**క్కళం అనే క్షేత్రంలో భక్తులతో కలసి వేంచేసి ఉన్నవానికి ) అని అన్న నందున 'తిరుమూళ్ళిక్కళం' అనే దివ్య దేశంలో తన పరిజన పరివారాలతో కూడా స్వామి ఆనందిస్తున్నాడు. అందువల్ల నన్ను మరచిపోయి ఉంటాడు. మీరు అక్కడికి వెళ్లి తన **"శెంగమలత్తలర్ పోలుమ్ కణ్ కై కాల్ శెంగనివాయ్, అక్కమలత్తిలైపోలుమ్ తిరుమేని"** (తామర పువ్వంటి కన్నులు, కాళ్ళు, చేతులు, ఎర్రని నోరు, తామర ఆకు వలె ఉండే తిరుమేని) అందాన్ని గుర్తు చేసి, "ఇటువంటి అందంలో అభినివేశాన్ని పొందిన పరాంకుశ నాయకి మీకు దూరమై బాధతో ప్రాణాలను భరించే లేకుండా ఉన్నది అని చెప్పండి" – అని కొన్ని పక్షులను రాయబారం పంపే విధంగా ఈ దశకం ఉన్నది.

# 88)నవమ శతకం-అష్టమ దశకం

# # ఆఱుక్కుమ్ విన్టై

గడచిన దశకంలో ఆళ్వార్లు 'తిరుమూళ్ళి క్కళమ్' అనే క్షేత్రంలోని స్వామి వద్ధకు పక్షులను ద్వారా రాయబారం పంపారు. ఆ విధంగా దూతగా పోయినవారు తిరిగి వచ్చి ఏదో ఒక సంగతిని చెప్పేవరకు వేచి ఉండాలి కదా. కానీ ఆళ్వారులు అంతవరకు వేచి ఉండలేరు. వెంటనే 'తిరునావాయ్' అనే క్షేత్రానికి వెళ్లి స్వామిని దర్శించాలి అని తలచారు. కానీ, **"కాలాళుమ్ నెంజళియుమ కణ్ శుళ్ళలుమ్"** (కాళ్ళు తడబడుతున్నాయి,



శ్రీ నావాయ్ ముకుందన్ - తిరునావాయ్

మనసు ద్రవిస్తుంది, కళ్ళు తిరుగుతాయి) అనే దశ వారికి కలిగింది. అందువల్ల ఏ విధంగా వారు ఆ క్షేత్రానికి పోగలరు? ఉన్నచోటనే నిలచి ఉండి కోరడంలో ఏ కొరత లేదు కదా. ఆ మనోరథమే ఈ దశకంగా పరిణమించింది. "హనుమంతుడు లంకకు వెళ్లి సీతాదేవిని సేవించి వచ్చిన తరువాత, ఆమె శ్రీరామ చంద్రుని దగ్గరకు చేరడానికి ముందు కాలంలో సీతాదేవికి కలిగిన మనోరథంవలె, పూర్వం పంపిన దూతలు అక్కడకు వెళ్లి, ఆ స్వామిని చూచి, తిరిగి రావడానికి ముందు కాలంలో ఆళ్వార్లకు కలిగిన మనోరథం ఈ దశకంలో తెలుపబడింది" –అని ఈడులో వివరింపబడింది. 'తిరుమూழிక్కళం' వలె 'తిరునావాయ్' కూడా 13 కేరళదివ్య దేశాలలో ఒకటి. "ఆ క్షేత్రానికి నేను పోగలనా? పోలేనా? అక్కడకు వెళ్లి నేను కళ్ళారా దర్శించి సేవను చేసుకోగలనా? " అని ఈ విధంగా పలు విధాలైన మనోరథాలను ఆళ్వార్లు కలిగి ఉండడం ఈ దశకం తెలుపుతున్నది.

## 89)నవమ శతకం-నవమ దశకం

## # మల్లిక్కై కమழ்

మన పూర్వాచార్యులు ఈ దశకాన్ని **"మాలై ప్పూశల్"** అని వ్యవహరిస్తారు. ఈ దశకం చివరి పాశురంలో ఈ పేరు ఉండడం గమనించవచ్చు రాబోయే పదవ శతకంలోని **"వేయ్ మరు తోళిణై** " అనే మూడవ దశకానికి **"కాల ప్పూశల్"** అని పేరు. శ్రీకృష్ణుడు ఉదయ కాలంలో గోవులను మేపడం కోసం పోతున్నాడు అని తలచి, అతనిని చూచి "నీవు గోవులను మేపడానికి పోతే మమ్ములను బాధించే పదార్థాలు బాధిస్తున్నాయి" అని మొఱపెట్టడం "కాలై ప్పూశల్" అనే దశకంలోని విషయం. ఇక ఈ దశకంలో అయితే, పగటి కాలంలో గోవులను వనంలో మేపి

సాయంకాలం కృష్ణుడు రేపల్లె కి తిరిగి వచ్చేటప్పుడు, కొన్ని దినాలలో ఆ గోవులకు ముందు వేణువు ఊదుతూ వస్తాడు. మరికొన్ని దినాలలో ఆ గోవుల వెనకాల వస్తాడు. ఆ విధంగా వెనకాల వచ్చే దినాలలో అతనిని చూడలేక రేపల్లె లోని గోపికలు పడిన ఆర్తిని అళ్వార్లు తమలో ఆరోపించుకొని పలికిన పలుకులే ఈ దశకంలోనే పాశురాలు.

## 90)నవమ శతకం-దశమ దశకం

## # మాలై నణ్ణి

ఆళ్వార్లు **"అఱుకుక్కుమ్ విన్నై"** అనే దశకంలో భగవంతుని పొందాలి అని ఆశ పడ్డారు. ఆ ఆశ ఫలించకపోవడం వల్ల వారు చాలా బాధపడిన విషయం గడచిన దశకంలో



శ్రీ శౌరిరాజపెరుమాళ్ - తిరుక్కణ్ణపురం

తెలుపబడినది. ఈ విధంగా బాధపడే ఆళ్వార్లను చూచి భగవంతుడు "ఆళ్వార్లూ!, నన్ను పొందలేనందువల్ల మీరు బాధ పడడం అటు ఉండనివ్వండి. మిమ్మలను పొందలేదే! అనిఎక్కువ బాధపడేవాడను నేనే కదా. మీకు ఏదైనా కొరత ఉన్నదా? పరమ పదాన్ని విడచి పెట్టి 'తిరుక్కణ్ణపురం' అనే క్షేత్రంలో నేను ఉండడం మీ కోసమే కదా. మీ శరీరం చివర మీరు కోరిన కోరికను నెరవేరుస్తాం" అని పలికి సమాధాన పరచాడు. ఆ మాటలను విని ఆళ్వార్లు కూడా సమాధాన పడ్డారు అనే ఈ విషయం ఈ దశకంలో తెలుపబడుతున్నది. "**మరణమానాల్ వైకుందమ్ కొడుక్కుమ్ పిరాన్**" (మరణం కలిగినప్పుడు వైకుంఠాన్ని ఇచ్చే స్వామి) అనే పాశురం ఈ దశకానికి ముఖ్యమైనది. "సర్వేశ్వరుడు అందరూ ఆశ్రయించడానికి వీలుగా తిరుక్కణ్ణపురం అనే క్షేత్రంలో నెలకొని ఉన్నాడు. అందరూ అతని దగ్గరకు వెళ్ళి, అతనిని ఆశ్రయించండి. ఆశ్రయించేటప్పుడు అతని చరణాలలో భక్తిని కలిగి ఉండండి. భక్తికి తగిన ఉపకరణ సంపద లేనివారు ప్రపత్తిని చేయండి. దానికి తగిన మహావిశ్వాన్ని లేనివారు కేవలం మాట అయినా పలకండి. అంత మాత్రంతోనే ఆ స్వామి రక్షిస్తాడు, వదలిపెట్టడు. అందువల్ల అందరూ అతనిని ఆశ్రయించండి" అని పరోపదేశం చేసే విధంగా ఈ దశకం ఉన్నది. **"మోహిత్తు క్కిడందారాకిల్ కిడక్కుమిత్తనై పోక్కి, ఉణర్ న్దారాకిల్ పిఱర్ క్కు హితం శొల్లి యల్లదునిఱ్కమాట్టార్"** (మోహాన్ని పొందితే ఊరికే ఉంటారు తప్ప తెలివి వచ్చిందంటే ఇతరులకు ఉపదేశాన్ని చేయకుండా ఉండలేరు కదా) అని నంబిళ్ళై ఈడులో అన్నారు.

# 91)దశమ శతకం-ప్రథమ దశకం

## # తాళ తామరై

గడచిన దశకంలో **"మరణమానాల్ వైకుందమ్ కొడుక్కుమ్ పిరాన్"** (మరణం సంభవించినప్పుడు వైకుంఠాన్ని ఇచ్చే స్వామి) అని అనడం భగవంతుని అభిప్రాయాన్ని అనువదించినట్లే కదా. "ఆళ్వార్లూ! మీరు దేహావసానంలో మీరు కోరిన ఫలాన్ని పొందుతారు" అని భగవంతుడు ఆళ్వార్లకు కాలనిర్దేశం చేసి చెప్పినట్లు దీనివల్ల తెలుస్తున్నది. శరీరం ఎప్పుడు అంతం అవుతుంది ?అని ఆళ్వార్లు ఆలోచించాలా! **"ఇళైనల్ల వాక్కైయుమ్ పైయవే పుయక్కఱ్ఱదు"** (భగవంతునకు ఆభరణం వలె ఆశపడదగిన శరీరం కూడా క్రమంగా విడిచి పోవడానికి అలవాటు పడింది) అని, **"ఎన్నుయిర్ కూవి క్కొడుప్పార్ కుక్కుమ్ ఇత్తనై వేండుమో?"** (నా ప్రాణాన్ని గ్రహించి స్వామికి ఇచ్చేవారికి ఇంత ప్రయత్నం కావాలా?) అని ఇంతకు ముందు పలికినవారు కనుక, శిథిలమైన తమ శరీరం పతనం చెందే సమయం సమీపంలోనే ఉన్నదని నిశ్చయించు కొన్నారు. పరమపదానికి వెళ్లే ప్రయత్నానికి సన్నాహం చేయాలని తలచి, ముందు ముందుగా దారి బత్యంగా 'తిరుమోగూర్' లోని కాలమేఘ స్వామిని ఆళ్వార్లు ఆశ్రయించారని ఈ దశకం తెలుపుతున్నది. పరమపదానికి వెళ్లే దారిలో సహాయం కావాలా? **"అర్చిః దినపూర్వపక్షషడుదజ్ మాసాబ్దవాతాంశుమత గ్లౌవిద్యుద్వరుణేంద్రధాతౄమహితః"** అని నడాదూర్ అమ్మాళ్ పలికినట్లుగా, పలువురు అర్చిరాది పురుషులు దారిలో సహాయకులుగా ఉంటారని చెప్పబడింది కదా. ఇక వేరే సహాయకులు ఎందుకు? అని ఒక సందేహం కలుగుతుంది. వరాహ చరమ శ్లోకంలో **"తతస్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణ**



**శ్రీ కాలమేఘ పెరుమాళ్ - తిరుమోగూర్**

**సన్నిభమ్,అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్"** (రాయి వలె, కట్టె వలె పడి ఉన్నవాడు, మరణించే దశలో ఉన్నవాడు అయిన నా భక్తుని నేను స్మరిస్తాను. అతనిని ఉన్నత గతికి తీసుకొనిపోతాను) అని భగవంతుడు స్వయంగా తాను దారిలో వెంట ఉంది తీసుకుని పోతానని అన్నందున పరమపదానికి వెళ్లేవారికి అందరికీ అతడే మార్గబంధువు అనే విషయం శాస్త్రసిద్ధాంతం. ఆ విధంగా మార్గబంధువు అయినా స్వామి 'తిరుమోగూర్' క్షేత్రం లోకి వచ్చి ఉన్నాడని, ఆ భగవంతుని మార్గబంధుగా ఆశ్రయిస్తున్నారు అళ్వార్లు. మార్గబంధువు అయ్యేటప్పుడు జ్ఞానంలో, శక్తిలో ఏ లోటు లేనివాడుగా ఉండాలి. అతడే, అటువంటివాడే విరోధులను తొలగించగలడు. అటువంటి సామర్థ్యం 'తిరుమోకూర్' క్షేత్రంలోని స్వామిలో ఈ లోటు లేకుండా

ఉన్న విషయాన్ని తలచి, ఆ స్వామిని మార్గసహాయకునిగా అళ్వార్లు ఆశ్రయిస్తున్నారు.

# 92)దశమ శతకం-ద్వితీయ దశకం

# # కెడుమిడర్

గడచిన దశకంలో తిరుమోగూర్ క్షేత్రంలోని స్వామిని దర్శించి ఆనందించారు. ఈ దశకంలో 'తిరువనంతపుర' క్షేత్రాన్ని అనుభవిస్తున్నారు. దీని తర్వాత 'తిరువాట్టాఱు', 'తిరుమాలిరుం శ్శోలై', 'తిరుప్పేర్ నగర్' అనే క్షేత్రాలను అనుభవించబోతున్నారు. ఇంతకుముందు నవమ శతకంలో కూడా చాలా శాస్త్రాలను అనుభవించారు. ఈ విధంగా మాటిమాటికి దివ్య దేశాలలోనే ఆదరాన్ని కలిగి ఉండడానికి ఏమి కారణం? అనే ఈ విషయాన్ని ఇక్కడ గమనించాలి. తిరుమంగై ఆళ్వార్ 'పెరియ తిరుమొழி' అనే ప్రబంధంలో **"ఒరు నల్ శుఱ్ఱమ్"** అనే దశకంలో ఒక్కొక్క పాశురం లోను రెండు రెండు దివ్య దేశాలు ప్రస్తావించి కీర్తించారు. దానికి ఏమి కారణం? అని విచారించిన మన పూర్వాచార్యులు ఆశ్చర్యంగా ఒక విషయాన్ని గ్రహించి తెలియజెప్పారు. పుట్టిన ఇంటి నుండి మెట్టిన ఇంటికి బయలుదేరి కన్య తాను చాలా దినాలు నివసించిన చోట తనతో చాలా పరిచయం కలిగిన, పరమ ప్రేమాస్పదులైన కొంతమంది తోటికన్యల దగ్గరకు వెళ్లి, వారితో "అమ్మలారా! నేను వెళ్లి వస్తాను. తల్లీ! నేను పోయి వస్తాను" అని పలికి వారి అనుమతిని తీసుకోవడం కోసం కొంత ప్రయత్నం చేసినట్లే, ఈ తిరుమంగై ఆళ్వార్లు కూడా తమ మెట్టినిల్లు అయిన పరమపదానికి వెళ్ళడానికి ముందు తమకు చాలా ఇష్టమైన దివ్య క్షేత్రాలలో నెలకొని ఉండే అర్చామూర్తుల దగ్గర అనుమతిని తీసుకోవడం కోసం అక్కడికి వెడుతున్నారు - అని మన



శ్రీ అనంత పద్మనాభ పెరుమాళ్ - తిరు అనంతపురం

పూర్వాచార్యులు ఆ దశకాన్ని వ్యాఖ్యానం చేసేటప్పుడు వివరించారు. నమ్మాళ్వార్లు కూడా **"మాలై నణ్ణి"** అనే దశకానికి తరువాత తమకు పరమపదప్రాప్తి దగ్గర పడింది అని భావించినందున, పలు దివ్య దేశాలలో ప్రవేశిస్తున్నారు. ఇప్పుడు తిరువనంతపురాన్ని ప్రాప్యంగా భావించి, అక్కడ అభినివేశంతో పలికే వచనాలుగా ఈ దశకం అవతరించింది.

## 93)దశమ శతకం-తృతీయ దశకం

## # వేయ్ మరు తోళిణై

గడచిన దశకంలో ఆళ్వారులు తాము, శ్రీవైష్ణవులు కలసి తిరువనంతపురానికి వెళ్లి, అక్కడ భగవంతునకు సేవ చేయాలని

ఆశపడ్డారు. అనుకున్న విధంగా అప్పుడే ఆ దివ్య దేశానికి వెళ్లి సేవ చేసుకోవడానికి తగిన అవకాశం లేనందున మనసులో చాలా దిగులు పొందారు. "పూర్వం వలె మళ్లీ నాకు సంసారమే మిగులుతుందా? ఈ సంసార బంధం తప్పదా?" అని చాలా సందేహాన్ని పొందారు. ఈ సందేహానికి ఏమి కారణం? అంటే, ప్రకృతి సంబంధం అనేది చాలా క్రూరమైనది కనుక, భగవానుని స్వాతంత్ర్యాన్ని చూచినా ఈ విధంగా భయపడే అవకాశం ఉన్నది కనుక ఆళ్వార్లు భయపడడానికి అవకాశం ఉన్నది కదా. ఈ విధంగా తమకు కలిగిన సందేహాన్ని నేరుగా విన్నపం చేయకుండా నాయికా భావంతో విజ్ఞాపన చేస్తున్నారు, ఈ దశకంలో. ఏ విధంగా అంటే–రేపల్లె లోని గోపికలకు శ్రీకృష్ణుని విషయంలో ఒక సందేహం కలిగి, వారు తమ భయాన్ని వ్యక్తం చేసిన రీతిలో, ఆళ్వార్లు కూడా తమ అతిశంకను నాయికా వచనాలతో ఈ దశకంలో తెలుపుతున్నారు. శ్రీకృష్ణుడు, గోపికలు(నాయిక) ఒకే పడుకలో పడుకొని ఉన్నపుడు గోవులను మేపే ఉదయకాలం సమీపించింది. ఆ కాలానికి తగినట్లు కోకిల, నెమలి మొదలైనవాని ఆటలు, పాటలు మొదలైన చిహ్నాలు కనిపించినందున, వాటిని చూచి "శ్రీ కృష్ణుడు పశువులను మేపడం కోసం మనలను విడిచి వనానికి వెడతాడు" అని వారు భయపడ్డారు. దాని వల్ల కలిగిన బాధతో వారు పలికే మాటలను ఆళ్వార్లు ఇందులో అనుకరిస్తూ ఈ దశకాన్ని అనుగ్రహిస్తున్నారు. దీని ద్వారా భగవంతుని విషయంలో తమకు ఉండే ఆర్తిని హృద్యంగా వ్యక్తం చేస్తున్నారు. ఈ దశకానికి సంగ్రహంగా పాశురాన్ని అనుగ్రహించిన శ్రీ వరవరములు గోపికలకు కల అతిశంకను ఏమాత్రం ప్రస్తావన చేయకుండా **"తన్నై ఇన్నుమ్ భూమియిలే వైక్కుమెన శంకిత్తు"** (తమను ఇంకా ఈ భూమిలో నిలిపి ఉంచుతాడు ఏమో అని భయపడి శంకించి) అని ఆళ్వారుల అతిశంకను మాత్రమే ఈ దశకానికి ప్రమేయంగా పలకడం గమనించాలి. అన్యాపదేశాన్ని విడిచి,

స్వాపదేశంలోని అర్థాన్ని వారు ప్రధానంగా గ్రహించారని దీనివల్ల తెలుస్తున్నది. దానికి మించి "**మాల్ తెళివిక్క త్తెళిందు**" అని భగవంతుడు ఆళ్వార్లను ఊరడించేనట్లుగా పలికినట్లు కనపడుతున్నది. ఈ దశకంలో పదవ పాశురంలోని "**శెంగనివాయ్ ఎంగళాయర్ తేవే**" (ఎర్రని అధరాన్ని కల మా గోపాలుడు) అనే సూక్తి లోని స్వారస్యాన్ని గ్రహించి మన పూర్వాచార్యులు అర్థాన్ని నిర్వహించే రీతిని అనుసరించి "**మాల్ తెళివిక్క త్తెళిందు**" అని చెప్పబడిందని గ్రహించాలి. ఈ దశకానికి "**కాల పూ్పశల్**" అని మన పూర్వాచార్యులు పేరు పెట్టారు.

# 94)దశమ శతకం-చతుర్థ దశకం

# # శార్వే తవ నెఱి

అళ్వార్లు తమ పురుషభావాన్ని విడచి స్త్రీ భావనతో పలకడం మొదటి శతకం లోని "**అంజరైయ మడనారాయ్**" అనే దశకం నుండి ఆరంభమైనది. ఆ విధంగా పలకడం గడచిన దశకంతో పూర్తి అయినది. ఇకపై ఉండే దశకాలలో నాయికా భావం గోచరించదు. గడచిన దశకంలోని అర్థాన్ని అనువదిస్తూ ఇక్కడ నంబిళ్ళై పలికిన ఈ సూక్తిని గమనించండి. "**తమ్మై ప్పిరియ నినైవిన్రిక్కే ఇరుంద అతిశంకైయాలే పిరిందార్ పడుమ్ వ్యసనత్తై ప్పట్టు, అత్తాలే అవసన్నరానవరై 'ఉమ్మై ఒరు నాళుమ్ పిరియేన్' ఎన్టు అవన్ ఆశ్వసిప్పిక్క అత్తాలే ధరిత్తు మోకవుమ్ ప్రీతరానార్, కీళ్ళ్**" (భగవంతుని విడిచి ఉండలేని స్వభావం వల్ల ఎక్కడ ఆ స్వామిని విడిపోవలసి వస్తుందో అనే భయంతో చాలా బాధపడిన ఆళ్వార్లను 'మిమ్ములను నేను ఏనాడు విడిచిపెట్టను' అని భగవంతుడు ఊరడించగా, ఆళ్వార్లు ప్రాణాలను ధరించి ప్రీతి చెందారు) అనేది ఆ సూక్తి. 'తిరువాయ్




**శ్రీ పళ్ళికొండ పెరుమాళ్ - తిరుమెయ్యమ్**

మొళ్ళినూత్తందాది' ప్రబంధంలో శ్రీ వర వరమునులు **"తన్నై ఇన్నుమ్ భూమియిలే వైక్కుమెన శంకిత్తు మాల్ తెళివిక్క త్తెళింద మాఅన్"** (తమను ఇంకా ఈ భూమిలో ఉంచుతాడు అని సందేహపడి బాధ పడగా, భగవంతుడు మనస్సును తేట పరచగా ఊరడిల్లిన ఆళ్వారులు) అని పలికినట్లు ఆళ్వార్లు తమ సందేహం తీరగా, "ఇక నాకు పరమపదం లభించడంలో సందేహం లేదు" అని నిశ్చయించుకొని, ఇక తిరువాయ్ మొళ్ళి అనే ఈ మహా శాస్త్రానికి చేయవలసిన దానిని చేసి పూర్తి చేయడానికి ఆరంభించారు. **"పిణక్కఅవై శార్వాక నిగమిత్తు"** అనే ఆచార్య హృదయ సూక్తి రీతిలో ఆరంభంలో ఇతరులకు తాము ఉపదేశించిన భక్తి ఫలంతో పూర్తి అయిన రీతిని తెలిపి, ఈ దశకాన్ని ముగిస్తున్నారు. ఇందులో విభీషణుడు రావణుని ఉద్దేశించి చేసిన ఉపదేశం అతనికి ఉపయోగించకపోయినా, ఉపదేశించిన విభీషణునకు భగవంతుని విషయంలో ప్రావణ్యం ఘనంగా కలిగి దానివల్ల ప్రాప్యాన్ని పొందడానికి ఉపయోగించింది. ఆ విధంగానే ఆళ్వార్లకు కూడా ఇతరులకు చేసిన పరోపదేశం తమకు భగవంతుని విషయంలో అభినివేశం ఎక్కువగా కలగడానికి కారణమైనది. అది సఫలమై ఫలించిన రీతిని తెలుపుతూ ఆళ్వార్లు

ఈ దశకాన్ని ముగిస్తున్నారు-అని తెలియాలి. పిళ్ళాన్ చెప్పిన నిర్వాహానికి ఒక సంగతి ఈడు వ్యాఖ్యానంలో తెలుపబడింది, "నీవు గోవులను రక్షించడానికి వనానికి పోవద్దు" అని అనగానే, "ఆ పనిని నేను మానేశాను" అని అన్నాడు, భగవానుడు. ఆ గొప్ప గుణంలో అభినివేశాన్ని పొంది, "ఇతడు భక్తి సులభుడు" అని నిశ్చయించుకొని, ఆ విషయాన్ని ఈ దశకంలో తెలుపుతున్నారు–అనేది ఆ నిర్వాహం.

## 95)దశమ శతకం-పంచమ దశకం

## # కణ్ణన్ కళ్ళిణై

మొదటి శతకంలోని **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** అనే దశకంలో పరోపదేశాన్ని చేయడం ఆరంభించిన ఆళ్వారులు, ప్రతీ దశకంలోను ఆ విధంగా పరోపదేశాన్ని చేశారు. ఆ ఉపదేశప్రక్రియ ఈ దశకంతో పూర్తి అవుతున్నది. ఇకపై పరోప దేశ ప్రక్రియ కనిపించదు. పెద్దలు తాము పరమపదానికి వెళ్లే సమయంలో తమకు అంతరంగులుగా ఉండేవారికి అరుదైన కొన్ని ఉపదేశాలను చేయడం లోకంలో పరిపాటి. దానికి చరమ సందేశం అని పేరు. ఈ దశకం అటువంటిదే. భగవంతుడు ఆళ్వార్లను పరమపదానికి తీసుకుని పోవడానికి సిద్ధపడ్డాడు. వారు కూడా "ఇక నాకు పరమపదం లభించడం తథ్యం" అని నిశ్చయించుకున్నారు. వీరు సంసారుల పట్ల కరుణను కలిగినవారు కనుక సంసారులకు ఇంతవరకు కావలసిన రీతిలో అన్ని ఉపదేశాలను చెశారు. అయినా, విభీషణుడు రావణుని భవనాన్ని విడచి శ్రీరాముని శ్రీచరణాల దగ్గరకు పోవడానికి బయలుదేరిన తర్వాత కూడా **"న నశ్యంత ముపేక్షేయం ప్రదీప్తం శరణం యథా"** (కాలిపోయే ఇంటిని చూచి ఊరుకో లేనట్లు, నేను

నశించిపోయే లంకను చూచి ఊరుకోలేను) అని అంటూ మళ్ళీ ఉపదేశం చేయడానికి ప్రయత్నించినట్లు, వీరు కూడా సంసారుల చెడ్డను చూసి భరించలేక చివరిగా ఉపదేశం చేసి పూర్తి చేస్తున్నారు. వీరు 'పెరియ తిరువందాది' ప్రబంధంలో **"ఆరానుమాదానుమ్ శెయ్య అకలిడత్తై ఆరాయ్ న్దు అదు తిరుత్తలావదే!"** (ఈ విశాలమైన లోకం ఎవరు ఏమైనా చేయనీ. వారిని మార్చడం ఎవరికి సాధ్యం?) అని అంటూ "ఈ సంసారి జనాలకు ఉపదేశించటం చాలా కష్టం, ఇది నా వల్ల కాదు" అని అన్నప్పటికీ, **"పయనన్ఱాకిలుమ్ పాంగల్లరాకిలుమ్ శెయల్ నన్ఱాక త్తిరుత్తి ప్పణి కొళ్వాన్"** (ఉపయోగం లేకపోయినా ఏ మంచి లేకపోయినా, ప్రవర్తనను దిద్దుబాటు చేసి కైంకర్యం స్వీకరించడం కోసం) అనే విధంగా లోకాన్ని బాగు చేయాలని తాము అవతరించిన ఈ విషయాన్ని గుర్తుపెట్టుకుని, తాను చెప్పిన విషయాలు లోకులకు రుచించక పోయినా, "మంచిని చెబుతున్నాను వినండి" అని ఉపదేశించటంలో తమకు గల శ్రద్ధను ఏనాడూ విడిచిపెట్టలేదు. ఈ ఉపదేశ విధానాన్ని ఈ దశకంతో ముగిస్తున్నారు. ఈ విషయాన్ని శ్రీవరవరములు 'నూఱ్ఱన్దాది' ప్రబంధంలో **"మణ్ణర్ క్కు త్తానుపదేశిత్తు త్తలైక్కట్టినాన్ మాఱన్"** (ఈ లోకంలోనివారికి ఉపదేశించటం ఇంతటితో ఆళ్వార్లు పూర్తి చేశారు) అని తెలియజేశారు.

## 96)దశమ శతకం-షష్ఠ దశకం

## # అరుళ్ పెఱువారడియార్

ఈ దశకానికి అవతారిక అనుగ్రహించడానికి ఆరంభించిన 'నంబిళ్ళై' మొదటిలోనే పలికిన సూక్తులను చూడండి. **"పొయ్**

**న్నిష్ఠ ఇానమ్ తొడంగి ఇవ్వళవుమ్ వర ఈశ్వరన ఆళ్వార్ పిన్ తొడర్ న్దపడి శొల్లిట్రు. ఇదు తొడంగి ఆళ్వారై సర్వేశ్వరన్ పిన తొడర్ న్దపడి శొల్లుకిఅదు**" ('పొయ్ న్నిష్ఠ ఇానమ్' ఆయననే మొదటి పాశురం నుండి ఇంతవరకు భగవంతుని ఆళ్వారులు వెంటపడిన సందర్భం తెలుపబడింది. ఇకపై ఆళ్వార్లను భగవంతుడు వెంటపడే సంగతి తెలుపడుతున్నది). దీని తాత్పర్యం ఏమంటే–ఇంతవరకు ఆళ్వారులు భగవంతుని ప్రార్థించారు, ఇకపై "**మునియే నాన్ముకనే**" అనే దశకం చివరి వరకు భగవంతుడు ఆళ్వార్లను ప్రార్థిస్తున్నాడు–అని. ఈ దశకంలోని మూడవ పాశురం "**విణ్ణులకమ్ తరువానాయ్ విరైకిన్దాన్**" (పరమ పదం ఇవ్వాలని చాలా తొందర పడుతున్నాడు) అని అన్నందున ఆళ్వార్లను పరమపదానికి తీసుకుని పోవడం కోసం భగవంతుడు తాను చాలా తొందర పడుతూ "ఆళ్వార్లూ! రండి రండి" అని ప్రార్థించడం తెలుస్తున్నది. అంత మాత్రమే గాక, ఇది ఆళ్వార్ల చరమ శరీరం కనుక, అళ్వార్ల పట్ల తనకు ఉండే వ్యామోహం వల్ల వారిని తీసుకునిపోవాలనే తొందర కూడా మరచిపోయి, ఆ తిరుమేనిని అనుభవించాలని తలచి, ఆ అనుభవంలోనే మిక్కిలి చాపల్యాన్ని కలిగినవాడై ఉన్నాడు. పూర్వం గోపికలతో కలసి రాసక్రీడ ఆడినప్పుడు అనేక రూపాలను స్వీకరించి వారిని అనుభవించినట్లు, నరకుని సంహరించి అతని దగ్గర ఉండే పదహారు వేల మంది కన్యలతో ద్వారకలో 16 వేల రూపాలను స్వీకరించి అనుభవించినట్లు, అనేక రూపాలను ఎత్తి ఆళ్వారుల అవయవాలు అన్నిటిలోనూ చాలా కోరికతో అనుభవించాలని కోరి, దానికి అనుమతి ఇవ్వవలసినదిగా వారిని ప్రార్థించాడు. దాని నుండి ఆళ్వార్లు చాలా శ్రమతో విడిపించు కోవాలసి వచ్చింది. అయినా, భగవానుడు వెంట పడడం మానలేదు. దీనిని అంతా ఉద్దేశించి 'నంబిళ్ళై' "దీనినుండి ఆళ్వార్లను భగవంతుడు వెంబడించడం

చెప్పబడుతున్నది" అని మర్మం తెలిసినవారై అన్నారు. భగవంతుని పొందాలి అనే ఆళ్వారుల ఆర్తి అధికమా? లేక, వారిని పొందాలి అనే భగవంతుని ఆర్తి అధికమా? అనే విషయాన్ని విచారించి చూస్తే ఆళ్వార్ల ఆర్తి



శ్రీ ఆదికేశవ పెరుమాళ్ - తిరువాట్టాఱు

తక్కువ, భగవంతుని ఆర్తి చాలా ఎక్కువ అనే ఈ సిద్ధాంతం చేయవలసి ఉన్నది. ఈ విషయం ఇంతకుముందే **"వారి క్కొండు ఎన్నై విழுంగువన్ కాణిల్ ఎన్ను ఆర ఉற்ற ఎన్నైఒళియ ఎన్నిన్ ముற்றమ్ పారిత్తు తానెన్నై ముற்ற ప్పరుకినాన్"** (నన్ను గ్రహించి, నాకంటే ఎక్కువ ఆర్తిని కలవాడై, నన్ను పరిపూర్ణంగా సొంతం చేసికొన్నాడు) అనే పాశురం ద్వారా స్పష్టం అయినది. భగవంతుడు ఆ విధంగా చాలా అర్తిని కలవాడైనా,

ఆళ్వారుల ద్వారా భగవత్ భక్తులకు అమృతం వంటి పాశుర మాలికలను రచింపజేసి వారికి కానుకగా ఇవ్వాలని అనుకున్నాడు గనుక, తన ఆర్తిని అంతటినీ అణచుకొని సమయం కోసం ఎదురు చూడవలసి వచ్చింది. వేచి చూసిన సమయం, కార్యం సఫలం అయ్యే సమయం రాగానే ఇక భగవంతుడు వేచి ఉండలేడు కదా. 'తిరు వాట్టాఱు' అనే దివ్య దేశంలోకి వచ్చి విడిది చేసి ఉన్నవాడు గనుక ఆళ్వార్లను తీసుకొని పోవడంలో స్వామికి తొందర ఎక్కువ అయినది. ఇది ఏమి? పరమపదానికి తీసుకొనిపోయి అక్కడే అనుభవించాలి అనే నిర్బంధం ఏమి ఉన్నది? ఇక్కడే అనుభవించ వచ్చు కదా? అని కొందరు అడుగవచ్చు. "**పావియేనై పల నీ కాట్టి పడుప్పాయో?**" (పాపిష్ఠివాడనై నన్ను లౌకిక విషయాలను చూపించి పాడు చేస్తావా? బాధ పెడతావా?) అనే విధంగా అజ్ఞానాన్ని కలిగించే ఈ లోకంలో నిరంతరమైన అనుభవం కలుగదు కదా, ఈ ఆటంకం లేని రీతిలో ఏకాంతంగా ఉండే ఒక చోటుకు తీసుకుని పోయి అక్కడ ఆనందించాలి–అని భగవంతుడు ఆశపడ్డాడు. ఆది, పరుండి ఉండే ఏనుగును ఎక్కినట్లుగా స్వతంత్రంగా కాకుండా, ఆళ్వార్లు నియమించిన రీతిలోనే చేయాలి అని కూడా అనుకున్నాడు. భక్తపారతంత్ర్యంలో రుచి కలిగినవాడు కదా స్వామి. ఆళ్వార్లు అయితే పారతంత్ర్య పరమావధి లో నిలిచి ఉండేవారు కదా. సర్వేశ్వరుని తాము నియమించరు కదా. అతడు చేతులు కట్టుకుని నిలబడి "ఆళ్వార్లూ! నన్ను నియమించండి" అని అంటున్నాడు. కానీ ఆళ్వార్లకు ఆ విధంగా భగవంతుని నియమించడానికి ఇష్టం లేదు. పరాత్పరుడైవాడు ఈ విధంగా నేను నియమించేటట్లుగా తను తక్కువ చేసుకొని ఉన్నాడే స్వామి! ఇది ఏమి! అని ఆ భగవంతుని శీల గుణాన్ని అనుభవించడానికి ఆరంభించారు ఆళ్వారులు. ఆ గుణాన్ని అనుభవించేటప్పుడు కైవల్యానుభవం వలె ఏకాంతంగా అనుభవిస్తే అది రుచించదు గనుక, పదిమందితో కలసి

అనుభవించాలి అని తలచి, ఈ లోకంలో ఉండే వారివైపు అళ్వార్లు దృష్టి సారించారు. అయితే, వారు కేవలం లౌకిక భోగాలలోనే ఆసక్తులుగా ఉన్నారు. అన్యపరులై, వాటితోనే కాలం గడుపుతూ ఉండడం గమనించారు. వారిని విడిచి పెట్టి "పరమ రసికుడు అయిన సర్వేశ్వరునితో కలసి ఈ గుణాన్ని అనుభవిస్తాను" అని అతని వైపు దృష్టిపెట్టారు. అతడైతే, ఆళ్వార్లను తీసుకుని పోవడంలో తొందరపడుతున్నందున, ఆ విషయంలోనే ఆసక్తుడు అయి ఉన్నాడు. వారి అనుభవానికి తోడు కాలేకపోయాడు. ఈ విధంగా సంసారులు తోడు కాలేదు. భగవంతుడు అయినా తోడు కాలేదు. "**యానుమ్ ఎన్నెంజమ్ ఇశైందోళిందోమ్**" (నేను నా మనసు ఒకరికొకరం అంగీకరించాము) అని ఇంతకుముందే ఆళ్వార్లు అన్నారు కదా. "ప్రేమతో నాతో కలసివచ్చే మనసు ఉండగా ఇక ఏమి కొరత!" అని కొంత ఊరట కలిగి, ఆ మనస్సుతో కలసి అనుభవిస్తున్నారు ఆనందిస్తున్నారు. " ఓ మనసా! భగవంతుని పరత్వం ఎంత గొప్పదో చూశావా? అటువంటి గొప్పవాడు మన విషయంలో ఎంత సులభుడై ఉన్నాడో చూశావా" అని మాటిమాటికీ పలికి, మనసులో ద్రవిస్తున్నారు. సర్వేశ్వరుడు అయితే, అందరినీ నియమించేవాడై, స్వతంత్రుడై ఉండేవాడు అని ఇంతవరకు భావించారు. ఇప్పుడు "ఆశ్రిత పారతంత్ర్యమే అతనికి స్వరూపం" అనే వాస్తవాన్ని గ్రహించి, "ఇది ఏమి శీల గుణం! ఆహా!" అని ఆశ్చర్యపడుతున్నారు.

# 97)దశమ శతకం-సప్తమ దశకం

# # శెంజొల్ కవికాళ్

గడచిన దశకంలో ఆళ్వార్లు పొందిన ఆనందం అపరిమితమైనది. భగవంతుడు ఆళ్వారుల మనస్సును విడువక ఉన్నట్లే వారి తిరుమేనిని కూడా విడువకుండా ఉన్నాడు. పనసపండులో అంతటా ఈగలు ముసరినట్లుగా వారి అన్ని అవయవాలలోనూ అతడు వ్యాపించాడు. చాలా ఇష్టమైన వ్యక్తి విషయంలో ఉండే దోషాన్ని కూడా ఇష్టపడే కామునివలె జ్ఞానులలోని జ్ఞాన సువాసన పరిమళించే వారి దివ్య దేహాన్ని విడువకుండా అంతటా వ్యాపించి ఉన్నాడు, పరమాత్మ. సువాసనలోని గొప్పతనాన్ని తెలిసికొని కురువేరును అలంకరించుకునే భోగలాలసులు ఆ వేరులో ఉండే మట్టిని తొలగించి వేస్తే సువాసన తగ్గిపోతుంది అని, ఆ మట్టిని తీయకుండానే దానితోనే ఆదరించి, ఆనందిస్తారు కదా. ఆ విధంగానే పరమ భోగి అయిన భగవంతుడు కూడా ఆళ్వార్లను ఆదరించి అనుభవించేటప్పుడు **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్"** (ఆనందం వల్ల కలిగిన చల్లని బాష్పాలను కలవాడు, గగుర్పాటు పొందిన శరీరాన్ని కలవాడు) అనే విధంగా జ్ఞానకార్యమైన వికారాలకు అన్నిటికీ ఆశ్రయమై, జ్ఞానపరిమళాన్ని వెదజల్లే వారి విగ్రహంలో చాలా ఆదరాన్ని కలిగినవాడై అనుభవించడం ఆరంభించాడు. అంతేకాకుండా మిక్కిలి చాపల్యంతో ఆ తిరుమేనితో వారిని పరమపదానికి తీసుకుని పోవాలని కూడా చాలా ప్రయత్నం చేశాడు. ఈ విషయాన్ని తెలిసిన ఆళ్వార్లు "ఇతడు నా ద్వారా పాశురాలను పాడించడంకోసం నన్ను



**శ్రీ సుందరబాహుస్వామి - తిరుమాలిరుఞ్జోలై**

ఇక్కడ ఇక్కడ ఈ లోకంలో ఉంచాడని భావించాను. ఇతని ముఖ్యమైన అభిప్రాయం అది కాదు. నా శరీరాన్ని ఆదరించి, దానిని విడువలేనివాడు అయినందున నన్ను ఇక్కడ ఉంచాడు కాబోలు" అని భావించారు. "ఏ విధంగా అయినా ఈ ఆశను ఇతనికి

లేకుండా చేయాలి" అని భావించి, దేహంలో ఉండే దోషాలను అతనికి తెలియజేసి, "స్వామీ! పరమ రసికుడవైన నీవు ఈ మురికి శరీరాన్ని ఆదరిస్తున్నావా? ఇది ఏమి ? ఇది తగదు" అని అన్నారు. కానీ, వాత్సల్యాన్ని కలవాడై, దోషాలను భోగ్యాలుగా భావించేవాడైన కాముకుడు తాను ప్రేమించే వ్యక్తిలోని దోషాలను ఆదరించినట్లుగా భగవంతుడు కూడా ఆళ్వారుల దేహంలో ఆదరం చూపించడం ఆరంభించాడు. దానిని పోగొట్టడంకోసం అళ్వార్లు ఉపాయాన్ని నిశితంగా ఆలోచించారు. అప్పుడు వారికి దైవాధీనంగా వారికి ఒక ఉపాయం తోచింది. "ఇతడు నిరంకుశ స్వతంత్రుడై ఉన్నప్ప-టికిని నా విషయంలో పారతంత్ర్యాన్ని ప్రధానంగా కలిగినవాడై, నేను చెప్పినట్లు చేసేవాడు, నా మాటకు ఎదురు చెప్పకుండా ఉండేవాడు-అనే విషయం ఒకటి ఉన్నది కదా. విధికి కట్టుబడే వాడు నిషేధానికి కూడా కట్టుబడ్డవలసినదే కదా. లోకంలో ఒకడు శాస్త్రానికి కట్టుబడి ఉండడం అంటే-విధికి, నిషేధానికి – రెండిటికీ లోబడి ఉండడమే కదా. అందువల్ల ఇతడు ఇప్పుడు నా మాటకు అంగీకరించేటట్లు ప్రయత్నం చెయ్యాలి" అని భావించి, " స్వామీ!, నా విషయంలో నీవు పరతంత్రుడవై, నా మాటకోసం ఎదురు చూస్తున్నట్లు పలికి, ఎందుకు మా మాటకు విరుద్ధంగా నడుస్తున్నావు? ఇది తగునా?" అని అడిగారు. అప్పుడు భగవంతునకు ఏ సమాధానం లేకపోయింది. అప్పుడు భగవంతుడు "ఆహా! ఆళ్వార్లూ! నన్ను కట్టి వేశారు. నేను మీ మాటకు కట్టుబడి ఉన్నానుకదా. నన్ను స్వాధీనం చేసుకుని నా ఆశను నిరోధించారు" అని పలికి, ఏమి చేయలేనివాడై నిలిచాడు. ఆ సంగతిని చూసిన ఆళ్వార్లు సర్వనియంతయై, సర్వాధికుడైన భగవంతుడు తాను చాలా ఆశతో చేయదలచిన పనిని నా ఒక్క మాటకు కట్టుబడి, చేయకుండా నిలిపివేశాడే! ఇది ఏమి శీల గుణం! ఇది ఏమి పారతంత్ర్యం!" అని చాలా ఆశ్చర్యపడి, చాలా అభినివేశాన్ని పొంది, దానివల్ల చాలాసేపు మోహాన్ని పొందారు.



**శ్రీ క్షీరాబ్దినాధన్ - తిరుప్పాఱ్కడల్**

తరువాత కొంతసేపటికి తెలివి తెచ్చుకుని ఈ మహాగుణంలో ఇతరులు కూడా మునిగిపోయి మోహాన్ని పొందకుండా ఉండటంకోసం "**శెంజొల్ కవికాళ్!**" అని తమ వలె శీలగుణంలో ఆదరాన్ని కలిగిన రసికులను సంబోధిస్తూ వారికి ఒక అరుదైన ఉపదేశాన్ని చేయడం ఆరంభించారు. మహా ప్రవాహంలో దిగి అందులో పల్లంగా ఉండేచోట చిక్కుకుని అల్లాడి, దానినుండి కష్టపడి బయటపడి తిరిగి వచ్చినవారు ఆ సంగతి తెలియనివారికి ఆ ప్రవాహంలోని లోతును, అందులో దిగినందున కలిగే ప్రమాదాన్ని తెలియజేయడం తగినదే కదా. అటువంటిదే ఇది కూడా. అందువల్ల "భగవంతుని ఈ శీలగుణంలో దృష్టి పెట్టకండి" అని తీయని కవిత్వాన్ని రచించే కవులకు ఒక మార్గాన్ని ఆళ్వార్లు ఇందులో ఉపదేశించారు. ఈ విధంగా ఆళ్వార్లలో అంతులేని వ్యామోహాన్ని చూపిన భగవంతుడు 'తిరుమాలిరుం శోలై'లోని స్వామి అనే విషయం ఈ దశకంలో తెలుస్తున్నది. ఆచార్య హృదయంలోని త్యాజ్యదేహవ్యామోహం "**మరుళ్ కళ్ కడియుమ్**

**మయల్ మికు పొళిలిలే తళైక్కుమ్"** అనే చూర్ణిక, దాని వ్యాఖ్యానం ఇక్కడ అనుసంధేయం.

## 98)దశమ శతకం-అష్టమ దశకం

# తిరుమాలిరుమ్ శోలై మలై

**"అరుళ్ పెఱువార్ అడియార్"** అనే దశకంలో అళ్వార్లను పరమపదానికి తీసుకొనిపోవడానికి భగవంతుడు పడిన తొందర చెప్పబడింది. దానికి కొంత అవరోధం కలిగింది-అని గడచిన దశకంలో తెలుపబడింది. ఆళ్వారుల పట్ల భగవంతుడు అంతులేని అభినివేశం కలవాడై ఆ తిరుమేనితోనే వారిని పరమపదానికి తీసుకుని పోవాలని ప్రయత్నించగా అళ్వార్లు తమ దేహస్వభావాన్ని తెలియజేసి, భగవంతుని ప్రయత్నానికి అడ్డుపడ్డారు. ఆ విధంగా ఆ భగవంతుని ప్రయత్నానికి అడ్డుతగిలింది. ఇహ భగవంతుడు కూడా ఆళ్వారుల మాటకు అంగీకరించి, వీరికి పరమ పదాన్ని ఇవ్వడం కోసం తొందరపడేవాడై, పరమపదానికి వెళ్ళే దారిలో వారిని తీసుకుని పోవడం కోసం సిద్ధపడ్డారు. అప్పుడు ఆళ్వారులు భగవంతుని అడ్డుకొని ఒక ప్రశ్న అడిగారు. అది ఏమంటే, "స్వామీ! ఈనాడు నీవు ఈ విధంగా నన్ను పరమపదానికి తీసుకొని పోవాలని తొందర పడుతున్నావు. కానీ, అనాది కాలంగా నన్ను ఈ చీకటి మయమైన లోకంలో నిలిపి ఉంచావే! దీనికి ఏమి కారణం? ఇంతకాలంగా నన్ను ఈ లోకంలో నిలిపి ఉంచడానికి, ఇప్పుడు పరమపదానికి తీసుకొనిపోవాలని తొందర పడడానికి హేతువు ఏమి?" అని ప్రశ్నించారు. దీనికి ఇది హేతువని ఏ కారణం చెప్పాలో, ఏ విధంగా సమాధానం పలకాలో తెలియక స్వామి తడబడ్డాడు. అనేక

విధాలుగా ఆలోచించాడు. ఏ సమాధానం చెప్పినా దానికి మళ్లీ ఆళ్వారులు ఇంకొక ప్రతి సమాధానం ఇవ్వగలిగిన సమర్థులు అనే



**శ్రీ మకర నెడుంకుళైకాదర్ - తెన్ తిరుప్పేర్**

విషయాన్ని అతడు గ్రహించాడు. నిరంకుశ స్వతంత్రుడై ఉండే వాడు చేసే పనులకు ఏదైనా ఒక కారణం ఉంటుందా? ఉండదు కదా!-అని అళ్వార్లు స్వయంగా ఊహించి తెలుసుకుంటారు, సమాధాన పడతారు అని భావించి, అతడు ఏ బదులు తనకు తోచనందున తలవంచుకుని కాలి గోరుతో నేలను గీరుతూ నిలిచాడు. ఇది ఒక నిర్హేతుకవిషయీకారమే అని భావించి అళ్వార్లు చాలా ఆశ్చర్యపడి, ఆనంద పడుతూ ఈ దశకంలో పలుకుతున్నారు.

# 99)దశమ శతకం-నవమ దశకం
# # శూழ் విశుంబణిముకిల్

గడచిన దశకంలో **"ఇన్నైన్నై పొరుళాక్కితన్నై ఎన్నుళ్ వైత్తాన్ అన్ఱు ఎన్నై పుఱమ్ పోక పుణర్ త్తదు ఎన్ శెయ్ వాన్"** (ఈనాడు నన్ను కరుణించి ఒక వస్తువు గా చేసి తనలో గ్రహించాడు. ఆనాడు నన్ను బయటకు విడచి వేసినది ఎందుకోసం?) అని భగవంతుని గట్టిగా పట్టుకొని ఆళ్వార్లు ప్రశ్నించారు. దానికి హేతువు భగవంతుని నిరంకుశ స్వాతంత్ర్యమే తప్ప వేరు ఏమీ లేదు–అని ఆళ్వార్లు గ్రహించారు. భగవంతునకు కూడా తెలుసు. అందువల్ల భగవంతుడు "ఆళ్వారులూ! ఆనాడు ఉపేక్షించడానికి, స్వాతంత్ర్యమే కారణం. ఆ విధంగానే ఇప్పుడు ఆదరించడానికి కూడా నా స్వాతంత్ర్యమే కారణం" అని బదులు చెప్పాలి. తాను గొప్ప కరుణను సహజంగా కలవాడై ఉండి ఈ విధంగా సమాధానం చెప్పడం ఎంత మాత్రం తగదు కనుక, అతడు ఏ విధంగాను బదులు పలుకకుండా తల వంచుకొని నిలచాడు. ఆళ్వారులను పరమపదానికి తీసుకొని పోవాలని తొందరపడే తాను ఈ విధంగా ప్రశ్నకు బదులు పలుక లేక సిగ్గుపడి నిలిచే స్థితిని దాచడంకోసం ఒక ఉపాయాన్ని చేశాడు. పెళ్లిలో వివాహ కార్యకలాపాలను నిర్వహించే ఉపాధ్యాయునకు చెప్పవలసిన మంత్రం గుర్తుకు రాకపోతే మేళాలను గట్టిగా మోగింపజేసి, ఆ ధ్వని ద్వారా తాను మంత్రాన్ని మరచిన సంగతిని కప్పిపుచ్చేటట్లు, ఇప్పుడు కూడా ఏ సమాధానం లేని భగవంతుడు మేఘసముద్రభేరీతాళనినాదాలతో తాను సమాధానం చెప్పలేకపోయే స్థితిని దాచి పెట్టాడు.

"శూళ్లం విశుంబణిముకిల్ తూరియముళ్లక్కిన, ఆళ్లం కడల్ అడైతిరై కైయెడుత్తాడిన" (ఆకాశాన్ని ఆవరించిన అందమైన మేఘాలు తూర్య వాద్యాలను మోగించాయి. లోతైన సముద్రం కెరటాలనే చేతులను ఎత్తి నాట్యం చేసింది) అనే విధంగా రాజకుమారుడు పోయేటప్పుడు మంగళ వాద్యం మోగించినట్లు, పరమపదానికి పోయే వారిని చూసిన సంతోషం వల్ల గంభీరంగా ధ్వనించడం, ఘోషించడం చేసే మేఘ సముద్రాలనే భేరీలద్వారా కోలాహలం చేయించాడు. "**గీతంగళ్ పాడినర్ కిన్నరర్ గరుడర్ కళ్**" (కింనరులు, గరుడుడు గీతాలను పాడారు) అనే విధంగా గీతాలను పాడించాడు. "**కాలంగళ్ వలంబురి కలందెంగుమ్ ఇశైత్తనర్**" (కాహళాలతో, దక్షిణావర్త శంఖాలతో అంతటా శబ్దం వచ్చేటట్లు చేశాడు) అనే విధంగా కాహళాల (బాకాల) ధ్వనిని, శంఖధ్వనిని మోగించాడు. "**వాళ్ఒణ్ కణ్ మడందైయర్ వాళ్తినర్**" (అందమైన కన్నులను కల కన్యలు మంగళాశాసనం చేశారు) అనే విధంగా ఆశీస్సుల కోలాహలం కలిగించాడు. "**తొడర్ న్దు ఎంగుమ్ తోత్తిరమ్ శొల్లినర్**" (అంతటా స్తోత్రాలను చెప్పారు) అనే విధంగా స్తోత్ర కోలాహలంని కలిగించే వాడు. ఈ విధంగా పలు విధాలైన కోలాహలాలను పుట్టించడం మాత్రమే కాక, అర్చిరాదిగతిని, ఆతివాహిక సత్కారాలను, పరమపద దివ్యదేశ ప్రాప్తిని, అక్కడ ఉండే వారు చేసే బహుమానాన్ని, ఆనందమయమైన ఆస్థానంలో ఉండడాన్ని, తన చరణ కమల ప్రాప్తిని పొందినట్లుగా ఆళ్వార్లచే పలికించాడు. ఇది అంతా ఈ దశకంలో తెలుపబడింది.

# 100)దశమ శతకం-దశమ దశకం

# # మునియే నాన్ముకనే

గడచిన దశకంలో అర్చిరాది గతిని విశదంగా తెలిపి ఆళ్వార్లు "**అందమిల్ పేరిన్బత్తు అడియరోడిరుందమై**" (అంతులేని ఆనందాన్ని కల పరమపదంలో భగవద్భక్తులతోపాటు కలసి ఉండడాన్ని గూర్చి) తెలియజేశారు. తమ కన్నులను తెరచి



శ్రీ పరమపదనాధన్ - వైకుంఠం

చూడగా తాము పూర్వం వలె చింత చెట్టు మొదట్లోనే ఉండడాన్ని గమనించారు. నిత్యుల, ముక్తుల సమూహంలో తాము ఉన్నట్లు పలికిన స్థితి కేవలం జ్ఞానానుసంధానం మాత్రమే అయినది. ప్రకృతిలోనే తాము చిక్కుకున్న విషయాన్ని గమనించి ఆళ్వార్లు చాలా బాధపడ్డారు. తమ ఆకించన్య, అనన్యగతిత్వాలను చక్కగా గ్రహించిన భగవంతుడు ఇంకా తమను ఈ విధంగా బాధపెడుతున్నాడే! ఏమి? అని చాలా బాధపడ్డారు. తల్లిదండ్రులు

దగ్గరగా ఉన్నప్పటికీ, ఆకలితో, దాహంతో బాధపడే చంటి బిడ్డ తల్లి పేరు చెబుతూ ప్రార్థించినట్లుగా, ఆర్ద్రహృదయం, సున్నితమైన మనసు లేనివారి హృదయాలు కూడా కరగి పోయేటట్లు, అతనికి తమను పొందితే తప్ప పరమపదంలో ఉండే స్థితి సహించలేనిది అయ్యేటట్లు ఆక్రందించి, దావాగ్నిలో చిక్కుకున్నవారి వలె ఆర్తధ్వనితో, పెద్ద గొంతుకతో ప్రార్థించగా, ఆ స్వామి వచ్చి ప్రత్యక్షమై ప్రకృతి సంబంధాన్ని తీర్చి, తన భక్తుల గోష్ఠిలోకి తీసుకొనిపోయి తమను చేర్చగా కృతకృత్యులై, ఆర్తి తీరినవారై, పరమపదాన్ని పొందిన విషయాన్ని ఈ దశకంలో ఆళ్వారులు పలుకుతున్నారు. ఇక్కడ పరమ భోగ్యమైన 'నంబిళ్ళై' శ్రీసూక్తిని గమనించండి. **"ఇప్రబంధత్తుక్కు ప్రమేయమాన వస్తు– సర్వేశ్వరన్. ఇప్రబంధమ్ అవావిల్ అందాది. మయర్వఱ మదినల మరుళ ప్పెఱ్ఱవర్ కవి పాడినార్. ఇని, ఇవరుడైయ అవతారమ్ తాన్ సర్వేశ్వరనుడైయ అవతారత్తోపాది సాధుక్కళుడైయ సుకృతఫలమ్"** (ఈ ప్రబంధానికి ప్రమేయమైన అర్థం భగవంతుడు. ప్రబంధం ఏ విధమైన విచ్ఛేదం లేని అందాది. భ్రమ మొదలైన అజ్ఞానాలు విధంగా లేని విధంగా భగవంతునిచే అనుగ్రహింపబడిన జ్ఞానాన్ని కల ఆళ్వారులు ఈ ప్రబంధాన్ని రచించారు. ఇక, వీరి అవతారం భగవంతుని అవతారం వలె మహాత్ముల పుణ్యఫలం).



నమ్మాళ్వార్ మోక్షసన్నివేశం(పరమపదోత్సవం) - శ్రీరంగం

మూర్తిః సామశ్రుతీనాం సకలనిగమసంవేద్యతత్త్వార్థసారో
నానాదివ్యానుభావప్రభవబహురసైః బంధుర స్సుందరశ్చ,
త్రై రన్యస్వాపదేశక్రమరుచిరతమై రర్థరత్నై స్సమిద్ధః
సోయం శ్రీమచ్ఛఠారేః జయతి నిరుపమో భవ్యవాగుక్తిబంధః

తిరువాయ్ మొழி ప్రబంధ సారం సంపూర్ణమ్

